# సోవియట్ రష్యా

## 100 ప్రశ్నలు-సమాధానాలు



"సోవియట్ న్యూస్" ప్రచురణ.

అనువాదం:

ప్రతాప రామసుబ్బయ్య



న గా రా ప్ర చు ర ణా ల యం
అరండల్ పేట, గుంటూరు-2.

# తొలిపలుకు

ఇటీవల యూరప్, అమెరికా ఆసియాఖండ దేశాల నుండి సోవియట్ రష్యాను దర్శించిన అనేక ప్రతినిధివర్గాలు, సోవియట్ జీవిత విధానాన్ని గురించి వివరిస్తూ ఒక గ్రంథాన్ని వ్రాయమని మమ్ములను కోరారు. ఈ కోరిక ననుసరించి యీ గ్రంథం రచించబడ్డది.

సోవియట్ ప్రభుత్వ నిర్మాణాన్నిగూర్చి దేశీయ, విదేశీయ విధానాన్నిగూర్చి, ఆర్థిక సాంస్కృతిక జీవితాన్నిగురించీ వివరించి వ్రాయమని యీ ప్రతినిధి వర్గాల కోరిక. గ్రంథ ప్రచురణ విధానంగూడా ప్రశ్నలు, సమాధానాల రూపంలో క్లుప్తంగా వుండాలని వీరు సూచన చేశారు.

ఈ కోరికను మన్నించి ప్రశ్నలు, సమాధానాల రూపంలో యీ చిన్న గ్రంథాన్ని ప్రచురించడం జరిగింది.

"సోవియట్ న్యూస్"
పత్రికా నిర్వాహకులు.

# మా మాట

సోవియట్ యూనియన్‌ను గురించి వ్యతిరేకులుచేసే దుష్ప్రచార ఫలితంగా అనేకుల్లో అపోహలు కలగడం సహజం. సోవియట్ యూనియన్ గురించి వాస్తవిక విషయాలు, నిజస్వరూపాన్ని గ్రహించగోరేవారు సహేతుక సాధికార సమాధానాలను కోరడంగూడా సహజమే. ఈ గ్రంథం అపోహాలను, అనుమానాలను తొలగించడానికి సహాయపడుతుందనే విశ్వాసంతో తెలుగులో మీకు అందిస్తున్నాం.

ప్రచురణకర్తలు.

D



# ప్రశ్నలు

# సోవియట్ రష్యా-ప్రశ్నలు, సమాధానాలు

**1.—సోవియట్ సోషలిస్టు రిపబ్లికులంటే ఏమిటి?**

కార్మిక కర్షకుల సోషలిస్టు రాజ్యాంగసమాఖ్యనే సోవియట్ రిపబ్లికులంటారు. ఈ రాజ్యాంగ సమాఖ్యను లెనిన్, స్టాలిన్ మహానాయకులు స్థాపించారు.

సమానహోదా ప్రతిపత్తులుగల పదహారు సోవియట్ సోషలిస్టు రిపబ్లికులు ఐచ్ఛికంగా కలసి సోవియట్ రాజ్యాంగ సమాఖ్యలో భాగస్వాములుగా చేరాయి; రష్యన్ సోవియట్ సోషలిస్టు రిపబ్లికు, ఉక్రేనియన్, బైలోరష్యన్, ఉజ్‌బెక్, కజఖ్ జార్జియన్, అజర్‌బైజాన్, లిథుయేనియన్. మోల్డేవియన్, లట్వియన్, కిర్‌ఘిజ్, టజిక్, ఆర్మీనియన్- టర్కమెన్, ఎస్తోనియన్, కరేలో—ఫిన్నిష్ సోవియట్ సోషలిస్టు రిపబ్లికులు.

1917 అక్టోబరు సోషలిస్టు విప్లవ విజయఫలితంగా రష్యన్ సామ్రాజ్య శిథిలాలపైన యీ సోషలిస్టు సమాఖ్యఅవతరించింది. ప్రపంచ చరిత్రలో ప్రప్రథమంగా యీ మహావిప్లవం రష్యా భూభాగంలో పెట్టుబడిదారీ భూస్వామ్య వ్యవస్థను తుడిచిపెట్టి కష్టజీవులకు సర్వాధికారాన్ని సంక్రమింపజేసింది.

సోవియట్ సోషలిస్టు సమాఖ్య బ్రహ్మాండమైన శక్తిగల ప్రపంచ రాజ్యాల్లో ఒకటి. ఆ దేశం అతిశక్తివంతమైన పారిశ్రామిక, వ్యావసాయపాటవంగలది. ఇటు తూర్పు యూరప్ నుంచి మధ్యఆసియాల మీదుగా అటు దూరప్రాచ్యంవరకూ

విస్తరించి ఉంది యీ సోవియట్ ప్రజారాజ్యం. ప్రపంచంలో ఆరోవంతు భూభాగం కలిగిన సోవియట్ యూనియన్ వైశాల్యం 85 లక్షల చదరపుమైళ్లు. అలాస్కాను మినహాయిస్తే, అమెరికా వైశాల్యానికి మూడురెట్లుంది సోవియట్ యూనియన్ వైశాల్యం. పశ్చిమ యూరపియన్ రాజ్యాలన్నింటినీ మొత్తంగా తీసుకున్నా, వాటివైశాల్యంకన్న నాల్గురెట్లెక్కువ ఉంటుంది. ఈ విశాల భూఖండంలో 20 కోట్ల ప్రజానీకం నివసిస్తున్నారు.

సోవియట్ యూనియన్ చిత్రవిచిత్రాలైన ప్రకృతి శోభతో యెంతో రమణీయంగా వుంటుంది. ప్రపంచంలో మరేదేశంనూ లేని భూగర్భ ప్రకృతి సంపద—సమస్తలోహాలూ, బొగ్గు, నూనె—సోవియట్ యూనియన్‌లో లభ్యమౌతుంది. విద్యుదుత్పత్తి కవసరమయ్యే సాధన సంపత్తి యావత్తూ పుష్కలంగా దొరుకుతుంది. సముద్రాలు, సరస్సులు, మహానదీనదాలన్నింటిలో చేపలు అపరిమితం. అటవీసంపద అపారమైన భాగ్యాన్ని సమకూర్చిపెట్టేదిగా ఉంది.

జార్ కాలంలో రష్యా ఆర్థికంగానూ, సాంకేతికంగాను యెంతో వెనుకబడి ఉండేది. సోవియట్ ప్రభుత్వస్థాపన తర్వాత సర్వతోముఖంగా అభివృద్ధియై, పారిశ్రామికంగా వ్యావసాయకంగా కమ్యూనిస్టుపార్టీ నాయకత్వంక్రింద శరవేగంతో పురోగమించింది. మూడు దశాబ్దాలనాడు పాశ్చాత్య రాజ్యాలకన్నా యెంతో వెనుకబడియున్న సోవియట్ రష్యా యీ నాడు వాటిని తలదన్నేస్థితికి వచ్చింది. ఆర్థికంగా యితర దేశాలమీద ఆధార పడనవసరం లేని స్వయం సంపూర్ణ దేశం సోవియట్ యూనియన్.

పారిశ్రామికాభివృద్ధి గమనంలోనూ, ఉత్పత్తి విధానం లోనూ, రెండో ప్రపంచయుద్ధానికి పూర్వమే పెట్టుబడిదారీ దేశాలను అధిగమించింది.

సోవియట్ యూనియన్‌లో సోషలిస్టు సామాజికవ్యవస్థ దిగ్విజయంగా సాగిపోతూంది. ఉత్పత్తి శక్తులమీద వ్యక్తిగత పెత్తనమంటూ లేదు. మిల్లులు, ఫ్యాక్టరీల్లో యీనాడు పెట్టు బడిదార్లు మచ్చుకైనాలేరు. పంటభూముల్లో కష్టించి పనిచేసే స్త్రీ పురుషులను పీడించుకుతినే భూస్వామి లేడీనాడు.

సోషలిస్టు ఆర్థిక విధానంపైనే సోవియట్ ఆర్థిక వ్యవస్థ నిర్మింపబడ్డది; దీని పునాదిమీదనే సోవియట్ జీవితసౌధమంతా ఆధారపడిఉంది. ఉత్పత్తి శక్తులన్నీ సమాజపరమైన విధానానికి గూడా యిదే మూలాధారం. జాతీయ ఆర్థిక జీవనమంతా యేకీకృతమైన ప్రభుత్వపథకం ప్రకారం అభివృద్ధిచెందుతున్నది. ఆర్థిక సంక్షోభాలనీ, నిరుద్యోగమనీ, దారిద్ర్యమనీ కలికానికైనా లేవు.

సోవియట్ యూనియన్‌లో మనిషిని మనిషి పీడించుకు తినే విధానంలేదు. ఒకజాతిని వేరొకజాతి అణచివేయడం లేనే లేదు. మానవ చరిత్రలో ప్రథమ పర్యాయంగా ప్రజల నైతిక, రాజకీయ ఐక్యత సాధించబడింది ఒక్క-సోవియట్ రష్యాలోనే.

కష్టజీవులంతా తమకు తామే — కార్మికులు, కర్ష కులు, మధ్యతరగతి మేధావులు — తమ రాజ్యాన్ని పాలించు కుంటూ, తమ జాతీయ ఆర్థిక విధానాన్ని రూపొందించు కుంటారు. ఉత్పత్తయిన భౌతిక సంపదకంతా అధినేతలై అనుభవిస్తారు. ఈ భౌతిక సంపదంతా "ఎవడి శక్తికి

తగినట్టు వాడు కృషిచేసి అందుకు తగిన ప్రతిఫలం పొందాలి అనే సూత్రాన్నాధారంగా చేసుకుని వినిమయం జరుగుతుంది.

అంటే, కష్టించి జీవించే స్త్రీ పురుషాదులంతా తమ పని భారాన్ని బట్టి, నైపుణ్యాన్ని బట్టి జాతీయ సంపద ననుభ విస్తారన్నమాట. ఇదే సోషలిజమంటే అర్థం. కమ్యూనిస్టు సమాజ నిర్మాణానికిదే ప్రాథమిక దశ. ఈనాడు సోవియట్ యూనియన్ క్రమానుగతంగా సోషలిస్టు దశ నుండి కమ్యూనిస్టు వ్యవస్థకు పురోగమిస్తోంది. సోవియట్ ప్రజానీకం కమ్యూనిస్టు సమాజ నిర్మాణమే తమ పరమాశయంగా నిర్ణయించుకున్నది.

---

## 2.—సోవియట్ యూనియన్‌ను పాలించేదెవరు?

సోవియట్ రష్యాపై అధికారమంతా పట్టణ, గ్రామీణ ప్రజానీకానికి చెందిఉంది. వీరి ప్రతినిధులచే నిర్మింపబడ్డ సోవియట్ సంస్థలే దేశానికి రాజకీయ వెన్నెముక. ఈ సోవియట్ ప్రతినిధులంతా రహస్య బ్యాలెట్ విధానం మీద, సార్వజనీన ప్రత్యక్ష ఓటింగు పద్ధతిపై సరిసమాన హోదాతో యెన్నుకోబడ్డవారే.

ప్రతి ప్రతినిధీ తన నియోజక వర్గానికి బాధ్యుడు. ఎన్నిక పూర్తయిన తర్వాత ప్రభుత్వ కార్యనిర్వాహక శాఖలో ప్రవేశించే వ్యక్తులు మినహా, అత్యధిక సంఖ్యాకులైన యితరులంతా తమ తమ స్థానాల్లో క్రమబద్ధమైన

కార్యభారాన్ని నిర్వహిస్తూ ఉంటారు. వీరి ద్వారానే సోవియట్ ప్రజాసంస్థలు వివిధ నియోజక వర్గాలతో సన్నిహిత సంబంధాలు స్థాపించుకుంటాయి.

సోవియట్ యూనియన్‌లో అత్యున్నత రాజకీయ సంస్థ పేరు సుప్రీం సోవియట్. ఈ మహాసంస్థ నాలుగేండ్ల కోసారి దేశవ్యాపితమైన యెన్నికల ద్వారా నిర్మింపబడుతుంది. 1950 మార్చి నెలలో యెన్నికైన యిప్పటి మూడో సుప్రీంసోవియట్‌లో 1316 మంది ప్రతినిధులున్నారు. వీరిలో 418 మంది కార్మికులు, 269 మంది కర్షకులు. మిగిలిన వారంతా మేధావులూ, ప్రభుత్వ ప్రజాసంస్థలకు చెందిన నాయకులు, రక్షణశాఖకు చెందిన వ్యక్తులు. ఈ ప్రజా ప్రతినిధుల్లో 28 మంది స్త్రీలు గూడా ఉన్నారన్న విషయం గమనించాలి. ( 70 వ జవాబు చూడండి )

ఈ సుప్రీం సోవియట్‌లో తిరిగి రెండు శాసన సభలుంటాయి — 1. యూనియన్ సోవియట్, 2. జాతుల సోవియట్ (Soviet Of Nationalities) యూనియన్ సోవియటులోని ఒక్కొక్క ప్రతినిధిని 3 లక్షలమంది ప్రజ లెన్నుకుంటారు. ఈ యూనియన్ సోవియటు, జాతి, మత వివక్షతలేక సోవియటు పౌరుల సమిష్టి ప్రయోజనాలను పరిక్షిస్తుంది.

సోవియటు యూనియన్‌లోని వివిధ రిపబ్లికుల ద్వారానూ, స్వాతంత్ర్యాధికారంగల (Autonomous) యితర రిపబ్లికులు, జాతీయ, ప్రాంతీయ భూభాగాల ద్వారానూ, "జాతుల సోవియటు" ( Soviet Of Nationalities ) యెన్నుకోబడుతుంది. ఈ విధంగా జాతుల సోవియటు వివిధ జాతుల

యొక్క, జాతీయాంతర్భాగాల్లోని శాఖలయొక్క ప్రయోజ నాలను ప్రతిబింబిస్తుంది. సోవియటు పౌరులకుగల సర్వాధి కారం సుప్రీం సోవియటులో ప్రతిష్టించబడింది. సోవియటు ప్రజల తరఫున సర్వాధికార ప్రతినిధిగా యీ సుప్రీం సోవి యటు వ్యవహరిస్తుంది. సోవియటు యూనియన్‌కు చెందిన శాసనాధికారం యావత్తూ సుప్రీం సోవియటు చెలాయిస్తుంది. ఇది జారీచేసే శాసనాలు అన్ని యూనియన్ రిపబ్లికులలోనూ సమానస్థాయితో అమలు జరుగుతాయి. దేశంలోని ప్రభుత్వ శాఖలు, సంస్థలు, ప్రజలూ — అందరూ యీ శాసనాలను పాటించవలసినవారే. ఈ చట్టాలూ, శాసనాలూ సోవియటు యూనియన్‌లోని కష్టజీవుల మనస్సంకల్పాన్నీ, ప్రయోజనాల్నీ ప్రతిబింబిస్తాయి.

ప్రతి సంవత్సరం సోవియటు యూనియన్ బడ్జెటును రెవిన్యూ విధానాన్నీ, ఆదాయవ్యయ పథకాలనూ సుప్రీం సోవియటు ఆమోదించాలి. సుప్రీం సోవియటు సమావేశాలు జరిగినప్పుడల్లా జాతీయార్థిక అభివృద్ధి ప్రణాళికలను గురించి చర్చ జరుగుతుంది. చర్చఫలితంగా సుప్రీంసోవియటుచే అంగీక రించబడ్డ జాతీయార్థిక ప్రణాళిక సోవియటు యూనియన్ యొక్క ఆర్థిక జీవితానికంతకూ ఒకేఒక శాసనంగా రూపొందు తుంది.

అంతర్జాతీయ వ్యవహారాల్లో సోవియట్ యూనియన్ కంతకూ ప్రాతినిధ్యంవహించే హోదాకూడా యీ సుప్రీం సోవి యటుకే వుంది. ఇతర రాజ్యాలతో సంధులు చేసుకొనడం గానీ, రద్దుచేసుకొనడంగానీ, శాంతి యుద్ధ సమస్యలనుగురించి

నిర్ణయాలు చేయడంగానీ, కొత్త రిపబ్లికులను సోవియటు యూని యన్‌లో అంతర్లీనం చేసుకోనడంగానీ, సోవియటు యూనియన్ రక్షణ నిర్మాణ సమస్యలపైగానీ, సాయుధసైన్యాలను నిర్మించి నడపడంలోగానీ, దేశీయభద్రత, విదేశాంగ వ్యాపారాది విష యాల్లోగానీ సుప్రీం సోవియటుదే సర్వాధికారం.

ఉభయ శాసనసభలూ సమావేశమైనప్పుడు, సుప్రీం సోవియటు తన అధిష్ఠాన వర్గాన్ని యెన్నుకొని దేశం మొత్తాని కంతకూ ప్రభుత్వాన్ని యేర్పరుస్తుంది: సుప్రీం కోర్టును గూడా అప్పుడే యెన్నుకుంటుంది. సోవియటు యూనియన్‌లోని ఉన్నత ప్రభుత్వ శాఖలన్నిటికీ సుప్రీంసోవియటు మార్గదర్శిగా, వాటిపై పెత్తనాన్ని తన ఆధీనంలో ఉంచుకుంటుంది. సుప్రీంసోవియటు లోని రెండుసభలకూ సమానహోదా, ప్రతిపత్తులుంటాయి. ఈ రెండింటిలో దేనిలోనైనా ఒక శాసనాన్ని ప్రవేశపెట్టవచ్చు. రెండుసభలూ, లాంఛనప్రాయమైన మెజారిటీ ఓటుతో ఒక చట్టాన్ని ఆమోదించే పక్షంలో అది శాసనమౌతుంది.

అత్యున్నతాధికారంగల సుప్రీం సోవియటు ప్రత్యక్షం గానూ, దాని ఆధ్వర్యాన వ్యవహరించే ఉపాంగాలద్వారానూ రాజ్యపాలన చేస్తుంది. ఈ ఉపాంగాల్లో "అధిష్ఠానవర్గం" (presidium) ఒకటి. ఈ "అధిష్ఠానవర్గం" సోవియటు యూని యన్‌లోని ప్రభుత్వ ఉపాంగాల్లో అత్యున్నతమైనది. సుప్రీం సోవియటు యేటా రెండుసార్లు సమావేశమైన తరుణంలోగానీ, ప్రత్యేక సమావేశాల్లోగానీ యీ అధిష్ఠానవర్గం దానిపక్షాన అత్యున్నతస్థాయీ సంఘంగా వ్యవహరిస్తుంది. సుప్రీం సోవి యటును సమావేశపర్చడం, కొత్త ఎన్నికలను జరిపించడం,

యితర దేశాలతో సోవియటు రష్యా చేసుకున్న ఒడంబడికలను స్థిరపర్చడం, సోవియటుమీద శత్రు దండయాత్ర జరిగినప్పుడు యుద్ధ పరిస్థితిని ప్రకటించడం, దేశరక్షణకు సైనిక సమీకరణ చేయడం, యీ అధిష్ఠానవర్గపు బాధ్యత. సాయుధ సైన్యాల న్నిటికీ నాయకత్వాన్ని నియమించడం,విదేశాలకు, సర్వాధికార ప్రతినిధులను నియోగించటం గూడా .యీ అధిష్ఠానవర్గపు కార్యకలాపనే. అర్హతగలవారికి బిరుదులివ్వడం, పతాక బహూకరణాలు చేయడంగూడా అధిష్ఠానవర్గపు బాధ్యతే. సుప్రీం సోవియటుచే జారీచేయబడే శాసనాల కెంత విలువ వున్నదో, ఆలాంటి డిక్రీలనే అధిష్ఠానవర్గం గూడా యూనియన్ రిపబ్లికు లలో అమలు జరపడానికధికారం ఉంది. అయితే, యీ శాస నాలు దేశంమొత్తానికి వర్తించే ఫెడరల్ చట్టాల నాధారంచేసు కుని, వాటికి లోబడివుండాలి. ఇదే శాసనాలకూ డిక్రీలకూ గల తేడా.

సుప్రీం సోవియట్‌కు చెందిన రెండు సభలూ సమా వేశమైనప్పుడు అధిష్ఠాన వర్గం యెన్నికవుతుంది. ఒక అధ్య క్షుడు, 16 గురు ఉపాధ్యక్షులు, (ఒక్కొక్క రిపబ్లికుకు ఒక్కొ క్కరు) ఒక కార్యదర్శి, 15 గురు సభ్యులు యీ అధిష్ఠాన వర్గా నికి యెన్నుకోబడతారు.

---

## 3.—సోవియట్ మంత్రిమండలి అధికారాలేవి ?

సోవియట్ మంత్రిమండలి దేశపరిపాలనా వ్యవస్థలో అత్యున్నతమైన నిర్వాహక శాఖ. ఈమంత్రిమండలి ఉభయ సభలూ సమావేశమైనప్పుడు సుప్రీం సోవియట్ చేత నియమించబడుతుంది. ఈ మంత్రిమండలిలో ఒక అధ్యక్షుడు, కొందరు ఉపాధ్యక్షులు, మంత్రులు, మంత్రిమండలి అధ్యర్యాన, వారితో సరిసమాన హోదాగల స్థానాల్లో పనిచేసే కమిటీల అధ్యక్షులు — వీరంతా నియమితులౌతారు. మంత్రిమండలి, సుప్రీం సోవియట్‌కో లేక, సుప్రీం సోవియట్ సమావేశాల మధ్యకాలంలో వ్యవహరించే అధిష్ఠాన వర్గానికో బాధ్యతకలిగి ప్రవర్తిస్తుంది. ఆ యా సమయంలో అమల్లో ఉన్న చట్టాల ప్రాతిపదికపైన మంత్రిమండలి తమ నిర్ణయాలను, డిక్రీలను జారీచేసి, అమలు జరిగేటట్టు చూస్తుంది. వివిధ మంత్రిత్వశాఖల కార్యకలాపాలను సమన్వయ పరచడం, పరిపాలనా విధానం సాఫీగా సాగిపోయేట్టు చూడడం, జాతీయ ఆర్థిక విధానాన్ని జయప్రదంగా నిర్వహించడం యీ మంత్రిమండలి బాధ్యత. జాతీయార్థిక ప్రణాళిక, ప్రభుత్వ బడ్జెటు నిరాఘాటంగా సాగిపోవడాని కవసరమయ్యే ప్రతి చర్యనూ మంత్రిమండలి విధిగా అవలంబిస్తుంది. ఇంతే గాక, దేశ శాంతిని రక్షించడానికీ, జాతీయ ప్రయోజనాలను కాపాడడానికీ, సోవియట్ పౌరుల హక్కులను పరిరక్షించడానికీ మంత్రిమండలి అవసరమైన అన్ని బాధ్య

తలను స్వీకరిస్తుంది. విదేశాలతో గల సంబంధ బాంధవ్యాలను చక్కదిద్దడంలోనూ, సాయుధ సైన్యాల అభివృద్ధిని నిర్ణయించి నడపడంలోనూ సోవియట్ మంత్రిమండలి అత్యంత శ్రద్ధాసక్తులతో వ్యవహరిస్తుంది. సోవియట్ ప్రజావాణిని ప్రతిబింబించే సోవియట్ రాజ్యాంగ విధానంపైన ఆధారపడే సోవియట్ ప్రభుత్వం పరిపాలనా విధానం కొనసాగిస్తుంది.

సోవియటు యూనియన్‌లోని వివిధ జాతీయ ప్రభుత్వాలూ, స్వతంత్రాధికారంగల్గిన యితర రిపబ్లికుల ప్రభుత్వాలూ సోవియటు సమాఖ్య ప్రభుత్వవిధానం మీదనే యేర్పడతాయి. వేర్వేరు రిపబ్లికు మంత్రిమండలుల నిర్మాణాన్ని వాటి అధికారాల్ని, ఆయా రిపబ్లికుల రాజ్యాంగ చట్టాలు వివరంగా విశదీకరిస్తాయి.

---

## 4.—యూనియన్ రిపబ్లికుల అధికారాలేవి?

ప్రతియూనియన్ రిపబ్లికూ కార్మిక,కర్షకుల ఆధిపత్యంగల సోషలిస్టురాజ్యం. ఈ రిపబ్లికులన్నీ ఐచ్ఛికంగా సోవియటు యూనియన్‌లో చేరినవే. వీటన్నిటికీ సరిసమానహోదా ప్రతి పత్తులున్నాయి. స్థానిక ప్రభుత్వ సంస్థలనుండి ఉన్నత శాఖల వరకూ నడిచే కార్యకలాపాలన్నీ ఆయా రిపబ్లికు ప్రజల వాడుక భాషలో జరుగుతాయి. సోవియటు యూనియన్‌లో చేరిన ప్రతి రిపబ్లికూ సంపూర్ణస్వాతంత్ర్యంతో వ్యవహరిస్తుంది.

అంటే, తనంతట తాను సోవియటు యూనియన్‌కు అప్ప గించిన అధికారాలు మినహా, తక్కిన రాజ్యాంగ విషయాల్లో సంపూర్ణ స్వాతంత్ర్యం చలాయిస్తుందన్నమాట.

ప్రతి రిపబ్లికుకూ తన స్వంత రాజ్యాంగచట్టం అంటూ ఒకటుంది. ఈ చట్టాన్ని ఆయా రిపబ్లికుల సుప్రీం సోవియటు ఆమోదించితీరాలి. ప్రతి రిపబ్లిక్ చట్టం, ఆ రిపబ్లిక్ ప్రజల జాతీయ ఆర్థిక, సాంస్కృతిక లక్షణాలను, ప్రయోజనాలను విస్పష్టంగా ప్రతిబింబిస్తుంది. ఈ రిపబ్లికుల రాజ్యాంగచట్టాలన్నీ అఖిల సోవియటు యూనియన్ రాజ్యాంగ చట్టాన్ని అనుస రించే తయారు చేయబడ్డాయి.

ప్రతి రిపబ్లికులోనూ పరిపాలనా సౌలభ్యంకోసం, అంగాలూ, ఉపాంగాలు ఏర్పడతాయి. వీటన్నిటికీ శాసనసభా, నిర్వాహక, పరిపాలనాధికారాలు సంక్రమిస్తాయి. రిపబ్లికు కంతకూ వర్తించే చట్టాలు, శాసనాలూ, సుప్రీం సోవియట్‌లో రూపొందబడి అమలు జరుపబడతాయి.

అవసరమైతే, సోవియటు యూనియన్‌నుంచి చీలిపోయే సర్వహక్కులూ ప్రతిరిపబ్లికు చలాయిస్తుంది. సోవియటు యూని యన్‌లోచేరే ప్రతి రిపబ్లికుం తన భూభాగంమీద అవిభాజ్య మైన సర్వాధికారం ఉంచుకుంటుంది. తన భూభాగంలో ఒక అంగుళంగూడా తన సమ్మతిలేనిదే స్వాధీనపర్చటానికి గానీ, అన్యా క్రాంతం చేయడానికిగానీ వీల్లేదు. యూనియన్ రిపబ్లికుల సరి హద్దులను తారుమారు చేయడంగానీ, సరిదిద్దడంగానీ అఖిల సోవియటు యూనియన్ సుప్రీం సోవియటు యొక్క సంపూర్ణా మోదంతో జరగవలసిందే.

ఇతర దేశాలతో దౌత్య సంబంధబాంధవ్యాల నేర్పరచు కోడానికీ, ఒడంబడికలు చేసుకోడానికీ ప్రతి రిపబ్లికుకూ అధికార ముంది. ప్రస్తుతం యుక్రేనియన్ సోషలిస్టు రిపబ్లికూ, బైలో రష్యన్ రిపబ్లికూ ఐక్యరాజ్యసమితిలో సభ్య దేశాలు.

సోవియటు యూనియన్ రాజ్యాంగచట్టరీత్యా, సోవి యటు ప్రభుత్వం, వివిధ రిపబ్లికుల స్వేచ్ఛా స్వాతంత్ర్యాలను రక్షించి తీరాలి. ఈ మహాభారాన్ని సోవియటు ప్రభుత్వం అత్యంతదీక్షాదక్షతలతో నిర్వహిస్తున్నదిగూడా. జర్మన్ఫాసిస్టు మూకలు సోవియటు యూనియన్పై విరుచుకుపడ్డప్పుడు అభేద్యమైన ఐక్యశక్తితో సోవియటు ప్రభుత్వం నిర్మించిన ప్రతి ఘటనలో సోవియటు ప్రజానీకంయావత్తూ ఒక మహాశక్తిగా విజృంభించి పోరాడారు.

అఖిల సోవియటు యూనియన్కు చెందిన సుప్రీం సోవి యటులో ప్రతి రిపబ్లికూ — సంపూర్ణ స్వేచ్ఛతో సమాన ప్రతి పత్తితో పాల్గొనే అవకాశం ఉంది. తమ జనాభా నిష్పత్తి ప్రకారం ప్రతిరిపబ్లికూ సుప్రీంసోవియటుకు ప్రతినిధులను పంపు తూంది. ఇదేవిధంగా 'జాతుల సోవియటు'కు కూడా జనాభా నిష్పత్తి ప్రమేయం లేకుండానే అదే సంఖ్యగల ప్రతినిధులను పంపే అధికారముంది.

**౮.—స్వతంత్రి సోవియట్ రిపబ్లికులంటే ఏమిటి? స్వతంత్రి మండలాలు, జాతీయ భూప్రదేశాలంటే ఏమిటి ?**

కొన్ని రిపబ్లికుల్లో, అదే పేరుగల జాతులతోపాటు, ఇతర జాతీయులుగూడా నివసిస్తున్నారు. ఈ జాతీయులంతా

ఒక విస్పష్టమైన ఆచారవ్యవహారాలు, భాషా, విజ్ఞానసంస్కృతీ లక్షణాలుగల అల్ప సంఖ్యాకులని వేరే చెప్పనక్కర్లేదు. ఈ అల్ప సంఖ్యాకులు వారికి అంగీకారమైతే—స్వతంత్ర రిపబ్లికు లుగా గూడా ఏర్పడి వ్యవహరించుకోవచ్చు. ఇలాంటి స్వతంత్ర రిపబ్లికులన్నీ యూనియన్ రిపబ్లికుల అంతర్భాగాలుగా తమ ఉనికిని స్థిరం చేసుకుంటాయి.

ఉదాహరణకు: రష్యన్ సోషలిస్టు రిపబ్లికు సరిహద్దుల్లో టాటార్లు, బష్కిర్లు, డాఘేస్తాన్లు, బర్యత్ మంగోలియన్లు మొద లైన స్వతంత్ర జాతీయులు నివసిస్తున్నారు; జార్జియన్ సోషలిస్టు రిపబ్లికులో ఆబ్ఖాజియన్, అడ్జార్ స్వతంత్ర రిపబ్లిక్కులున్నాయి. ఇదే విధంగా ఒక్కొక్క యూనియన్ రిపబ్లికులో భిన్నవిభిన్నా లైన జాతీయులు నివసిస్తున్నారు.

స్వతంత్రి రిపబ్లికుల హక్కులేమిటి ?

ఈ స్వతంత్రరిపబ్లిక్కుల్లో నివసించే ప్రజానీకానికి వారి జాతీయ హక్కులకు సంబంధించినంతవరకు స్వయం నిర్ణయాధి కారం వుంటుంది. ఈ రిపబ్లికుల్లోని అధికార అనధికార సంస్థ లన్నీ, ఆ రిపబ్లిక ప్రజల భాషల్లోనే కార్యకలాపాలన్నీ నెరపు తాయి. ప్రతి స్వతంత్ర రిపబ్లికుకూ ఒక రాజ్యాంగ చట్టం ఉంటుంది. ఆ యా జాతుల ప్రత్యేక భాషా సంస్కృతులు, ఆచారవ్యవహారలక్షణాలు రాజ్యాంగచట్టంలో ప్రతిబింబిస్తాయి. ఈ చట్టం యూనియన్ రిపబ్లిక్, అఖిల సోవియటు రిపబ్లికు చట్టాల ననుసరించే తయారుకాబడుతుంది. ఈ రిపబ్లికు తన చట్టాలను, నిబంధనలను తానే రూపొందించుకుంటుంది. ఈ చట్టాలు తన భూభాగంలో తప్పనిసరిగా అమల్లో పెట్టితీరాలి.

వీటితోపాటు, అఖిల సుప్రీం సోవియటు శాసనాలు, యూని యన్ రిపబ్లికుచట్టాలు స్వతంత్రరిపబ్లికు భూభాగంలో అమల్లోకి వస్తాయి. ఈ స్వతంత్ర రిపబ్లికుల సరిహద్దులను ఆయా యూని యన్ రిపబ్లికుల్లోని అత్యున్నతప్రభుత్వాధికారవర్గం స్థిరీకరిస్తుంది.

ఈ స్వతంత్ర రిపబ్లికులకు గూడా సుప్రీం సోవియటు, మంత్రివర్గాలూ మొదలైన పరిపాలక శాఖలుంటాయి. అఖిల సుప్రీం సోవియటులోను, యూనియన్ రిపబ్లికుసోవియటులోను, యీ స్వతంత్ర రిపబ్లికులకు సరిసమాన ప్రాతినిధ్యం ఉంటుంది. అఖిల సుప్రీం సోవియటు సభ్యత్వ నిర్ణయంలో యీ స్వతంత్ర రిపబ్లికులకు మిగిలినవాటితోపాటు సరిసమాన హక్కుంటుంది.

సోవియటు ప్రజారాజ్యనిర్మాణంలో ప్రత్యేక జాతీయుల స్వతంత్ర భూభాగాలంటూ వెలిసినాయి. ఈ జాతీయులకు నిర్దిష్టమైన లక్షణాలు కొన్ని ఉన్నాయి. రష్యన్ సోషలిస్టు రిపబ్లికులోను, అజర్‌బైజాన్ రిపబ్లికులోను యిట్టిజాతులనేకం ఉన్నాయి. సాధారణమైన పరిపాలిత భూభాగాల ప్రజలకన్నా, స్వతంత్ర రిపబ్లికులు అదనంగా కొన్ని అధికారాలు చలా యిస్తాయి. రాజ్యాంగయంత్రంలోను, విద్యాలయాల్లోను ఏ భాష వాడాల్నో స్వతంత్ర రిపబ్లికులకు నిర్ణయాధికార ముంటుంది.

అఖిల సోవియట్ జాతుల మహాసభకు యీ రిపబ్లి కులు ప్రత్యక్షంగా తమ ప్రతినిధుల నెన్నుకుంటాయి. ఈ స్వతంత్ర మండలాలకు ఆధిపత్యం వహించే సోవియట్లు ఆ యా జాతీయుల ప్రత్యేక లక్షణాల ననుసరించి చట్టాలను, శాసనా లను రూపొందించి అమలు జరుపుకుంటాయి. యూనియన్

రిపబ్లికు యొక్క సుప్రీం సోవియట్ యీ చట్టాలను, శాసనాలను ఆమోదించాలి.

ఇకపోతే, అల్పసంఖ్యాకులైన జాతీయులు వేర్వేరు జాతీయ భూభాగాల్లో నిర్మాణరూపంలో నేడు జీవితం గడుపుతున్నారు. ఈలాంటి అల్పసంఖ్యాకులైన పది జాతీయ వర్గాలు అధిక సంఖ్యలో రష్యన్ సోషలిస్టు రిపబ్లిక్ ఉత్తర భాగంలో ఉన్నాయి. ఈ జాతీయ భూభాగాలు కూడా తమ శాసన సభల ద్వారా అఖిల సోవియట్ జాతుల మహాసభకు నేరుగా తమ ప్రతినిధులను పంపే విధానం తమ రాజ్యాంగ చట్టంలో స్పష్టీకరించుకున్నాయి.

యూనియన్ రిపబ్లికు, స్వతంత్ర రిపబ్లికు, స్వతంత్ర మండలాలు, జాతీయ భూభాగాలు — క్రమానుగతమైన యీ సోవియట్ రాజ్యాంగ నిర్మాణ యంత్రమంతా అఖిల సోవియట్ యూనియన్‌లో వివిధ జాతీయుల ఆర్థిక రాజకీయ సాంస్కృతిక సుఖజీవనాని కవసరమైన సౌకర్యాలన్నీ సమకూరుస్తున్నది. ఈ రాజ్యాంగ యంత్రంలోని వివిధ ప్రభుత్వ శాఖలు, ఉపశాఖలు సోవియట్ ప్రజానీకం యొక్క సమగ్రమైన సుఖజీవనోపాధి కొరకై కంకణం కట్టుకుని నిర్విరామ కృషి చేస్తున్నాయి.

---

## 6.—స్థానిక సోవియట్ అధికారాలేమిటి ?

గ్రామ, పట్టణ, జిల్లా, మండల సోవియట్లన్నీ ఆ యా భూభాగాలను పరిపాలించే ప్రభుత్వ అంగాలూ, ఉపాంగాలుగా వ్యవహరిస్తాయి. స్థానిక, సాంస్కృతిక, ఆర్థిక వ్యవహారాలన్నీ యీ ప్రభుత్వ శాఖలే నిర్వహిస్తూ దేశరక్షణ, ఆంతరంగిక శాంతిని భద్రపరుస్తాయి. శాసనాలను అమలు పరచడం, ప్రజాహక్కులను సంరక్షించడం వీటి విధి. ప్రజానీకాని కవసరమైన సౌకర్యాలను సమకూర్చి, తృప్తిపరచడం, స్థానిక బడ్జెట్‌ను తయారుచేయడంగూడా యీ స్థానిక సోవియట్ల కర్తవ్యం.

దైనందిన కార్యకలాపాలను నిర్వహించడం కోసం ప్రతి సోవియట్ ఒక కార్యనిర్వాహకవర్గం ఎన్నుకొంటుంది. ఈ కార్యనిర్వాహకశాఖ సోవియట్‌కు బాధ్యత వహిస్తుంది. కార్యనిర్వాహక వర్గానికి అనేక శాఖలు, ఉపశాఖలుంటాయి. ఉదా: పబ్లిక్, విద్య, ప్రజారోగ్యం, మునిసిపల్ సౌకర్యాలు, స్థానిక పరిశ్రమలు, వ్యాపారం, వ్యవసాయం మొదలైనవి. సోవియట్ సభా సభ్యుల్లో నుంచీ, ఇతర ప్రజల నుంచీ స్థాయీ సంఘాలేర్పడుట గూడా కద్దు. ప్రజలతో సన్నిహిత సంబంధం ఏర్పరచుకొని, వారి అవసరాలను తీర్చి, అధికార్ల ముందు ప్రజలుంచే సమస్యలను పరిష్కరించే బాధ్యత యీ స్థాయీ సంఘాలది.

స్థానిక సోవియట్లు రెండేండ్లకొకసారి ఎన్నికవుతాయి. స్థానిక ప్రభుత్వ శాఖలెలా తమ కార్యభారాన్ని నిర్వహిస్తాయో యీ ఎన్నికలు ఒక సమగ్రసమీక్షగా పరిణామంచెంది ఉపకరిస్తాయి. ఓటర్లు తమ ప్రతినిధులూ, సోవియట్లూ నిర్వహించిన కార్యకలాపాలను గురించి తమ అభిప్రాయాన్ని ప్రకటించి, లోపాలను యెత్తి చూపడంద్వారా కొత్తగా యెన్నుకోబడ్డ సోవియట్లకు తమ ఆదేశాలందిస్తాయి.

స్థానిక సోవియట్లు రాజ్యపరిపాలనా కార్యకలాపాల్లో ప్రజానీకాన్ని విరివిగా పాల్గొనే అవకాశాలు కల్పిస్తాయి.

---

## 7.—సోవియట్లు ఎలా యెన్నుకోబడతాయి ?

గ్రామ సోవియటు నుండి సుప్రీం సోవియటు వరకూ ప్రజా ప్రతినిధులంతా సార్వజనీన, సమాన ప్రత్యక్ష ఓటింగు విధానంపైనా, రహస్య బ్యాలెటు ద్వారా ఎన్నికవుతారు.

సోవియటు యూనియన్‌లో యెన్నికలన్నీ, సార్వజనీనమూ, సమాన ప్రతిపత్తిగలవిగా ఉంటాయి. లింగ, మత, హోదా, జాతి, వివక్షతలేక 18 సంవత్సరాలు నిండిన ప్రతి పౌరుడూ యెన్నికల్లో పాల్గొనవచ్చు. తాముని వసించే భూభాగాల్లోనే గాక, సోవియటు యూనియన్‌లోని మరే ప్రాంతమందైనా సోవియటు పౌరులు ఓటుచేయవచ్చు.

సైనికులకుగూడా యితరపౌరులవలెనే ఓటుచేసేహక్కు ఉన్నది. వోటు హక్కు కోల్పోయిన ఖైదీలకు ఓటు చేసే

హక్కూ, అభ్యర్థిగా నిలబడేహక్కూ శిక్షాపరిమితిదాటేవరకూ ఉండదు. వీరేగాక, చిత్తచాంచల్యం చెందినవారూ, పిచ్చివారూ పై హక్కు కోల్పోతారు. ప్రతి పౌరుడికి ఒకే వోటుహక్కు ఉంటుంది. సోవియటు రష్యాలో ఎన్నికలన్నీ ప్రత్యక్షమైనవి. సుప్రీం సోవియటుతో సహా అన్ని స్థానిక సోవియట్ల సభ్యులూ ప్రతినిధుల ద్వారాగాక వోటర్లచేతనే ప్రత్యక్షంగా యెన్నుకోబడతారు.

సుప్రీం సోవియటుకు అభ్యర్థిగా నిలిచే పౌరుడు 23 సంవత్సరాలు నిండినవాడై ఉండాలి. 21 సంవత్సరాలు నిండిన యేవ్యక్తైనా యూనియన్ రిపబ్లికు సభ్యుడుగాగానీ, స్వతంత్ర రిపబ్లికు సభ్యుడుగాగానీ యెన్నికకావచ్చు. 18 యేండ్లు నిండిన యే పౌరుడైనా స్థానిక సోవియటుకు అభ్యర్థిగా నిలవవచ్చు.

ఎన్నికలన్నీ రహస్య వోటింగు ద్వారా జరుగుతాయని యిదివరకే తెలుసుకున్నాం. ఓటరే స్వయంగా బ్యాలటు కాగితం మీద వివరాలన్నీ పూర్తిచేయాలి. ఆ సమయంలో మరెవ్వరూ అక్కడ ఉండగూడదు. వివరాలు పూర్తిచేయగానే బ్యాలెటు ముక్కను పెట్టెలో వదిలిపెడతాడు. ఈ పద్ధతి మూలంగా యెలా ఓటుచేసిందీ యెవరికీ తెలియదు. ఓటింగు విధానంలో సంపూర్ణ స్వేచ్ఛ యివ్వడం ద్వారా సోవియటు రాజ్యాంగం, ప్రజలు తమ అభిప్రాయం స్వేచ్ఛగా వెల్లడించేందుకు సంపూర్ణ భద్రత చేకూర్చింది.

వివిధ ప్రజాసంఘాలు తమ సంస్థల ద్వారా బహిరంగ సమావేశాల్లో సోవియట్లకు ప్రతినిధులను నియమించవచ్చు; ఇలాగే సైనికదళాలు గూడా.

ఎన్నికల సమావేశాల్లో కమ్యూనిస్టులు, యితరులు కలిసి సమిష్టిగా నియమించే అభ్యర్థుల విషయమై చర్చించి ఒక నిర్ణయానికి వస్తారు? అనంతరం, అభ్యర్థి విజయానికై కలిసి ప్రచారం చేస్తారు. ఎన్నికల నిర్మాణ కార్యక్రమంలోనూ, పర్యవేక్షణలోనూ వోటర్లంతా శ్రద్ధాసక్తులతో పాల్గొంటారు. ఈ కార్యనిర్వహణకై, ప్రజాసంస్థల ప్రతినిధులతో యెన్నిక కమిటీలు యేర్పడతాయి. శిసలైన ప్రజాస్వామ్య విధానంపై యింత కట్టుదిట్టంతో సిక్షణాయుతంగా నడిచే యీ యెన్నికల్లో 1946 లో 10 కోట్ల 10 లక్షల వోటర్లకు 10 కోట్ల 7 లక్షల మంది సుప్రీం సోవియటు యెన్నికల్లో వోటుచేశారు. 1950 మార్చిలో 11 కోట్ల 10 లక్షల ఓటర్లలో నూటికి 99.98 మంది ఓటుచేయడం జరిగింది.

సోవియటు యూనియన్‌లో ప్రజా ప్రతినిధి ప్రజాసేవకుడుగా వర్తిస్తాడు. తన విధ్యుక్తధర్మాన్ని, ప్రజా విశ్వాసాన్ని విస్మరించి ప్రవర్తించే వ్యక్తిని ప్రజలేనాడైనా సభ్యత్వాన్నుండి దించి వెనక్కు పిలిపించవచ్చు.

## 8.—సోవియట్ రష్యాలో వర్గాలున్నవా ?

అవును, సోవియట్ యూనియన్‌లో వర్గాలున్నాయి. అయితే అవి నూతనంగా పరిణామంచెందినవర్గాలు. పురాతనపు

రష్యాలో వర్గాలకూ, యీ నాటి వర్గాలకూ యే అంశంలో గూడా పోలికేలేదు. 1939 నాటి జనాభాలెక్కల ప్రకారం, వేతనాలు, జీతాలుపుచ్చుకున్న కార్మికులు, వారి కుటుంబాల సంఖ్య, అప్పటి జనాభాలో నూటికి 49.7 వంతులు; సమిష్టి వ్యవసాయక్షేత్రాల్లో కష్టించే రైతులూ, ఉత్పత్తిసహాకార సంస్థల్లో సమైక్యమైన చేతిపనివారూ కలిసి నూటికి 47 వంతులున్నారు. వ్యక్తిగత వ్యవసాయజీవనం గడిపే రైతులుగానీ, జీతానికి పెట్టుకోని చేతిపనివారుగానీ వారి కుటుంబాలతో కలిసి నూటికి 2.5 వంతులుండేవారు; దాదాపు నూటికి 8 వంతుల మంది వారి సాంఘిక హోదా తెలియజేయలేదు.

ఈ అంకెలనుబట్టే, సోవియట్ రష్యాలో పరపీడకులు, సోమరిపోతులు, పెట్టుబడిదార్లు, భూస్వాములు, ధనికవ్యాపారులు, జలగలవలె పీడించే గ్రామపెత్తనదార్లు, వడ్డీవ్యాపారులు లేరని స్పష్టపడుతుంది. ఇతరుల శక్తిని దోచుకునే వర్గాలు అక్కడ లేవని పై అంకెలే రుజువు చేస్తాయి. ఈ శ్రేణికి చెందిన వర్గాలు సోవియట్ రష్యాలో యెన్నడో తొలిగించబడ్డాయి.

సోవియట్ సమాజంలో సోదరభావంతో జీవించే రెండే రెండు వర్గాలు-కార్మికులు, కర్షకులు—ఉన్నై యీ నాడు. నూతనంగా రూపొందిన కార్మికవర్గం పీడితవర్గాన్నుంచి సంపూర్ణంగా విముక్తి చెందింది. సమాజంలో అగ్రగామిగా ఉన్న కార్మికవర్గం దేశపరిపాలనలో ప్రాతినిధ్యం వహించి నడుపుతోంది. కార్మికవర్గ నియంతృత్వం అంటే అర్థం యిదే.

ఈవిధంగానే రైతాంగంగూడా భూస్వాముల దోపిడీ విధానంనుండి బయటపడ్డారు. ఇదివరలో రైతాంగం తమకున్న స్వల్ప భూఖండాల్లో పురాతన వ్యవసాయ సాధనాల్తో సాగు చేసుకునో, లేదా ధనిక భూస్వాములవద్ద జీతానికి ఊడిగం చేసో, దుర్భరజీవితం గడిపేవారు. ఈ నాడు సోవియట్‌లో ధనిక భూస్వాములుగానీ, బొర్రలుపెంచుకున్న వ్యాపారులుగానీ గ్రామజీవితాన్ని ఛిద్రంచేసే వడ్డీవ్యాపారులుగానీ మచ్చుకైనా లేరు. రైతాంగం అంతా ఐచ్ఛికంగా సమిష్టి వ్యవసాయ క్షేత్రాల్లో సంఘటితపడి, సమిష్టికృషి ప్రాతిపదికమీద అధునా తన పరికరాల సహాయంతో వ్యవసాయాభివృద్ధికి తోడ్పడు తున్నారు. ఈ విధంగా సోవియటు రైతాంగం సృజనాత్మకశక్తి గల ఒక నూతనవర్గంగా రూపొందింది. మానవసృష్టి మొదలు యీనాటివరకూ ఇలాంటి రైతాంగవర్గం ఉద్భవించి వుండలేదు.

ఇక మేధావుల విషయం; మానసిక శ్రమలో నిమగ్నులై తమ మేధా సంపత్తును అభివృద్ధిచేసుకునే స్త్రీ పురుషులు సోవియటు సమాజానికి అనన్యమైన సేవాధర్మాన్ని పాలిస్తున్నారు. కార్మిక కర్షకావళిలో నుంచి ఉత్పన్నమైన యీ మేధావి వర్గం, ప్రజానీకంలో లీనమై, వారి సుఖమే, తమ సుఖంగా యెంచి దీక్షాసక్తతో సేవ చేస్తున్నారు. తమ మేధస్సునంతా కమ్యూనిస్టు సమాజ నిర్మాణానికై ధార పోస్తున్నారు.

---

## 9.—సోవియట్ ఆర్థికవిధానంలోని విశిష్టలక్షణాలేవి? పంచవర్ష ప్రణాళిక లంటే యేమిటి?

సోవియట్ యూనియన్‌లో ఉత్పత్తి పరికరాలపైన వ్యక్తిగత పెత్తనం అంటూ ఉండదు. భూమి, ఖనిజసంపద, నీటి వనరులు, అరణ్యాలు, మిల్లులు, ఫ్యాక్టరీలు, రైళ్లు, గనులు, రాకపోకలు, బ్యాంకులు, విమాన, నదీ సముద్ర యానం, మునిసిపల్ సంస్థలు, పట్టణాల్లో అధికభాగం గల నివాస భవనాలు ప్రజానీకానికి చెందిన సంపద. ఈ సంపదపై సోవియట్ కార్మిక కర్షక ప్రజాప్రభుత్వం యాజమాన్యం వహిస్తుంది.

గ్రామీణ ప్రాంతంలో ప్రధానమైన ఉత్పత్తి పరికరాలపై అధికారం సమిష్టి వ్యవసాయక్షేత్రాలదే. ప్రభుత్వ వ్యవసాయ కేంద్రాల్లోనూ, ట్రాక్టర్లు, యితర యంత్రాలు ఉత్పత్తయ్యే ఫ్యాక్టరీలు, కర్మాగారాల్లోనూ, ఉత్పత్తి పరికరాల మీద ప్రభుత్వానికే యాజమాన్యం ఉంటుంది. ఈ విధంగా సోవియట్ ఆర్థిక జీవితంలో అన్ని ఉత్పత్తిశక్తుల మీద ప్రజానీకానికి సంపూర్ణమైన ఆధిపత్యం యేర్పడ్డది. దీనినే సోషలిస్టు ఆర్థిక వ్యవస్థ అనిపిలుస్తాం. ప్రజల ఆర్థిక జీవిత స్థాయిని అత్యున్నత దశకు తీసుకుని పోవడానికై సోవియట్ ప్రభుత్వం పంచవర్షప్రణాళికలను అమలు జరుపుతూ వచ్చింది. సుప్రీం సోవియట్ అంగీకారం పొందిన పంచవర్ష ప్రణాళికలను ప్రభుత్వ ప్లానింగు సంస్థ రూపొందిస్తుంది. నిర్ణీతమైన గడువు

లోగా ఏయే సరుకులను ప్రతి యూనియన్ రిపబ్లికుకూ, సోవి యట్ యూనియన్ మొత్తానికీ యెంతెంత ఉత్పత్తి చేయాలో యీ ప్లాను నిర్ణయిస్తుంది. ఏయే నిర్మాణాలు యెక్కడెక్కడ యెంతెంత పరిమాణంతో సాగించాలో, యే యే వృత్తుల్లో, శాఖల్లో యెంద రెందరు నిపుణులకు తర్ఫీదివ్వాలో గూడా యీ ప్లాను స్థిరీకరిస్తుంది. వ్యవసాయోత్పత్తిని విస్తరింపజేయడం, పశుసంపదను అభివృద్ధిపరచడం, వ్యవసాయశాఖ కవసరమైన వివిధ యంత్రాలను వృద్ధిచేయడం, ఆంతరంగిక వ్యాపారాన్ని విస్తరింపచేయడం గూడా యీ ప్లానులోని ప్రధానాంశాలు. సోవియట్ ప్రజల భౌతిక, సాంస్కృతిక స్థాయిని ఉన్నత పథానికి తీసుకు పోవడం, శాస్త్రీయ, వైజ్ఞానిక, సాంస్కృతిక సంస్థలను అభివృద్ధిపరచి దృఢతరం చేయడం, విద్యాలయాలు, విశ్వకళా పరిషత్తులు, ఆసుపత్రులు, విశ్రాంతిభవనాలు, శానిటోరియములు దేశవ్యాపితంగా విస్తరిల్లచేయడం గూడా పంచవర్ష ప్రణాళిక బాధ్యతే.

ఈ పంచవర్ష ప్రణాళికల ఆశయాలే, సాంవత్సరిక, త్రైమాసిక ఆర్థిక ప్రణాళికలనుగూడా తయారుచేయడానికి ప్రాతిపదికగా ఉపకరిస్తాయి. ప్రణాళికలన్నీ సోవియట్ మంత్రిమండలి ఆమోదం పొందాలి. ప్రతి మంత్రిత్వశాఖ, ప్రతి సంస్థ పంచవర్ష ప్రణాళికననుసరించి తమ సాంవత్సరిక, త్రైమాసిక ప్రణాళికలను తయారుచేసుకుంటాయి. సోవియట్టు ప్రజల శాంతిమయ జీవితాన్ని సాధించటానికి యీ ప్రణాళికలన్నీ తయారౌతాయి. సాంకేతిక, శాస్త్రీయాభివృద్ధిద్వారా కార్మికుల శ్రమశక్తిని తగ్గించి ఉత్పత్తిని అధికతరం చేయడం, సుఖ

ప్రదమైన ప్రజాజీవితానికి తోడ్పడడం యీ ప్లానుల ఉద్దేశం. దేశంలో యెప్పటికప్పుడు ఉత్పత్తి పరిణామం చెందుతున్న నూతన విలువలన్నీ సమగ్రమైన మానవ సుఖమయ జీవితానికే వినియోగించబడుతున్నాయి. జనాభా పెరుగుదల ఒక్కటే దీనికి ప్రబల తార్కాణం; సోవియట్ ప్రజానీకం సంఖ్య నానాటికి అభివృద్ధిచెందుతున్నది. యుద్ధానంతరంనుండి ఏడాదికి 30 లక్షల చొప్పున అధికమౌతున్నది. సోషలిస్టు ఆర్థిక విజయానికి ప్రజల కొనుగోలుశక్తి పెరగడంగూడా మరొక ప్రబలతార్కాణం. కొనుగోలుశక్తి పెరగడమంటే, ప్రజలు కుప్పలు తిప్పలుగా సరుకులను కొని అనుభవించడానికి ఉత్సాహపడుతున్నారన్న మాట. ఈ కారణంగా సోవియట్ రష్యాలో ఆర్థిక సంక్షోభమూ, నిరుద్యోగమూ తలెత్తవు. త్వరితగమనంతో పురోగమిస్తూ, సిరిసంపదలతో. సాటిలేని విజ్ఞాన సంస్కృతీ వికాసంతో కమ్యూనిస్టు సామాజిక నిర్మాణంవైపు ఉరకలువేస్తున్నది సోవియట్ ప్రజానీకం.

---

## 10.—సోవియట్ బడ్జెటు ఎలా తయారౌతుంది?

సోవియట్ యూనియన్ బడ్జెట్ ప్రధానమైన ఆర్థిక ప్రణాళికగా వ్యవహరించ బడుతుంది. జాతీయ ఆర్థిక ప్రణాళిక ననుసరించి యీ బడ్జెటు రూపొందుతుంది. ఆదాయ పద్దులు యేటేటా సుప్రీం సోవియట్‌చేత ఆమోదించబడతాయి. తొలిసంవత్సరపు బడ్జెటు అమలుకై ప్రభుత్వం

తయారు చేసిన నివేదికను కూడా సుప్రీం సోవియట్ చర్చించి అంగీకరిస్తుంది.

సుప్రీం సోవియట్ ఆమోదించిన 1952 బడ్జెటుప్రకారం సోవియట్ ఆదాయం 50990 కోట్ల రూబుల్స్ (రూబుల్ అంటే రూపాయన్నరకు సమానం); వ్యయం, 476,90 కోట్ల రూబుల్స్. అంటే ఖర్చుకన్న ఆదాయం 3300 కోట్లెక్కువన్న మాట. ప్రతి సంవత్సరం సోవియటు బడ్జెట్‌లో ఖర్చుపోను మిగులు కనిపిస్తునే ఉంది. విరివిగా ఉత్పత్తయ్యే పారిశ్రామికసంపద, ఎగుమతులు, వ్యాపారసంస్థలు సోవియట్ అధిక ఆదాయానికి మూలకారణాలు. వ్యక్తులు చెల్లించే ఆదాయంపన్ను బడ్జెట్‌లో స్వల్పభాగం మాత్రమే. ఉదాహరణకు: గత సంవత్సరం బడ్జెటులో దీనివంతు నూటికి 9.4 మాత్రమే. ఈ సంవత్సరం యింకా తగ్గుతుంది.

సోవియటు బడ్జెట్ శాంతి నభిలషించే బడ్జెటని ఈకిరింది అంకెలే రుజువుచేస్తాయి. 1952 లో వెచ్చించిన 47690 కోట్ల రూబుల్స్‌లో, జాతీయ ఆర్థిక ప్రణాళికను అమలు జరపడానికై 18040 కోట్ల రూబుల్స్ కేటాయించబడ్డాయి, 12480 కోట్లు సాంఘిక, సాంస్కృతికసేవా కార్యకలాపాలకు కేటాయించ బడింది. అంటే, మూడింట రెండువంతులు జాతీయార్థికాభివృద్ధి కొరకో లేక సాంఘిక సాంస్కృతికావసరాలకో వ్యయపరుప బడింది. సాంఘిక, సాంస్కృతికాభివృద్ధికై వెచ్చించబడ్డ 12480 కోట్లలో, సగంవంతు విద్యాభివృద్ధికై ప్రత్యేకించబడ్డది; ఆరోగ్య, శారీరక పరిశ్రమశాఖలకు 2280 కోట్లు, సాంఘిక భద్రత, భీమాలకు 3750 కోట్లు కేటాయించబడ్డాయి. సోవి

యట్ ప్రజానీకాన్ని శత్రుదాడులనుంచి రక్షించడానికై సాయుధదళాల పోషణకై 1952 లో నూటికి 23.9 వంతులు ఖర్చు చేయబడ్డవి. 1940 లో సైనిక రంగంలో ఖర్చుపెట్టబడ్డ మొత్తం నూటికి 32.5 వంతులు.

1952 వ సంవత్సరం బడ్జెటు ఖర్చులో సంసారభారం యెక్కువైన తల్లులకు, భర్తన్ని కోల్పోయిన బిడ్డల తల్లులకు 450 కోట్లు కేటాయించబడ్డాయి. ఆదాయాన్ని యీ విధంగా వివిధరంగాలకు విభజించడంమూలంగా, సోవియట్ ప్రభుత్వం తమ ప్రజల భౌతిక, వైజ్ఞానిక, సాంస్కృతిక అవసరాలను తృప్తిపరచి సోషలిస్టు ఆర్థిక వ్యవస్థను బహుముఖంగా అభివృద్ధి చేస్తున్నదనడంలో సందేహంలేదు.

---

## 11.—సోవియట్ పారిశ్రామిక సంస్థలపై యాజమాన్యం యెవరిది ?

వివిధ తరగతుల సోవియట్ సంస్థలన్నీ రష్యన్ ప్రజలు తమ సొత్తుగా భావిస్తారు. ప్రతి సంస్థపైనా ఆయా శాఖకు సంబంధించిన మంత్రివర్గంచేత నియమించబడ్డ డైరెక్టరు అజమాయిషీ వహిస్తాడు. ఇతడి ఆధీనంలోనే ఆ సంస్థకు చెందిన ఆర్థిక, భౌతిక సంపద ఉంటుంది. ఈ సంస్థయొక్క కార్యనిర్వహణ కంతకూ ఇతడే ప్రభుత్వానికి బాధ్యుడు. దీనిలో తయారయ్యే వస్తూత్పత్తికీ, దాని నాణ్యానికీ, ధరల నిర్ణయానికీ, ఉత్పత్తివల్ల కలిగే లాభనష్టాలకూ, కార్మిక చట్టాలను అమలు

వచ్చే విషయంలో డైరెక్టరే బాధ్యుడు. సంస్థపై యాజమాన్యంచేసే విషయంలో డైరెక్టరుదే అంతిమనిర్ణయం. చట్టవ్యతిరేకంగాని డైరెక్టరు ఆదేశాలన్నీ కార్మికులంతా పాటించాల్సిందే.

ఈ డైరెక్టర్లంతా ప్రజా సామాన్యంలోనుంచి వచ్చే సామాన్య స్త్రీ పురుషులే; ప్రజలజీవితాన్ని సాకల్యంగా అర్థంచేసుకున్నవారే. వీరందరికీ అపారమైన అనుభవం, సమగ్రమైన పరిజ్ఞానముంది.

ప్రభుత్వ సంస్థల్లోను, పార్టీ, కార్మిక సంస్థల్లోనూ పనిచేసేవారు, ఆయాసంస్థల్లో యెంతో శ్రద్ధాసక్తులతో తమ బాధ్యతలను నిర్వహిస్తారు. కార్యనిర్వహణలో దొర్లే లోటుపాట్లను సరిదిద్దడంలోనూ, ఉత్పత్తినైపుణ్యస్థాయిని అధికతరం చేయడంలోనూ వీరెంతో సహాయపడతారు. ఈఆశయాలతో, అన్ని సంస్థల్లోనూ, ఉత్పత్తి సమావేశాలంటూ తరచుగా జరుగుతూ ఉంటాయి. ఈ సమావేశాల్లో కార్మికుల సలహాలెంతో ఉపకరిస్తాయి. ఉత్పత్తినిగురించి డైరెక్టర్లు ప్రవేశపెట్టే నివేదికలను చర్చించి, అధికోత్పత్తికి ఆటంకాలయ్యే లోపాలను తొలగించడం యీ సమావేశాల్లో జరిగే కార్యకలాపం. డైరెక్టర్ల, వివిధ శాఖల సూపరెండెంట్ల నివేదికలను సౌహార్ద భావంతో విమర్శించడం, ఆత్మవిమర్శన చేసుకోవడం కూడా యీ సమావేశాల ప్రత్యేక లక్షణం. ఈ సమావేశ నిర్ణయాలను డైరెక్టరు ఆమోదించిన తర్వాత, కార్మికులూ, మేనేజిమెంటూ వాటిని అమలుజరపడానికి దీక్షా సక్తులతో కృషిచేస్తారు.

## 12.—సోవియట్ రష్యా అత్యుత్తమ పారిశ్రామిక దేశంగా ఎలా పరిణామం చెందింది ?

ఉత్పత్తిలోనూ, సాంకేతిక స్థాయిలోనూ ఇతర పారిశ్రామిక దేశాలకన్న జార్ కాలంనాటి రష్యా యెంతో వెనకబడివుంది. పారిశ్రామికోత్పత్తి విషయంలో 1913 వ నాటి రష్యా, ప్రపంచంలో అయిదవస్థానం, యూరప్‌లో నాల్గవ స్థానం మాత్రమే ఆక్రమించింది. సోవియట్ ప్రజలు స్టాలిన్ నాయకత్వం క్రింద 1928–40 మధ్యకాలంలో అపూర్వమైన ఆర్థిక పునర్నిర్మాణప్రణాళిక పూర్తిగావించారు. దీనితో సోవియటు యూనియన్ ప్రథమ శ్రేణికి చెందిన పారిశ్రామిక రాజ్యంగా తయారైంది. ఈ ప్రణాళిక సోషలిస్టు పారిశ్రామిక సిద్ధాంత ప్రాతిపదికపై నిర్వహించబడ్డదనే విషయం గుర్తుంచుకోవాలి.

పెట్టుబడిదారీ రాజ్యాలు చిన్న పరిశ్రమలను అభివృద్ధి చేయడంద్వారా తమ భారీ పారిశ్రామిక నిర్మాణానికి పూనుకున్నాయి. ఈ కార్యభారానికి కావలసిన ధనంలో అధికభాగం పరదేశాలమీద యుద్ధాలుచేసి కొల్లగొట్టడంద్వారాను, తమ కష్టజీవులను పీడించడంద్వారాను విదేశ ఋణాలద్వారాను పోగుజేసారు.

సోవియట్ రష్యా యీ అక్రమమార్గాన్ని యెన్నడూ అవలంబించలేదు. సోవియట్ యూనియన్ భారీపరిశ్రమలను అభివృద్ధిపర్చడం ద్వారానే తన కార్యక్రమాన్ని ప్రారంభిం

చింది. ఈ మార్గాన్ని అవలంభిస్తేగాని తన ఆర్థిక స్వాతంత్ర్యాన్ని సాధించి, దేశరక్షణను పటిష్టం చేసుకోడానికి సాధ్యం కాకపోయింది. దేశార్రిష్టమైన విదేశ ఋణాలద్వారాగాక, తన ప్రజలనుంచే ప్రజావిశ్వాసాన్ని పొంది పారిశ్రామికోత్పత్తి కవసరమైన ధనాన్ని సంపాదించ గలిగింది. సోషలిస్టు శ్రామిక విధానానికి ఉత్పత్తి పరికరాలపై ప్రజల యాజమాన్యం ప్రధాన సూత్రం. కార్మిక కర్షక శ్రమశక్తివల్ల ఉత్పత్తయిన సంపద పారిశ్రామికాభివృద్ధికి అవసరమైన ధనాన్ని సంపాదించిపెట్ట గలిగింది.

వివిధ మార్గాలద్వారా అధికోత్పత్తిని సాధించడంవల్ల, ఉత్పత్తిఖర్చులు తగ్గించడంవల్ల, అన్ని రంగాల్లోను పొదుపరితనాన్ని పాటించడంవల్ల, ఐచ్ఛికంగా ప్రభుత్వానికి ప్రజలిచ్చే ఋణాలవల్ల, పారిశ్రామికాభివృద్ధికవసరమైన ధనాన్ని సంపాదించ గల్గింది సోవియట్ ప్రభుత్వం. సోషలిస్టు పారిశ్రామిక విధానఫలితంగా 1938 నాటికే సాంకేతిక నైపుణ్యంలోనూ, ఉత్పత్తి పరిమాణంలోనూ, ప్రధానమైన పెట్టుబడిదారీ రాజ్యాలను అధిగమించి ముందుకు పురోగమించింది.

1940 లో సోవియట్ భారీపారిశ్రామికోత్పత్తి 1913 నాటికన్న 12 రెట్లెక్కువగా సాధించబడింది; ఇదేకాలంలో ఇంజనీరింగు పారిశ్రామికోత్పత్తి 50 రెట్లెక్కువగా సాగింది. పారిశ్రామికరంగంలో రెండవప్రపంచయుద్ధారంభంనాటికి సోవియట్ రష్యా యూరప్‌లో ప్రథమస్థానాన్నీ, ప్రపంచంలో రెండవస్థానాన్ని చేరుకున్నది. రెండవయుద్ధకాలంలో, ఉచ్ఛస్థాయి నందుకున్న సోవియట్ పరిశ్రమ సోవియట్ సైన్యావసరకవ

సరమైన ఆయుధసంపద సమకూర్చి జర్మన్ ఫాసిస్టులపై విజయాన్ని స్థిరపజేసింది.

---

## 13.—పారిశ్రామిక భూగోళం సోవియట్ ప్రభుత్వం ఎలా మారింది?

పూర్వపు రష్యాలో పరిశ్రమలన్నీ దేశం మధ్యభాగంలోనూ, పశ్చిమ ప్రాంతాల్లోనూ కేంద్రీకరించబడ్డాయి. సైబీరియా ప్రాంతంలోగానీ, రష్యనేతరజాతులు నివసించే తూర్పుసరిహద్దు ప్రాంతాల్లోగానీ మిల్లులు, ఫ్యాక్టరీలంటూ లేవు.

నూతనంగా అధికారంలోకి వచ్చిన సోవియట్ ప్రభుత్వం ప్రజలెక్కువగా నివసించే భూభాగాల్లోనూ, ముడిసంపద లభ్యమయ్యే ప్రాంతాల్లోనూ, వివిధపరిశ్రమలను విభజించింది. రష్యనేతరజాతులు నివసించే యూనియన్ రిపబ్లిక్కుల్లో పారిశ్రామికాభివృద్ధి యింకా చురుకుగా సాగుతూవచ్చింది. ఇదివరలో వెనకబడివున్న మధ్యాసియా, ట్రాన్స్‌కాకేసియా ప్రదేశాల్లో ప్రథమశ్రేణికిచెందిన అనేక పారిశ్రామిక సంస్థలు నెలకొల్పబడ్డాయి. ఈ పారిశ్రామికాభివృద్ధివల్ల దేశ స్వరూపమే విచిత్రంగా మారింది. రష్యన్ జాతీయుల స్నేహసౌహార్ద్రసహకారంతో, వివిధ సోవియటు రిపబ్లికుల ప్రజలు ఊహించరాని ఆర్థిక, సాంస్కృతికాభివృద్ధిని సాధించగలిగారు. ఉదాహరణకు: ఆర్మీనియా రిపబ్లికు 1913 కన్న 1940 నాటికి తన పారిశ్రామి

కాభివృద్ధిని 22 రెట్లు ఎక్కువచేసుకున్నది. జార్జియా పారిశ్రామికాభివృద్ధి 26 రెట్లు, కిర్ఘిజియా 160 రెట్లు, టజిక్ 22 రెట్లు అధికమైంది. గత మహాయుద్ధకాలంనుండి యీనాటివరకు యీ రిపబ్లికుల పరిశ్రమలు మరింతగా అభివృద్ధి చెందాయి.

అపరిమితంగా అభివృద్ధియైన పారిశ్రామిక ప్రాంతాల్లో ఇంజనీర్లు, సాంకేతిక నిపుణులు, అత్యధికసంఖ్యలో తయారైనారు. విప్లవానికిపూర్వం వెనకబడివున్న యూనియన్ రిపబ్లికుల్లో యీ నాడు పారిశ్రామిక, ఆర్థికాభివృద్ధి శరవేగంతో సాగిపోతున్నది.

---

## 14.—సమిష్టి వ్యవసాయక్షేత్రాలంటే ఏమిటి ?

సోవియట్ రైతాంగం ఐచ్ఛికంగా సోషలిస్టు సిద్ధాంత ప్రాతిపదికపైన వ్యవసాయంచేసే సంస్థలనే సమిష్టి వ్యవసాయ క్షేత్రాలంటారు. దాదాపు సోవియటు రైతులంతా యీ క్షేత్రాల్లో చేరినవారే. ఒక గ్రామ రైతాంగం అంతా చర్చించి నిర్ణయానికి వచ్చినఫలితంగానే యీ సమిష్టి వ్యవసాయక్షేత్రం యేర్పడుతుంది. ఈ సంస్థ యేర్పడగానే, దీనిలో చేరిన సభ్యులంతా తమకున్న వ్యవసాయపరికరాలను సంస్థపరంగా సమిష్టిసొత్తు చేసుకుని వ్యవసాయాని కుపక్రమిస్తారు. ఈ పరికరాలు, వీటిద్వారా ఉత్పన్నమైన పదార్థాలు, సమిష్టి వ్యవసాయక్షేత్రం యొక్క ఉమ్మడి ఆస్తి అవుతుంది. ఈ క్షేత్రం నిర్మించబడ్డ భూభాగం ప్రభుత్వపు ఆస్తిగా భావించబడుతుంది;





అంటే ప్రజల ఆస్తి అని వేరే చెప్పనక్కర్లేదు. అయితే యీ భూఖండాన్ని సోవియటు ప్రభుత్వం సమిష్టి వ్యవసాయక్షేత్రానికి ఉచితంగా దఖలుపరుస్తుంది.

సమిష్టి వ్యవసాయక్షేత్రాలు నిర్ణీతమైన వ్యవసాయ నిబంధనల ప్రకారం నడపబడతాయి. ఈ నిబంధనలన్నీ స్టాలిన్ పర్యవేక్షణక్రింద ఆయన సలహా సహకారాలతో 1935 లో సమావేశమైన సమిష్టి వ్యవసాయక్షేత్ర మహాసభచేత రూపొందించబడ్డాయి. సమిష్టి వ్యవసాయక్షేత్రి కార్యకలాపాలు యెలా వ్యవహరింపబడాలో యీ నిబంధనలు తేటతెల్లం చేస్తాయి. ఈ క్షేత్రాల్లో యెందరు సభ్యులు చేరాలో, యెన్ని వ్యవసాయ పరికరాలు ఉపయోగ పెట్టాలో గూడా యీ నిబంధనలు స్పష్టంచేస్తాయి. వీటి వ్యవహారాలన్నీ సాధారణ సభ్య సమావేశాలు నడుపుతాయి. సమావేశానికీ, సమావేశానికి గల మధ్య కాలంలో ఒక అధ్యక్షునితో యేర్పడే మేనేజిమెంటు బోర్డు యీ వ్యవసాయ క్షేత్రాల కార్యకలాపాలను సాగిస్తుంది. మేనేజింగు బోర్డు నివేదించే సాంవత్సరిక రిపోర్టును యీ సాధారణ సభ్య సమావేశం ఆమోదించాలి. ప్రతి సంవత్సరం తయారయ్యే ఉత్పత్తి ప్రణాళిక కూడా యీ బోర్డు ఆమోదం పొందాలి. రాబోయే సంవత్సరాల్లో గూడా వ్యవసాయ క్షేత్రాభివృద్ధికై యెంతమొత్తాన్ని ధన వస్తు రూపంలో వెచ్చించాలో గూడా యీ మేనేజింగు బోర్డు నిర్ణయిస్తుంది.

సమిష్టి వ్యవసాయక్షేత్రాలకు వచ్చే రొక్కపు ఆదాయంలో, కెంత భాగం ప్రభుత్వం పన్నులక్రింద, ఇన్సూరెన్సుక్రింద, అప్పులు చెల్లింపు క్రింద, ఉత్పత్తి కవసరమైన





యితర ఖర్చుల క్రింద చెల్లించబడుతుంది. కొంతభాగం రైతుల విజ్ఞాన, సాంస్కృతిక కార్యకలాపాలకు, రైతుల చిల్లర ఖర్చులకు, నూతననిర్మాణాలకు కేటాయించబడుతుంది. ఈ సమిష్టి క్షేత్రాలు బ్రహ్మాండమైన యంత్రశక్తి సహాయంతో నిర్మాణమౌతాయి. సగటున ప్రతి సహకారక్షేత్రం 3750 నుండి 7500 యకరాలవరకు సాగుచేస్తుంది; కాని ధాన్యం పండించే కొన్ని జిల్లాలు 25000 నుండి 50000 యకరాల వరకు గూడా సాగుబడి చేస్తున్నాయి. వ్యవసాయానికి సంబంధించిన కార్యకలాపాలన్నీ యంత్రసహాయంతోనే జరుగుతాయి. ఈ యంత్రాలను నడిపే ఇంజనీర్లను, సాంకేతిక నిపుణులను యంత్ర నిర్మాణ సంస్థలే సమిష్టి క్షేత్రాలకు సప్లయి చేస్తాయి. వీరికి వినియోగించవలసిన ఖర్చు అతి స్వల్పంగా ఉంటుంది. 1951 నాటికి యీ క్షేత్రాలన్నీ యంత్ర సహాయంతోనే దున్నబడ్డాయి. విత్తనాలు చల్లడంగూడా నాల్గింట మూడువంతులు ట్రాక్టర్లే చేశాయి. సమిష్టి వ్యవసాయక్షేత్రాలన్నిటిలో కపీన యంత్రాలు నెలకొల్పబడ్డాయి. ఆధునాతన శాస్త్రీయ పద్ధతులన్నీ ప్రవేశపెట్టబడ్డాయి. దూరదృష్టితో, నైపుణ్యంతో రూపొందించబడ్డ పథకాలతో యీ సమిష్టి వ్యవసాయ క్షేత్రాలు నిత్యకల్యాణం పచ్చతోరణంగా విలసిల్లుతున్నాయి.

వీటిద్వారా వ్యవసాయాభివృద్ధి త్వరిత గమనంతో పురోగమిస్తున్నది. రైతాంగ జీవితస్థాయి, పరిమాణం నానాటికి హెచ్చుతున్నది. 1940 నాటికే సోవియట్ రష్యా యేడాదికి 3 కోట్ల 70 లక్షల టన్నుల ఆహారధాన్యాలు ఉత్పత్తి

చేసింది. దేశంమొత్తంలో వ్యవసాయోత్పత్తిని లెక్క కట్టితే, యెన్నో రెట్లెక్కువయింది. 1940 వ సంవత్సరంలో సమిష్టి వ్యవసాయక్షేత్రాల్లో పనిచేసే లక్షలాదిరైతులు ఒక్కొక్క కుటుంబానికి 8 మొదలు 25 టన్నులవరకు ధాన్యం, కొన్ని లక్షల రూబుల్ నాణ్యాలూ తమ వాటాక్రింద పంచుకున్నారు. గ్రామీణప్రాంతంలో గూడా పేదరికం, నిరుద్యోగం యెన్నడో నిర్మూలించబడింది. సమిష్టి వ్యవసాయక్షేత్రంలోని ప్రతి ఒక్కడూ సిరిసంపదలలోనూ, విజ్ఞానసంస్కృతులలోను విరాజిల్లుతున్నాడు. యుద్ధానంతరం యీ క్షేత్రాల్లో యింకా అధికమైన అభివృద్ధి సాధించబడ్డది. 1950 లో పండినపంట 1940 కన్న 55 లక్షల టన్ను లెక్కువనితేలింది. ఈ విధంగా సమిష్టి వ్యవసాయక్షేత్ర సంపద నానాటికి అధికమై రైతాంగం సుఖమయ జీవనంచేయటానికి తోడ్పడుతున్నది. వేలసంఖ్యలో గ్రామసీమలన్నీ అధునాతన పద్ధతులపైన పునర్నిర్మాణం చేయబడుతున్నాయి. సోవియట్ రైతాంగం స్వల్పకాలంలో పాత పద్ధతులనుండి బయటపడి సుఖప్రదమైన భౌతిక, వైజ్ఞానిక, సాంస్కృతిక జీవనాన్ని సృష్టించుకున్నారు.

---

**15.—సమిష్టి వ్యవసాయ క్షేత్రంలో కృషికితగిన ఫలితం యెలా ముటుతుంది ?**

ఫ్యాక్టరీ కార్మికుల్లాగా వ్యవసాయక్షేత్ర సభ్యులకు వేతనాలుండవు. తమ కృషికి ప్రతిఫలంగా ప్రతి

రైతు ధనరూపంలోగానీ, వస్తురూపంలోగానీ తనశ్రమ ఫలితం అనుభవిస్తాడు. రైతుచేసిన పనినిబట్టీ, దాని పరిమాణాన్నిబట్టీ, నైపుణ్యాన్నిబట్టీ, యేయేటి కాయేడు సమిష్టి వ్యవసాయ క్షేత్రం ఉత్పత్తిచేసిన మొత్తం సరుకులో తనవాటా పంచి పెట్టబడుతుంది. రైతు ప్రతిరోజూ చేసేపని పరిమాణంగా నిర్ణయించబడి దానికి విలువ కట్టబడుతుంది. అంటే భూమి దున్నడంలోగానీ, కలుపు తియ్యడంలోగానీ, పాలు ఉత్పత్తి చేయడంలోగానీ ప్రతి రైతు కృషి యెంత విలువ, పరిమాణం కలిగి ఉంటుందో లెక్క కట్టబడుతుందన్నమాట. తన కార్య క్రమ నిర్వహణ యెంత యెక్కువ క్లిష్టతరమైనా, తనపని యెంత యెక్కువ ప్రాముఖ్యత గలదైతే, అలాంటి కార్యక్రమాన్ని యెంత అధికోత్సాహంతో నిర్వహిస్తాడో, దానినిబట్టి అతని ప్రతి ఫలంగూడా ఉంటుందన్నమాట. నైపుణ్యం యెక్కువైనకొద్దీ, ప్రతిఫలం కూడా యెక్కువవుతుంది. ఇదంతా కూడా ఆయా సమిష్టి వ్యవసాయ క్షేత్రాల్లో పండే పంటమీదా పశుసంపద యొక్క ఉత్పత్తిశక్తిమీదా ఆధారపడి ఉంటుంది.

ఈ పద్ధతివల్ల, తన పనిరోజుల్లో యెంత నైపుణ్యం ప్రక టిస్తే, సంపాదన అధికం చేసుకుంటున్నాననే ఉత్సాహమే గాక, తన సోదరులతో పాటు వ్యవసాయ క్షేత్రంయొక్క ఉత్పత్తి, ఆదాయాలను సాధ్యమైనంతగా పెంచటానికి రైతు శ్రద్ధాసక్తులు చూపుతాడు. ఈ విధంగా వ్యవసాయ క్షేత్రం యొక్క అభివృద్ధికి రైతు పాటుపడతాడు.

ప్రతి పనిరోజుకూ యెంతరొఖ్ఖం యివ్వాలో, యెన్ని పదార్థాలు రైతుకివ్వాలో యేడాది కోసారి నిర్ణయించబడు

తుంది. సంవత్సరం మధ్యకాలంలో, నూర్పిడి సమయానికి రైతుకు కొంత ధనం, సరుకులు ముట్టజెప్పబడతాయి. పూర్తి లెక్కలన్నీ, వ్యవసాయపు పనులు ఆఖరయ్యే సంవత్సరాంతానికి సరిచూడబడతాయి.

పని నైపుణ్యాన్ని బట్టీ, పరిమాణాన్నిబట్టీ, సంవత్సరానికి ఒక్కొక్క కుటుంబం 10 టన్నులధాన్యం, పుష్కలంగా యితర పదార్థాలు, 7817 రూబుల్సువరకూ రొఖ్ఖం, సంపాదించుకున్న ఉదాహరణ లెన్నో ఉన్నాయి ఇది సామాన్యంగా ఒక్కొక్కకుటుంబం సగటున సంపాదించుకున్న ఆదాయం మాత్రమే. అనేక వ్యవసాయక్షేత్రాల్లో సంపాదన యింకా యెక్కువగా ఉంటుందికూడా. ఈ సంపాదనలో తమకు సరిపోగా యింకెంతో మిగుల్తుంది. మిగిలిన పదార్థాలను సహకార సంఘాలకో, మార్కెట్‌లోనో అమ్ముకుంటారు.

నిర్ణయించబడ్డ మొత్తంకన్న అధికంగా ఆహారోత్పత్తి సాధించడానికీ, తమ అధీనంలో ఉండే పశువులనుండి అత్యధికంగా పాలు మొదలైన పదార్థాలను ఉత్పత్తి చేయడానికీ, రైతుకు సాధారణంగా చెల్లించే రేటుకన్నా అదనంగా కొంత ముట్టజెపుతుంది. ఈవిధంగా ఉత్పత్తిపరిమాణంలోనూ, నైపుణ్యంలోనూ, రైతు సాధించే ఫలితాలు సంవత్సరాంతానికి లెక్కకట్టబడతాయి. ఈ విధంగా రైతు సంపాదించుకున్న ఆదాయమంతా నికరాదాయమన్నమాట; ఎందువల్లనంటే, వ్యవసాయక్షేత్రాలకు అవసరమైన పెట్టుబడంతా అవే భరిస్తాయి. రైతు ఒక్క కమ్మీడీకూడా పెట్టుబడి పెట్టనవసరంలేదు. సమిష్టి వ్యవసాయ క్షేత్రాల మీదనేగాక, తమ స్వంత భూముల మీద

కూడా రైతు సేద్యంచేసుకొని ఆదాయం సంపాదించుకోవచ్చు. (17 వ ప్రశ్నకు జవాబు చూడండి) సమిష్టి వ్యవసాయ క్షేత్రాలు రైతుకు కావలసిన భౌతిక, సాంస్కృతిక సంపద నంతా చేకూరుస్తాయి.

---

## 16.—మెషిన్, ట్రాక్టర్ స్టేషన్ అంటేఏమిటి ?

సమిష్టి వ్యవసాయక్షేత్రాల అవసరాలు తీర్చడానికి ఈ మెషిన్, ట్రాక్టరు స్టేషన్లు స్టాలిన్ చేసిన సూచనమీద ప్రభుత్వ సంస్థలుగా నెలకొల్పబడ్డాయి. ఈ స్టేషన్లు మొత్తం 8000 కు పైగా సోవియట్ అంతటా వెలిసాయి. వ్యవసాయ క్షేత్రాలను పదింట తొమ్మిదివంతులు యీ స్టేషన్లలో ఉత్ప త్తయ్యే యంత్రాలు దున్ని సాగుచేస్తాయి. పంటభూములమీద చేయవలసిన చాకిరీ అంతా యీ యంత్రాలే అతి సులు వుగా చేసిపెడతాయి. మెషిన్, ట్రాక్టర్ స్టేషన్ల యజమా నులు, సమిష్టి వ్యవసాయక్షేత్రాల కార్యకర్తలూ కలిసి, ఒక కంట్రాక్టు చేసుకుంటారు. ఈ కంట్రాక్టు ప్రకారం యంత్రాలు నిర్వహించవలసిన బాధ్యత, వ్యవసాయక్షేత్రాలు వాటికై చెల్లించవలసిన ధనం మొదలైన వివరాలన్నీ నిర్ణ యించబడతాయి. ట్రాక్టరు స్టేషను నిర్వాహకులు చేయ వలసిన పనంతా ఒక ప్లాను ప్రకారం జరుగుతుంది. ఈ ప్లానంతా ట్రాక్టర్ స్టేషన్ డైరెక్టరు, యితర యింజనీర్లు, వ్యవసాయక్షేత్రపు అధ్యక్షుడితో కలిసి యేర్పడ్డ ఒక సంఘం

చర్చిస్తుంది. మెషిన్ ట్రాక్టర్ల, స్టేషన్లు నిర్వహించవలసిన కార్యక్రమంలో ట్రాక్టర్లదే ప్రధాన బాధ్యత. నిర్ణీతమైన వ్యవసాయక్షేత్రాలకు నిర్ణీతమైన ట్రాక్టర్లు కేటాయింపబడతాయి. భూమిదున్నే తరుణంనుండి, పంట మహాసూల్ అయ్యేవరకూ యీ యంత్రాలన్నీ తమ కార్యక్రమాన్ని ప్లాను ప్రకారం నిర్వహిస్తాయి, రైతులు చేసే పని పరిమాణాన్ని బట్టి, యీ యంత్రాల పని కూడా దాని కనుగుణ్యంగా పెరుగుతుంది. ఈ కార్యక్రమంలో ట్రాక్టర్ డ్రైవర్ బాధ్యత యెక్కువగా వుంటుంది. యంత్రాలుచేసిన పని తనాన్ని తెలుసుకోవాలంటే, అవి దున్నిన భూమిని బట్టేగాక, వ్యవసాయ క్షేత్రంలో తయారైన ఉత్పత్తినిబట్టీ, దాని నాణ్యాన్నిబట్టి గూడా సాధ్యపడుతుంది. మెషిన్, ట్రాక్టర్ స్టేషన్ల నిర్వాహకులకు చెల్లించవలసిన మొత్తం, వ్యవసాయ క్షేత్రాలే ధన వస్తురూపంలో కంట్రాక్టు ననుసరించి చెల్లిస్తూ ఉంటాయి.

యంత్ర సహాయంతో భూమిని సాగుచేయడంతోనే మెషిన్ ట్రాక్టర్ల బాధ్యత తీరిపోదు. సమిష్టి వ్యవసాయ క్షేత్రాల సర్వతోముఖాభివృద్ధికి తోడ్పడడం గూడా యీ ట్రాక్టర్ స్టేషన్ల ప్రధాన బాధ్యతల్లో ఒకటి. ఈ స్టేషన్ అధికార్లు, యింజనీర్లు, యితర శాస్త్రవేత్తల సలహాల ననుసరించి చెట్లు నాటడం, నీటి కుంటలు నిర్మించడం, రిజర్వాయర్లు కట్టడం మొదలైన అనేక చర్యలు రైతులు అవలంబిస్తారు. సమిష్టి వ్యవసాయ రైతులను గూడా ట్రాక్టరు డ్రైవర్లగానూ, సాంకేతిక నిపుణులుగానూ స్టేషన్ నిర్వాహకులు

తయారుచేస్తారు. ప్రతి స్టేషనుకూ వ్యవసాయ మంత్రివర్గంచేత నియమించబడ్డ ఒక డైరెక్టరు ఉంటాడు.

యుద్ధం సమాప్తి అయినప్పటినుండీ, వివిధ శాఖలకు చెందిన స్పెషలిస్టులు యీ స్టేషన్లలో తయారై తమ యథోచిత స్థానాల్లో జయప్రదంగా కార్యభారం నిర్వర్తిస్తున్నారు. పైరు పంటల అభివృద్ధికి దోహదమిచ్చే శీతోష్ణస్థితిని కల్పించడానికి ఒక్కొక్క ప్రదేశంలో అడవులు నాటడం ప్రధాన కార్యక్రమాల్లో ఒకటి.

ఈ స్పెషలిస్టులు యీ కార్యనిర్వహణాలో గూడా రైతులకు సహాయపడతారు. పచ్చికబయళ్ళను అభివృద్ధిచేసి పశుగ్రాసాన్ని అధికంగా అభివృద్ధిచేయడంలోనూ, యీ స్పెషలిస్టులు రైతాంగానికి సలహాదారులుగా పనిచేస్తారు. నానాటికి సోవియట్ వ్యవసాయ రంగంలో జరిగే అభివృద్ధి మూలంగా, యీ మెషిన్, ట్రాక్టర్ స్టేషన్ల బాధ్యత గూడా అధికమౌతున్నది. 1951 నాటికి వ్యవసాయ క్షేత్రాల్లో జరిగే మొత్తం కృషిలో మూడింట రెండువంతులు యీ ట్రాక్టరు స్టేషన్లు నిర్వహిస్తున్నాయి. ఈ స్టేషన్ల పుణ్యమా అంటూ, రైతుల పని తేలిక అవడమేగాక, ఉత్పత్తి గూడా అధికం చేయబడ్డది. ఈ నాడు సోవియట్ యూనియన్ వ్యవసాయ క్షేత్రంలో గూడా అదోరకమైన పారిశ్రామిక కృషి రూపొందుతున్నది.

---

## 17.—సమిష్టి వ్యవసాయదారుని స్వంత సేద్యం అంటే యేమిటి?

సమిష్టి వ్యవసాయక్షేత్రంలోని ప్రధాన ఉత్పత్తి పరికరాలన్నీ సభ్యులకు చెందిన సమిష్టి ఆస్తిగా పరిగణించబడుతుంది. ఈ సిద్ధాంత ప్రాతిపదికపైనే సమిష్టి వ్యవసాయక్షేత్రం అభివృద్ధియి, రైతాంగం యొక్క సుఖజీవనోపాధికి దోహదమిస్తుంది.

అయితే యీ సమిష్టి వ్యవసాయక్షేత్రంతోపాటు, రైతాంగం తమ స్వంత సేద్యం కూడా చేసుకోవచ్చు. ఈ విధానం ద్వారా రైతుకు అదనంగా కష్టించి సంపాదించుకునే అవకాశం కల్గుతుంది. సమిష్టి వ్యవసాయదారుడికి స్వంత సేద్యంచేసుకునే హక్కు చట్టంద్వారా సంక్రమిస్తుంది. ఈ చట్టం ప్రకారం స్వంత సేద్యం చేసుకునే భూమి ముప్పాతిక యెకరం నుండి యెకరం పాతిక వరకు ఉంటుంది. ఈ భూమి కాక వేరే స్థలం యిల్లు కట్టుకోడానికి కూడా యివ్వబడుతుంది. కొన్ని ప్రాంతాల్లో స్వంత భూమి 2½ యకరాల వరకు గూడా ఉంటుంది.

విస్తీర్ణమైన కొన్ని వ్యవసాయక్షేత్రాల్లో ఒక్కొక్క రైతు ఒక ఆవును, ఒకటి రెండు దూడలను, గొర్రెలు, మేకలు, పందులు, కోడిపెట్టలను గూడా స్వంత ఆస్తిగా అనుభవిస్తాడు. పశు సంపద యెక్కువగా అభివృద్ధయ్యే

ప్రదేశాల్లో సమిష్టి వ్యవసాయదారుడు తన స్వంత ఉపయోగం కోసం నాలుగైదు ఆవులను, దూడలను, ముప్పయి నలభై గొర్రెలను, మేకలను, యితర పశువులను కావలసినన్ని కోడిపెట్టలను, పావురాళ్ళను, ఒక గుర్రాన్ని, ఒక ఒంటెను ఉంచుకోవచ్చు. కొన్ని జిల్లాల్లో పశు గ్రాసం చాలినంత లేక, మందలు మందలుగా పశువులు దూర ప్రాంతంలో ఉన్న పచ్చిక బయళ్ళకు, పర్వత ప్రాంతాలకు తోలుకుపోబడతాయి. అలాంటి ప్రదేశాల్లో, రైతులు 8 మొదలు 10 వరకు ఆవులను, 100 మొదలు 150 వరకు గొర్రెలను అట్టిపెట్టుకోవచ్చు. ఈ స్వంత ఆస్తి మూలంగా సమిష్టి వ్యవసాయదారులు తమ ఆదాయాన్ని యెక్కువ చేసుకోడాని కవకాశం కల్గుతుంది. సమిష్టి వ్యవసాయక్షేత్ర నిర్వాహకులు, రైతులు స్వంత ప్రయోజనాలను, వ్యవసాయ క్షేత్రం యొక్క సమిష్టి ప్రయోజనాలను సమన్వయపరచి, రైతాంగం యొక్క సర్వతోముఖాభివృద్ధికి మార్గం కల్పిస్తున్నారు.

---

**18.—సోవియట్ రష్యాలో సమిష్టి క్షేత్రంలో చేరక స్వంత సేద్యంచేసే రైతులున్నారా ?**

ఉన్నారు; అయితే ఆట్టే యెక్కువమందిలేరు. సమిష్టి వ్యవసాయ క్షేత్రంలో చేరడమంటే, ఐచ్ఛికంగా, మనస్ఫూర్తిగా జరగాల్సిందే ఆపని; బలత్కారమంటూ లేదు. సోవి

యట్ రైతాంగంలో అత్యధికభాగం, సమిష్టి వ్యవసాయ క్షేత్రం వల్ల కలిగే ప్రయోజనాలను స్వానుభవంవల్ల తెలుసుకోగలిగారు. ఈ సత్యాన్ని గ్రహించలేని స్వల్ప సంఖ్యాకులుమాత్రం యీ సమిష్టి క్షేత్రాల్లోచేరక స్వంత సేద్యంపైనే ఆధారపడి జీవిస్తున్నారు. ఈ శ్రేణికి చెందిన రైతాంగం తమ కుటుంబాల సహాయంతోనే తన స్వంత వ్యవసాయం చేసుకుంటారు. కూలి డబ్బులిచ్చి కమతం చేయించుకునే దోపిడివిధానం సోవియట్ యూనియన్‌లో చట్టరీత్యా నిషేధించబడ్డది.

---

**19.—సోవియట్ రష్యా అనావృష్టిదోషాన్ని ఎలా ప్రతిఘటిస్తుంది?**

అనావృష్టి దోషాన్ని ప్రతిఘటించడం సోవియట్ ప్రభుత్వ బాధ్యత. సోవియట్ ప్రభుత్వం స్థాపించినప్పుడే లెనిన్, స్టాలిన్ మహానాయకులు ప్రకృతివాతావరణాలను సమాజానికి సహాయకారిగా మార్చుకోడానికై ఒక ప్రణాళికను రూపొందించి ప్రజల ముందుంచారు. ఈ ప్రణాళికను అమలుజరపడం తక్షణావశ్యకతగా భావించింది సోవియట్ ప్రభుత్వం.

ఈ ఆశయాన్ని సాధించేందుకై వేలకొలది సమిష్టి వ్యవసాయదారులు తమ పంటభూములను నష్టదాయకమైన పొడి గాడ్పులనుండి రక్షించుకునేందుకై చెట్లవరసలను నాటారు. ఈ చెట్లవరసలు వాతావరణాన్ని మార్చగలవిగా ఉంటాయి; ఇవిగాక నీటికుంటలు, రిజర్వాయర్లు నిర్మించబడ్డాయి; ఏటేటా

పంటలుమార్చి వ్యవసాయంచేయడంగూడా ప్రకృతిని మార్చే సాధనాల్లో ఒకటి.

ఓల్గా ప్రాంతాల్లోనూ, ఉత్తర కకేషియా, సైబీరియా ట్రాన్సకకేషియా, మధ్యాసియా ప్రాంతాల్లో, కొత్తపద్ధతి మీద ప్రాజెక్టులు అభివృద్ధి చేయబడ్డాయి. ఈ ప్రాజెక్టు సహాయంతో నిస్సారమైన మైదానప్రదేశాలకు, ఎడారులకు పుష్కలంగా నీటిపారుదల జరిగింది. నేడీ విశాలభూఖండాలు సస్యశ్యామలమై అశేష ప్రజానీకాని కాహారపదార్థాలు, యితర జీవితావసరాలు సమకూర్చుతున్నాయి.

అనావృష్టిని మొదలంటా నిర్మూలించే శాస్త్రీయ విధానం యుద్ధం పూర్తయినప్పటినుంచి పటిష్టం చేయబడ్డది. పై అవలంబించబడ్డ కార్యక్రమమే భారీయెత్తుమీద దేశమంతటా అమలుజరపబడ్డది. దీనిలో కొన్ని నవీనశాస్త్రీయ పద్ధతులు గూడా ప్రవేశపెట్టబడ్డాయి. చెట్లునాటడం నుండి, పంటలు మార్చడం, ఎరువులు వేయడం, స్థానిక పరిస్థితుల కనుగుణ్యంగా విత్తనాలు నాటడం, కాలువలు త్రవ్వడం, స్థానికంగా లభ్యమయ్యే నీటిని వృధా పోనివ్వక చెరువులు, కుంటలు త్రవ్వడంవరకు—అనావృష్టిని నిర్మూలించడానికి ప్రభుత్వం తీసుకునే చర్యలు. ఈ ప్రణాళిక ననుసరించి సోవియట్ ప్రభుత్వం బ్రహ్మాండమైన జలవిద్యుత్కేంద్రాలను వోల్గానది ప్రాంతంలోని క్యుబిషేవ్, స్టాలిన్‌గ్రాడ్ నగరాల్లోను, నీపర్‌నదీ ప్రాంతంలో కొన్ని పట్టణాల్లోను దక్షిణ ఉక్రేనియన్, ఉత్తర క్రిమియా, వోల్గా—డాన్ కాల్వల ప్రాంతాల్లోను నిర్మించింది. భూసారాన్ని పెంపొందించడానికీ, అనావృష్టిని ప్రతిఘటించ

డానికీ ప్రభుత్వం నిర్మించిన యీ బ్రహ్మాండమైన ప్రాజెక్టుల ప్రభావం తెలుసుకోనాలంటే యీ క్రింది అంకెలను పరిశీలించడం అవసరం. ప్రకృతిస్వరూపాన్నే మార్చేనిశ్చయం సోవియట్ ప్రభుత్వం యూరపియన్ రష్యా భూభాగంలో 5 లక్షల చదరపుమైళ్ళ ప్రాంతంలో భారీకార్యక్రమం నిర్వహించింది. వోల్గాప్రాంతం, కాస్పియన్‌మైదానం, టర్కు-మేనియా, దక్షిణ ఉక్రెయిన్, ఉత్తర క్రిమియాల్లో నిర్మించబడ్డ ప్రాజెక్టులు లక్షయకరాల భూమిని తడిపి సస్యశ్యామలం చేయగల్గినై.

ఇవిగాక వందల అడుగుల వెడల్పుగల అరణ్యాలను ప్రభుత్వం వందలమైళ్లు పొడవునా బారులుదీర్చి నాటింది. ఈ ప్రాజెక్టులన్నీ అతి శీఘ్రకాలంలోనే ప్రభుత్వం పూర్తిచేయగలుగుతుందంటే ఆశ్చర్యపడవలసిన పనిలేదు,

రష్యాలోని ఐరోపా భూభాగంలో యీ కార్యక్రమమంతా యింకా 10 సంవత్సరాల్లో పూర్తవుతుందని అంచనా వేయబడ్డది. ఈ ప్రాంతంలోనే జలవిద్యుత్ కేంద్రాల నిర్వహణకూడా అయిదారు సంవత్సరాల్లో సమాప్తిచెందుతుంది. ఈ ప్రణాళికలను అమలుజరపడానికి అవసరమైన వస్తుసంపద, సాంకేతిక పరికరాలు పుష్కలంగా సేకరించబడ్డదిగూడా. డబ్బుగూడా కోట్ల సంఖ్యలో సిద్ధం చేయబడ్డది. ఈ మహత్తర కార్యభారాన్ని ఫలప్రదం చేయడానికై సోవియట్ ప్రజలు సమధికోత్సాహంతో సమాయత్తమై తమ యావచ్ఛక్తిని ధారబోసి కృషిచేస్తున్నారు.

---

## 20.—ప్రభుత్వ వ్యవసాయక్షేత్రం అంటేఏమిటి ?

భూమియెత్తుమీద ప్రత్యక్ష ప్రభుత్వ యాజమాన్యంక్రింద పర్యవేక్షణక్రింద నిర్వహించబడే సోషలిస్టు వ్యవసాయసంస్థలనే ప్రభుత్వ వ్యవసాయక్షేత్రాలని పిలవబడతాయి. ఇలాంటి వ్యవసాయ క్షేత్రాలు రష్యాలో 4500 వున్నాయి. ఈ క్షేత్రాల్లో ఆహారధాన్యాలు, పశువుల పెంపకం, ఫల వృక్షాలు, టీ, నిమ్మ, దబ్బ మొదలైన వివిధతరగతుల పంటలు సాగుచేయుబడతాయి. ఈ క్షేత్రాల్లో గూడా, భూమిదున్నడం నుంచి నూర్పిడివరకూ ట్రాక్టర్లు, కంబైన్లు మొదలైన యంత్ర పరికరాలే ఉపయోగించబడతాయి. వ్యవసాయ విధానం, పశువుల పెంపకం అధునాతనమైన శాస్త్రీయ మార్గాలద్వారా నిర్వహించబడుతుంది.

ఈ ప్రభుత్వ వ్యవసాయక్షేత్రాల్లో ఒక ప్రత్యేక లక్షణం ఉంది. ఏ ఒక్క శాఖమీదనో కేంద్రీకరించి ప్రత్యేకంగా అభివృద్ధిచేయడంగాక, వ్యవసాయం నుంచి, పశువుల పెంపకం, పటిష్టమైన విత్తనాలను తయారుచేయడం, బలకరమైన యెరువులను ఉత్పత్తిచేయడం వరకూ — సర్వతోముఖమైన అభివృద్ధిని కాంక్షించి యీ క్షేత్రాలు నిర్వహించబడుతున్నాయి. అధునాతన యంత్ర సహాయంచేత, శాస్త్రీయ వ్యవసాయ పరికరాలచేత సాగుచేయడం మూలాన, కార్మికుల ఉత్పత్తిశక్తి యినుమడించి పుష్కలంగా ఆహార పదార్థాలు లభ్యమౌతున్నాయి.

సమిష్టి వ్యవసాయక్షేత్రాలతోపాటు, ప్రభుత్వ వ్యవసాయ క్షేత్రాలు గూడా దేశానికి కావలసిన ఆహార ధాన్యాలు, పారిశ్రామిక పంటలు, పశుసంతతి నుండి ఉత్పత్తి అయ్యే ఆహారపదార్థాలు కావలసినంతగా ఉత్పత్తిచేస్తున్నాయి. సోషలిస్టు ప్రాతిపదికపై పునర్నిర్మాణం చేయబడుతున్న సోవియట్ వ్యవసాయ రంగంలో ప్రభుత్వ వ్యవసాయ క్షేత్రాలు ప్రశంసనీయమైన పాత్ర నిర్వహిస్తున్నాయి. స్వంతగా కొద్ది కొద్ది ప్లాట్లలో సేద్యం చేసేకన్న, భారీమొత్తుపైన సమిష్టి క్షేత్రాల్లోనో, ప్రభుత్వ వ్యవసాయ క్షేత్రాల్లోనో వ్యవసాయం చేయడం రైతాంగానికీ దేశానికీ యెక్కువ ప్రయోజనకారని ప్రత్యక్షానుభవం ద్వారా రుజువౌతున్నది. ఈ అనుభవాన్ని గుర్తించిన రైతులు సమిష్టి వ్యవసాయక్షేత్రాల్లో ప్రవేశించి దేశ సౌభాగ్యానికి యితోధికంగా సహాయపడుతున్నారు.

ప్రభుత్వ ప్రణాళికలకు అనుగుణ్యంగా యీ వ్యవసాయ క్షేత్రాలు, సమిష్టి వ్యవసాయక్షేత్రాల కవసరపడ్డ నాణ్యమైన విత్తనాలను చౌక ధరలకు సప్లయిచేయగలుగుతున్నాయి.

---

### 21.—యుద్ధానంతర పంచవర్ష ప్రణాళిక ఎలా అమలు పర్చబడింది?

రెండవ ప్రపంచ యుద్ధం ముగియగానే, 1946 మార్చిలో జాతీయ ఆర్థిక విధానాన్ని పటిష్టం చేయడానికీ, ప్రజల

ఆర్థిక జీవనాన్ని పునరుద్ధరించి సుస్థిరంచేయడానికి సుప్రీం సోవియట్ పంచవర్ష ప్రణాళికను ఆమోదించింది. ఈ ప్రణాళిక 1946 నుంచి 1950 లోగా పూర్తిచేయాలి. యుద్ధంవల్ల అధిక నష్టాలకు గురైన ప్రదేశాలను పునరుద్ధరించడం, పారిశ్రామిక, వ్యవసాయ నిర్మాణాన్ని యుద్ధాత్పూర్వపు స్థాయికి తేవడం యీ ప్లాను యొక్క ప్రధానాశయం. కమ్యూనిస్టు పార్టీ నాయకత్వాన, సోవియట్ ప్రజలు ఈ ఆశయాన్ని సాధించడమేగాక, పాశ్చాత్యరాజ్యాలను గూడా అధిగమించి ముందుకు సాగారు. నిర్ణీతకాలంలోనే పంచవర్ష ప్రణాళికలోని ప్రధాన ప్రాజెక్టులు నిర్మించబడ్డాయి. ఈ ప్రణాళికప్రకారం, పారిశ్రామికోత్పత్తి 1940 నాటికన్న 1950 లో నూటికి 48 రెట్లెక్కువ కావాలని నిర్ణయించబడింది; కాని 73 రెట్లెక్కువయింది. భారీ యంత్రాలను నిర్మించే పరిశ్రమలుగూడా నిర్ణీతకాలంలో అనుకున్న దానికన్నా యెక్కువ ఉత్పత్తిచేశాయి.

1946–1950 మధ్య 6000 పారిశ్రామిక సంస్థలను పునరుద్ధరించడంగానీ, కొత్తవి నిర్మించి అమలులో పెట్టడంగానీ జరిగింది. ఇవికాక ప్రభుత్వసహకారసంస్థలు, సమిష్టి వ్యవసాయ క్షేత్రాలూ యెన్నో పునరుద్ధరించబడ్డాయి. ఈ పునరుద్ధరణ కార్యక్రమం ద్వారా బలపడ్డ సోవియట్ పారిశ్రామిక సంస్థలు 1940 నాటికన్న 1950 లో నూటికి 58 వంతులు యెక్కువ ఉత్పత్తి చేశాయి.

సోషలిస్టు వ్యవసాయరంగంలోగూడా పంచవర్ష ప్రణాళిక జయప్రదంగా నిర్వహించబడింది. అదివరకుకన్న ధాన్యం పండించే ప్రదేశం క్రమంగా విశాలమైంది. 1940 నాటికన్న

1950 లో 5500,000 టన్నుల ఆహారధాన్యాలు మెక్కువగా పండాయి. ఈ ప్రణాళికలో నిర్ణీతమైన పశుసంఖ్యకన్న, అధికంగా ఉత్పత్తై ఆరోగ్యకరంగా జీవిస్తున్నాయి.

ఈ ఐదుసంవత్సరాల్లో వ్యవసాయాభివృద్ధికోసం 536000 ట్రాక్టర్లను సోవియట్ పరిశ్రమలు సప్లయిచేశాయి; నూర్పిడి చేసే యంత్రాలను 93000 వరకూ సరఫరా చేసింది; ట్రాక్టర్లచే నడబడే నాగళ్లు 341,000, విత్తనాలు చల్లేయంత్రాలు 254000, యింకెన్నో రకరకాలైన యంత్రాలు సప్లయిచేయబడ్డాయి. యంత్రాభివృద్ధి ఫలితంగా వ్యవసాయ పరిశ్రమ దేశాదాయాన్ని మెక్కువచేసి ప్రజల జీవిత పరిణామాన్ని యినుమడింపజేసిందనడానికి యీ క్రింది అంకెలే తార్కాణం. ప్రభుత్వ యాజమాన్యం క్రింద, సహకార సంస్థలక్రింద నడపబడే చిల్లర అంగళ్ళలో 1940 కన్న 1950 లో యీ క్రింది విధంగా అమ్మకాలు మెక్కువైనాయి. మాంసం, మాంసంవల్ల తయారయ్యే యితర పదార్థాలు నూటికి 38 వంతులు; చేపలవల్ల తయారయ్యే పదార్థాలు 51 వంతులు; వెన్న 59 వంతులు; యితర కొవ్వు పదార్థాలు 67 వంతులు; పంచదార 33 వంతులు; చెప్పులు బూట్లు 39 వంతులు రకరకాలైన బట్టలు 47 వంతులు.

శిథిలమైన నివాసగృహాలను పునర్నిర్మాణం చేయడం ద్వారాగానీ, కొత్తవికట్టడం ద్వారాగాని పారిశ్రామిక పట్టణ ప్రాంతాల్లో 100 కోట్ల చదరపు అడుగుల వైశాల్యం కన్నుల పండుగగా కళకళలాడుతోంది. గ్రామీణప్రాంతాల్లో 27,00000 నివాసగృహాలు పునర్నిర్మించబడ్డాయి. యుద్ధానంతరం అమలు జరిపిన పంచవర్ష ప్రణాళికలో పై పేర్కొన్న విజయాలు కొన్ని

మాత్రమే. 1951 లో వీటికెన్నోరెట్లు విజయాలు తర్వాత అమలు జరుపబడ్డ ప్రణాళికల ఫలితంగా లభ్యమైనాయి.

1951 లో అమలుచేయబడ్డ ఆర్థిక ప్రణాళిక నిర్ణీతమైన అంచనాలకన్న యెక్కువ ఫలితాలను సాధించింది. 1940 కన్న రెట్టింపు అభివృద్ధిగాను, 1950 కన్న నూటికి 16 రెట్లు ఎక్కువగాను, పారిశ్రామికాభివృద్ధి జరిగింది. ఉక్కు పరిశ్రమాభి వృద్ధిలో బ్రిటన్, ఫ్రాన్సు, బెల్జియం, స్వీడన్ దేశాలు కలిసి ఉత్పత్తి చేసినంత చేసింది సోవియట్ రష్యా ఒక్క దేశం. సోషలిస్టు వ్యవసాయ విధానంలో సోవియట్ యూనియన్ 1951 లో ఇంకో అడుగు ముందుకు వేసింది. గతించిన కొద్ది సంవత్సరాల్లో, సోవియట్ రష్యా యేడాదికి 11¼ కోట్ల టన్నుల వరకు ధాన్యం ఉత్పత్తి చేసింది. నిరుటి సంవత్సరం వాతావరణం అననుకూలంగా ఉన్నా, 12 కోట్ల వరకూ ఉత్పత్తి చేయగల్గింది. ప్రత్తిపంట విషయంలో, ప్రపంచంలో కల్లా ప్రత్తిపంటలో ప్రసిద్ధికెక్కిన ఇండియా, పాకిస్థాన్, ఈజిప్టు దేశాల మొత్తం పంటకన్నా యెక్కువగా ఉత్పత్తి చేసింది ఒక్క సోవియట్ రష్యా.

---

**22.—సోవియట్ సాధించిన మహత్తర కమ్యూనిస్టు నిర్మాణ కార్యక్రమం ఏమిటి ?**

స్టాలిన్ నాయకత్వాన నిర్మించబడ్డ జల విద్యుత్ కేంద్రాలను, పంట కాల్వలను, రహదారీ నీటి

మార్గాలను సోవియట్ ప్రజలు 'కమ్యూనిస్టు నిర్మాణ కార్య క్రమం' అని పిలుస్తారు. ప్రపంచంలో యే నిర్మాణ కార్య క్రమం గూడా దీనితో పోల్చడానికి తగదు. ఉదాహరణకు వోల్గా నదిపైన నిర్మించబడ్డ కూయ్‌బిషేవ్ హైడ్రో యెలిక్ట్రిక్ స్టేషన్ పరిమాణం 20 లక్షల కిలోవాట్ల వరకు ఉంది. దీనివల్ల సగటున ఉత్పత్తయ్యే విద్యుచ్ఛక్తి 1000 కోట్ల గంటల వరకు సరిపోతుంది. స్టాలిన్‌గ్రాడ్ హైడ్రోయెలిక్ట్రిక్ స్టేషన్‌లో తయారయ్యే విద్యుచ్ఛక్తి గూడా దాదాపు యింతే ఉంటుంది. ఆముదర్యా, నీపర్, డాన్ నదీ ప్రాంతాల్లో త్వరిత గమనంతో నిర్మించబడుతున్న విద్యుత్ కేంద్రాల్లో గూడా యింతే పరిమాణం గలిగి ఉంటాయి.

ప్రస్తుతం నిర్మాణంలో ఉన్న కాలువలు గూడా యీ విద్యుత్ కేంద్రాలకన్న తక్కువైనవిగావు.

మధ్యాసియాలో త్రవ్వబడుతున్న ప్రధానమైన టర్క్‌మేనియన్ కాలువ పొడుగు 680 మైళ్లు; అంటే సూయజ్ కాలువకన్న 6½ రెట్లు, పెనామా కాలవకన్న 13 రెట్లు పెద్దదన్నమాట. ఈ కాలవ ఆముదర్యా క్రిందిభాగం నుంచి కాస్పియన్ సముద్రం మీాద ఉన్న క్రాస్నోవాడ్స్క్ వరకూ విస్తరించి ఉంది. నీపరు నది నుంచి వందల కొలది పంట కాలవలు చీలి వివిధ ప్రాంతాల గుండా ప్రవహిస్తున్నాయి. ఇవేగాక ఓడలు ప్రయాణంచేసే కాలువలు యెన్నో వందల మైళ్ళ వరకు విస్తరించి ఉన్నాయి.

ఈ కాలువలన్నీ పూర్తయితే, లక్ష చదరపు మైళ్ళ ప్రదేశం సేద్యం కావడానికి అవకాశాలున్నాయి. బ్రహ్మాండ

మైన యీ నిర్మాణ కార్యక్రమం 1950 లో ప్రారంభింపబడ్డది. ఈ కార్యక్రమం 1957 నాటికి పూర్తికాబడుతుంది. ఈ ప్రణాళికలోని చిన్న అంశం మొదలు, పెద్ద అంశం వరకూ సమాన ప్రాముఖ్యతతో నిర్వహించబడి జయప్రదంగా కొనసాగించబడుతున్నాయి.

ఈ క్రొత్త హైడ్రో యెలక్ట్రిక్ స్టేషన్లను జయప్రదంగా పూర్తిచేయడం ఫలితంగా ప్రధానమైన జాతీయ ఆర్థిక సమస్యలన్నీ పరిష్కరించబడతాయి. వీటిలో సంవత్సరానికి తయారయ్యే 2250 కోట్ల కిలోవాట్ల విద్యుచ్ఛక్తి ప్రజలకు చౌకగా సరఫరా చేయబడుతుంది. వీటిలో తయారయ్యే విద్యుచ్ఛక్తి మొత్తం ఇటలీలో తయారయ్యే విద్యుచ్ఛక్తికి సమానంగా ఉంటుంది. ఇప్పుడు సాగయ్యే భూమికన్న యెక్కువ ప్రాంతం సేద్యంచేస్తే, ప్రతి సంవత్సరం, యిదివరకుకన్న 30 లక్షల టన్నుల ప్రత్తి ఉత్పత్తి కాగలదు. అంటే ప్రస్తుతం అమెరికాలో యేటా సాగయ్యే ప్రత్తిలో మూడోవంతుకన్న ఎక్కువ పండుతుందన్నమాట. ఇదేవిధంగా 80 లక్షల టన్నుల గోధుమలు, 5 లక్షల టన్నుల బియ్యం, 60 లక్షల టన్నుల బీట్ రూట్ అమెరికాకన్న సోవియట్ యూనియన్‌లో యెక్కువ ఉత్పత్తవుతున్నది. నూతనంగా సేద్యం క్రిందకు వచ్చే యీ ప్రాంతాల్లో లక్షలకొలది పశుసంపద అభివృద్ధి అవుతుందని అంచనా వేయబడుతున్నది. ఈ ప్రాజెక్టుల మూలంగా దేశంలో వివిధ ప్రాంతాల మధ్య రహదారి సౌకర్యాలు, వ్యాపారాభివృద్ధి, విపరీతంగా వృద్ధిచెందుతుంది. వోల్గా - డాన్ కాలవను యిటీవల పూర్తిచేయడంతో, బాల్టిక్, నైట్ కాస్పి

యన్, ఆజోవ్, నల్ల సముద్రాలూ కలిసి ఒక బ్రహ్మాండమైన ఏక సముద్రమైనట్లయింది, ఈ అయిదు సముద్రాల కూడలికి మాస్కో నగరం ఒక ఓడరేవు పట్టణంగా తయారైంది. ప్రస్తుతం నిర్మాణంలోవున్న హైడ్రోయెలక్ట్రిక్ స్టేషన్లు, ప్రాజెక్టులు, పంటకాల్వలు పూర్తికావడంతో, సోషలిస్టువిధానం లోని సాంకేతిక పునాదులు మరింతబలపడి విస్తరిస్తాయి. సోవియట్ యూనియన్‌లో సత్వర కమ్యూనిస్టుసమాజ నిర్మాణానికి యీ ప్రణాళికలు అత్యంత సహాయకారులవుతాయి.

---

## 23.—జాతీయాదాయం ఎలా విభజింప బడుతుంది?

సోవియట్ రష్యాలో జాతీయాదాయం కష్టజీవులందరి సమిష్టి సొత్తుగా పరిగణించబడుతుంది. ఈ ఆదాయాన్ని క్రిందివిధంగా విభజిస్తారు.

దాదాపు నాల్గోవంతు ఆదాయం ఉత్పత్తిని అభివృద్ధి చేయడానికీ, అందుకవసరమైన వస్తుసంపదను నిల్వచేయడానికి వినియోగించబడుతుంది. మిగిలినమొత్తం, కష్టజీవుల వ్యక్తిగత అవసరాలను తీర్చి, వారిజీవితాన్ని సుభిక్షం చేయడానికి వెచ్చించబడుతుంది. 1950 లో జాతీయాదాయం క్రిందివిధంగా విభజించబడ్డది. నూటికి 74 వంతులు ప్రజల భౌతిక, సాంస్కృతిక అవసరాలను తృప్తిపరచడానికీ, తక్కిన 24 వంతులు ఉత్పత్తిని అధికంచేసి విస్తరింపజేయడానికీ సోవియట్ ప్రభుత్వం

కేటాయించింది. 1951 లో గూడా యీ నిష్పత్తిలోనే జాతీయాదాయం విభజించబడ్డది. ప్రజల అవసరాలను తీర్చడానికై వినియోగించబడ్డ డబ్బును యెలా ఖర్చు చేశారో వివరాలు తెలుసుకుందాం. ఈ మొత్తంలో కార్మికుల వేతనాలు, యితర ఉద్యోగుల జీతాలు గూడా యిమిడిఉన్నాయి. దీనితోపాటే సమిష్టి వ్యవసాయక్షేత్రాల్లో పనిచేసే రైతుల, యితర ఉద్యోగుల ఆదాయంకూడా కలిసిఉంది. సాంఘిక భీమావిధానానికై వినియోగించేడబ్బు, దేశవ్యాపితంగా అమల్లో ఉన్న ఉచిత విద్యావిధానానికై పెట్టే ఖర్చు, వైద్యసౌకర్యాలకై వెచ్చించే మొత్తం, యితర సాంస్కృతిక అవసరాలకై వినియోగింపబడే ధనం గూడా దీనిలోనిదే.

1950 లో ధనరూపంలోగానీ, యితర సౌకర్యాల రూపంలో గానీ ప్రజలు ప్రభుత్వంనుంచి పొందిన ప్రయోజనాలు 120,00 కోట్ల రూబుల్స్ పైగా ఉంటుంది. అంటే, యీ మొత్తం 1940 నాటి మొత్తంకన్న మూడు రెట్లధికం. 1951 లో యీ ఖర్చులు 12500 రూబుల్సుకు పైబడ్డాయి. సోవియట్ యూనియన్‌లో ఉత్పత్తికి వినియోగించబడే ఖర్చుకూ ప్రజావసరాలకు వినియోగించబడే ఖర్చుకూ మధ్య సంఘర్షణ, పోటీ అంటూ ఉండదు. ఎక్కడ యే రంగంలో ఉత్పత్తి సాధించబడ్డా అది ప్రజల ప్రయోజనాలను, జీవితపరిమాణాన్ని అధికంచేయటానికే.అధికోత్పత్తిని సాధించడమంటే, విధిగా ప్రజల భౌతిక, సాంస్కృతిక స్థాయిని పెంచడమన్న మాట.

జాతీయాదాయం సోవియట్ యూనియన్‌లో యేటా యేటా పెరుగుతూనే ఉన్నది. ఆర్థిక సంక్షోభాలు, నిరుద్యోగ సమస్య, పేదరికం లేనిసోవియట్ యూనియన్‌లో సోషలిస్టు ఆర్థిక వ్యవస్థపై అమలు జరిగే ప్రణాళికల ఫలితంగా సమకూరే ప్రయోజనాలు అసామాన్యమైనవి. ఈ విధానం క్రింద జాతీయాదాయం నానాటికి అధికంకాక ఏమౌతుంది! 1940 నాటికి సోవియట్ సాంవత్సరిక జాతీయాదాయం 1913 నాటికన్న ఆరు రెట్లధికమయింది, 1946 - 1950 మధ్య కాలంలో యీ ఆదాయం మరింత త్వరితంగా పెరిగింది. యుద్ధానంతరం పంచవర్ష ప్రణాళిక ప్రకారం జాతీయాదాయం 1940 నాటికన్న నూటికి 38 రెట్లెక్కువౌతుందని అంచనా వేయబడ్డది. కాని అప్పటి ధరలతో పోల్చిచూస్తే, 64 రెట్లెక్కు వైంది. దీనితోపాటు ప్రజల సంపాదన కూడా విపరీతంగా పెరి గింది. 1950 లో ప్రజల సంపాదన 1940 కన్న నూటికి 62 వంతులు యెక్కువైంది. 1951 లో జాతీయాదాయం 1950 కన్న నూటికి 12 రెట్లధికమైంది.

---

## 24.—సోవియట్ విదేశాంగ విధానంలోని ప్రధాన సూత్రాలేవి?

సోవియట్ రష్యా విదేశాంగ విధాన సారాంశాన్ని, దాని ఆశయాలను స్టాలిన్ యీ విధంగా స్పష్టీకరించాడు.

"మా విదేశాంగ విధానం స్పష్టమైనదే. శాంతిని పరిరక్షించడం; వివిధ దేశాలమధ్య వ్యాపార, వాణిజ్య సంబంధాలను దృఢపర్చడం. ఏ దేశాన్నీ బెదిరించడం, భయోత్పాతం కలిగించడం మా దేశం కలలోనైనా తలచదు. మరో దేశం మీద దండెత్తడం అనే విషయం అసంభవమైందని వేరే చెప్ప నక్కర్లేదు. మేము శాంతి కోసం నిలిచి పనిచేస్తాం. శాంతి కొరకెన్ని త్యాగాలైనా చేస్తాం. ఈ ఆశయం కొరకు విధి విరామం లేకుండా దీక్షాసక్తులతో కృషిచేయడమే మా కర్తవ్యం."

వివిధ జాతుల మధ్య, వివిధ దేశాల మధ్య శాంతి, సౌహార్దాలను నెలకొల్పడమే సోవియట్ విదేశాంగ విధానం లోని ప్రధాన సూత్రం. ఈ నాటి వరకూ యీ విధానం ఖచ్చితంగా అమలుజరుపబడ్డది. సోవియట్ విధానం అమల్లోకి వచ్చినప్పటినుండీ, రష్యా యే ఒక్క దేశంపై గూడా దండెత్త లేదు. చిన్న దేశాలు గానీ, పెద్దవి గానీ — బానిసత్వంలో కృంగి కృశించే జాతులకు చేయూత యిచ్చి, వారి స్వతంత్ర పోరాటాలకు దోహదమిచ్చింది సోవియట్ రష్యా.

1917 నవంబరు 8 వ తేదీన (సోవియట్ ప్రభుత్వం యేర్పడ్డ మరుసటిరోజు) లెనిన్‌చే స్వయంగా రూపొందించబడ్డ సందేశాన్ని సోవియట్ ప్రభుత్వం రేడియో ద్వారా ప్రజానీకానికి ప్రసారం చేసింది.

హిట్లర్ యూరప్ రాజ్యాలను పాదాక్రాంతం చేసుకొని, యూరప్ ప్రజలను బానిసలుగా చేసుకున్న తర్వాత

సోవియట్ విూద దండెత్తినప్పుడు స్టాలిన్ సకల ప్రపంచానికీ ఒక దివ్య సందేశమిచ్చాడు :

"ఇతర దేశాలను బలత్కారంగా వశపరచుకొనడం ప్రజలను బానిసలుగా బంధించడం సోవియట్ రష్యా అభిమతం, ఆశయం యెన్నటికీకాదు. హిట్లర్ నిరంకుశత్వాన్ని ప్రతిఘటించి, స్వాతంత్రం కొరకు పోరుసల్పే సమస్త జాతులకు, దేశాలకు సహాయంచేయడమే మా కర్తవ్యం. శతృవు తుదముట్టాక, ఆ యా దేశాలు వారి వారి అభిమతాల ననుసరించి వారి వ్యవహారాలను చక్కదిద్దుకుంటారు. ఏ యితర దేశ ఆంతరంగిక వ్యవహారాల్లోగానీ సోవియట్ ప్రభుత్వం జోక్యం పెట్టుకోదు."

హిట్లర్ ప్రమాదంనుండి యూరప్ ప్రజలను విముక్తి చేసి, శాంతి చేకూర్చిన తర్వాత, సోవియట్ ప్రభుత్వం తన సైన్యాలను ఆ దేశాలనుండి ఉపసంహరించుకున్నది. తమ ఆంతరంగిక వ్యవహారాలను తామే చక్కదిద్దుకుని తమ రాజ్యాంగ విధానాలను తామే రూపొందించుకునే అవకాశం సోవియట్ ప్రభుత్వం సంపూర్ణంగా కల్గించింది. ఉదాత్తమైన విశిష్టమైన యీ విధానాన్ని సోవియట్ ప్రభుత్వం యెన్నడూ విసర్జించదు.

ఫాసిస్టు యుద్ధోన్మాదులను ఓడించటంలో ప్రధానపాత్ర ధరించిన సోవియట్ ప్రభుత్వం, మహాయుద్ధాన్ని రెచ్చగొట్టడానికై కుట్రలు పన్నుతున్న యుద్ధప్రేరేపకులను ప్రతిఘటిస్తూ సోవియట్ ప్రభుత్వం అఖండ ప్రచారం చేసింది; ఈ ప్రచారంతోపాటే, సుస్థిర ప్రజాస్వామిక శాంతిస్థాపనకుకూడా అనన్య

ప్రచారం చేసింది. ప్రపంచమంతటా సుస్థిరశాంతిసాధనకై సోవియట్ ప్రభుత్వం ఐక్యరాజ్యసమితిలో నిర్మాణయుతమైన అనేక సూచనలను ప్రవేశపెట్టింది. పూర్తిఆయుధసైనిక విసర్జనకైగానీ, లేదా కొంతవరకైనాగానీ అన్నిరాజ్యాలూ పూనుకోవాలనీ, యుద్ధకలాపాలకై ఆటంశక్తిని నిషేధించాలనీ, యీ నిషేధాన్ని ఆచరణలోపెట్టడానికై అంతర్జాతీయ సంఘాన్ని స్థాపించడం, సోవియట్ రష్యా, అమెరికా, బ్రిటన్, చైనా, ఫ్రాన్సు దేశాలమధ్య ఒడంబడిక యేర్పర్చుకొనడం మొదలైనవి సోవియట్ ప్రభుత్వం ప్రవేశపెట్టిన సూచనలలో ప్రధానమైనవి. సంఖ్యాబలంలో మెజారిటీగావున్న అమెరికన్ బ్రిటిష్ సామ్రాజ్యవాదులమూతా యీ సూచనలను తిరస్కరించింది. అయినా, దీక్ష విడనాడక శాంతిసాధనకై, యుద్ధ ప్రేరేపకులను ప్రతిఘటిస్తూ సోవియట్ ప్రభుత్వం పోరాడుతూనే ఉంటుంది.

సోవియట్ ప్రభుత్వం, ప్రజలూ ఒకే సూటిమార్గాన శాంతియుతమైన విదేశాంగవిధానం కొరకెందుకు పోరాడుతున్నారు? సోవియట్ సామాజిక నిర్మాణాన్ని, ప్రభుత్వ నిర్మాణాన్ని అవగాహన చేసుకున్నవారికి యీ ప్రశ్నకు సమాధానం సులభంగా అర్థమౌతుంది.

సోవియట్‌లో, యుద్ధాలవల్ల లాభాలు పోసుకుందామని భావించే పీడితవర్గాలు లేవినాడు. కాబట్టే యితర దేశాలను ఆక్రమిద్దామనే దురూహ యే సోవియట్ పౌరుడికీవుండదు. సోవియట్ ప్రజానీకం యావత్తూ శాంతిదాయకమైన నిర్మాణ కార్యక్రమంలో నిమగ్నులై ఉన్నారు.

సోవియట్ ప్రభుత్వం దురాక్రమణకు దారితీసే విదేశాంగ విధానాన్ని అవలంబిస్తున్నదని సామ్రాజ్యవాదులుచేసే ప్రచారం అతినీచమైనదీ, కుత్సితమైనది.

---

### 25.—సోషలిస్టు, కాపిటలిస్టు వ్యవస్థలు ఒకదానిసరసన ఒకటి మనగలవా ?

పెట్టుబడిదారీ దేశాల్లో వివిధతరగతులకు చెందిన ప్రజానాయకులు, ప్రముఖ వ్యక్తులు, పత్రికారచయితలు సోవియట్ ప్రభుత్వ నాయకులను యీ ప్రశ్న తరచుగా అడుగుతూనే వచ్చారు. పెట్టుబడిదారీవిధానం, సోషలిస్టు విధానం— యీ రెండూ, ఒకదాని సరసన ఒకటి శాంతియుతంగా మనగలవని అవసరమనిగూడా సోవియట్ నాయకులు ఘంటాపదంగా జవాబిస్తూనే వచ్చారు. 1920 వ సంవత్సరం ఫిబ్రవరి నెలలో "న్యూయార్క్ ఈవెనింగ్ జర్నల్" పత్రికా విలేఖరి, ఆసియాలో రష్యా విధానమేమిటని లెనిన్‌ను ప్రశ్నించినప్పుడు లెనిన్ చెప్పిన సమాధానం యిది :

"యూరప్‌లో మాదిరే ఆసియాలోగూడా, ఇతర ప్రజల సరసనే శాంతియుత జీవితం గడపడం." ముప్ఫయి యేండ్లనాడు లెనిన్ నాయకత్వంక్రింద యే ఆశయాల కొరకు సోవియట్ ప్రజలు జీవించారో, ఆ ఆశయాలే యీ నాటికీ సోవియట్ విదేశాంగ విధానంలోని ప్రధానాంశాలు. లెనిన్ అడుగు

జాడల్లో నడిచే యీ నాటి సోవియట్ నాయకులధ్యేయం గూడా అదే.

1946 డిశంబరులో సోవియట్ రష్యాను దర్శించిన ఎలియట్ రూజ్‌వెల్ట్ స్టాలిన్‌తో ప్రసంగిస్తూ పెట్టుబడిదారీ, సోషలిస్టు వ్యవస్థలు ఒకదాని సరసన ఒకటి బ్రతకగలవా అని అదే ప్రశ్న వేశాడు. రెండువ్యవస్థలూ భిన్న విభిన్నాలైనా, పక్క పక్కనే మనగలవని అన్యోన్య సహకారం నెరపగలవనిగూడా స్టాలిన్ సమాధాన మిచ్చాడు. 1947లో హెరాల్డ్ స్టాసెన్ అడిగిన ప్రశ్నకు గూడా యిదే సమాధాన మిచ్చాడు.

సోవియట్ రష్యాకు, పెట్టుబడిదారీదేశాలకు, ముఖ్యంగా సోవియట్ రష్యాకు అమెరికాకు మధ్య సహకారం అవసరమూ, సాధ్యమూ అని గూడా స్టాలిన్ వక్కాణించాడు. ఈ సహకారంద్వారానే ప్రపంచశాంతి సాధించబడగలదని గూడా ఉద్ఘాటించాడు.

స్టాలిన్ చెప్పిన మాటలివి: 'కాపిటలిస్టు, సోషలిస్టు దేశాల ఆర్థికవిధానాలు జీవిత సిద్ధాంతాలు విభిన్నమైనప్పటికీ, యీ రెండు వ్యవస్థలు ఒకదాని సరసన ఒకటి జీవించడానికీ, రష్యా అమెరికాలు తమ మధ్యఉన్న అభిప్రాయభేదాలను తొలగించుకుని ఒక అంగీకారానికి రావడానికి అవకాశంఉంది; ప్రపంచ శాంతిస్థాపన దృష్ట్యా, పరస్పర అంగీకారం వాంఛనీయమూ, తప్పనిసరి గూడాను."

## 26.—సోవియట్ ప్రజలు ప్రపంచ శాంతి ఉద్యమంలో చురుకుగా యెందుకు పాల్గొంటున్నారు ?

యుద్ధం వాళ్ళకు అవసరంలేదు గాబట్టే సోవియట్ ప్రజలు శాంతి ఉద్యమంలో చురుకుగా పాల్గొంటున్నారు. గతంలో శత్రువులు వాళ్ళపై తెచ్చిపెట్టిన యుద్ధాలు వారి కమ్యూనిస్టుసమాజ నిర్మాణకృషికి అంతరాయం కలిగించాయి.

సోవియట్ ప్రజలు శాంతికోసం పోరాడటం వాళ్ళకు యుద్ధంతో అవసరంలేకపోవటమనే ఒక్క కారణంవల్లనే గాదు. దురాక్రమణయుద్ధాన్ని—మానవజాతియెడ ఘోరమైన అపరాధంగానూ, ప్రపంచంలో సామాన్య ప్రజానీకంపై విరుచుకుపడే విపత్తులన్నిటికల్లా అతిదారుణమైనదిగానూ పరిగణిస్తారు గాబట్టి వాళ్లు శాంతికోసం పోరాడుతున్నారు.

అందువల్లనే యీ మధ్యకాలంలో ప్రపంచ శాంతి ఉద్యమం ప్రారంభించబడినప్పుడు, ఉదాత్తమైన ఆ వుద్యమంలో సోవియట్ ప్రజలుచేరి ఉత్సాహంగా పాల్గొన్నారు.

సోవియటు యూనియన్‌లో నివసించే ప్రజలందరి ప్రతినిధులూ మూడుసార్లు అఖిల సోవియటు శాంతి మహాసభల్లో ఒకచోట చేరారు. 1949 అగస్టులో, 1950 అక్టోబరులో, 1951 నవంబరులో. శాంతిని సంరక్షించేందుకూ యుద్ధోన్మాదుల దురాగతమైన కుట్రలకు వ్యతిరేకంగా ప్రజలను అప్రమ

త్తులుగా వుంచేందుకూ జరిగే ఉద్యమపురోగమనంలో—ఈమహా సభల్లో ప్రతి ఒక్కటీ ఒక నూతన దశకు వేగుచుక్కవంటిది.

1950 లో, స్టాక్ హోం విజ్ఞప్తిపై 11 కోట్ల 50 లక్షల మంది సోవియట్ పౌరులు సంతకం చేశారు. ప్రపంచ శాంతి మహాసభ యొక్క స్థాయీసంఘం స్టాక్ హోం సమావేశం చేసిన యీ విజ్ఞప్తి యాటం ఆయుధాలను నిషేధించాలనీ, ఆ ఆయుధాలను మొదటప్రయోగించే ప్రభుత్వాన్ని యుద్ధ నేరస్తులుగా ప్రకటించాలని కోరింది.

1951 లో అయిదు అగ్రరాజ్యాలమధ్య శాంతి ఒడం బడిక జరగాలని చేసిన ప్రపంచ శాంతి సంఘం విజ్ఞప్తిపై 11 కోట్ల 70 లక్షలమందికిపైగా సోవియటు పౌరులు సంతకాలు చేశారు.

అమెరికా, ఇంగ్లండు, ఫ్రాన్సు తదితర అన్ని దేశాల ప్రజలతో శాంతి, సౌభ్రాతృత్వాలతో జీవించాలని సోవియట్ యూనియన్ పౌరులు తమ ప్రగాఢ వాంఛను వెలిబుచ్చా రనేదే దీని అర్థం.

"శాంతిః సంరక్షించి తుదివరకూ కాపాడే ఆశ యాన్ని ప్రజలు తమ చేతుల్లోకి తీసుకుంటే శాంతి సంరక్షింప బడి పటిష్ఠం చేయబడుతుంది" మహత్తర శాంతిదూత జోసఫ్ స్టాలిన్ యీ పిలుపును సోవియట్ ప్రజలు పాటించారనేది దీని అర్థం.

సోవియటు యూనియన్ శాంతికి ఖచ్చితమైన కంచు కోట అనే దీని అర్థం.

1951 నవంబరులో మాస్కోలో జరిగిన మూడవ సోవియటు యూనియన్ శాంతి మహాసభ ప్రపంచ శాంతి ఉద్యమ సభ్యుల్ని ఉద్దేశిస్తూ చేసిన ప్రకటన యిదే. అందులో యీ విధంగా చెప్పింది :

"విభిన్న ఆర్థిక విధానాలూ, సిద్ధాంతాలూగల ప్రభుత్వాలు ఒకరి సరసను ఒకరు శాంతియుతంగా నివసించగల అవకాశాలపై తనకు నమ్మకమున్నదని పదే పదే ప్రకటించిన సోవియటు ప్రభుత్వ శాంతియుత విదేశాంగ విధానాన్ని సోవియటు పౌరులు ఏకగ్రీవంగా ఆమోదించి మనసారా బలపరుస్తున్నారు."

"పెట్టుబడిదారీ విధానంతో శాంతియుతమైన పోటీకి మేము జంకం. సామ్రాజ్యవాద దురాక్రమణపరుల కుట్రలకు భయపడేదిలేదు. కమ్యూనిస్టు సమాజ నిర్మాణ కృషి నుండి మా ప్రజల్ని వెనక్కు మరల్చగల శక్తి యీ భూమి మీద లేదు.

"సోవియటు ప్రజలమైన మేము శాంతికి శత్రువులైన వారి కుట్రలను ఒక కంట కనిపెట్టే వుంటున్నాం. అపూర్వ ధైర్య స్థయిర్యాలతో మా స్వేచ్ఛా స్వాతంత్ర్యాలకు వ్యతిరేకంగా చెయి చేసుకునేందుకు సాహసించేవారి నుండి మా మాతృభూమిని రక్షించుకునేందుకూ, మా శాంతియుత కృషిని కాపాడుకునేందుకూ మేం సిద్ధంగానే వున్నాం"

---

## 27.—సోవియట్ శాంతిరక్షణ చట్టంయొక్క ప్రాధాన్యత యేమిటి?

ఏరూపంలో జరుగుతున్నా యుద్ధప్రచారాన్ని నేరంగా నిషేధించమని ఐక్యరాజ్యసమితికీ, అన్ని దేశాల ప్రభుత్వాలకూ 1950 నవంబరులో వార్సాలో జరిగిన రెండవ ప్రపంచ శాంతి మహాసభ విజ్ఞప్తి చేసింది.

ఇతర ప్రజల యెడల ఉదాత్తమైన గౌరవభావాన్ని, జాతులమధ్య శాంతిసౌభ్రాతృత్వాలనూ కలిగివుండే చైతన్యం పొందిన సోవియట్ ప్రజలు ఈ విజ్ఞప్తిని హృదయపూర్వకంగా బలపర్చారు; సోవియట్ శాంతిసంఘం అధ్యక్షుడు, యన్. యన్. టిఖొనోవ్ అనే కవి, చరిత్రాత్మకమైన యీ విజ్ఞప్తిపై 1951 మార్చిలో మాస్కోలో జరిగిన సుప్రీం సోవియట్ సమావేశంలో నివేదించాడు.

శాంతికి కృషిచేసే సోవియట్ ప్రజలందరి యొక్క వాంఛను ప్రతిబింబిస్తూ సుప్రీం సోవియట్ ప్రపంచ శాంతి మహాసభ విజ్ఞప్తిని ఏకగ్రీవంగా బలపరచింది. ఈ క్రిందివిధంగా శాంతి సంరక్షణ చట్టాన్ని ఏకగ్రీవంగా ఆమోదించింది :

"దేశాల మధ్య స్నేహ సంబంధాలనూ, శాంతిని సుస్థిరంచేయడాన్ని ఆశించే సోవియట్ శాంతివిధానపు ఉదాత్తమైన సూత్రాలచే నడపబడే సోవియట్ సోషలిస్టు రిపబ్లిక్ సమాఖ్య సుప్రీం సోవియట్, "

" ఒక్క తరంలోని తమ జీవితకాలంలో రెండుప్రపంచ యుద్ధాల భీభత్సాలను అనుభవించిన ప్రజల అంతరాత్మ, న్యాయ జిజ్ఞాస కొన్ని దేశాల దురాక్రమణ మతాలచే చేయ బడే యుద్ధ ప్రచారం యొక్క నైచ్యాన్ని సహించలేవనే విష యాన్ని గమనిస్తోంది. దురాగతమైన యుద్ధ ప్రచారాన్ని ఖండించి నిషేధించమని అభ్యుదయ మానవజాతి మొత్తం వాంఛను ప్రతిబింబిస్తూ ప్రపంచ శాంతిమహాసభ చేసిన విజ్ఞప్తితో ఏకీభవిస్తోంది.

" సోవియట్ సామ్యవాద రిపబ్లిక్ సమాఖ్య సుప్రీం సోవియట్ యీ విధంగా తీర్మానిస్తోంది.

1. ఏ రూపంలో చేసినా, యుద్ధప్రచారం శాంతి ఆశ యాన్ని వమ్ముచేస్తుంది; మరో యుద్ధ ప్రమాదాన్ని కలిగి స్తుంది. అందువల్ల అది మానవజాతి యెడ ఘోరమైన అప రాధం.

2. యుద్ధ ప్రచారాన్ని చేసే వ్యక్తులు ప్రధాన నేర స్థులుగా విచారణకు పెట్టబడతారు.

సోవియటు యూనియన్ వున్నతాధికార ప్రభుత్వ సంస్థ చేసిన యీ శాంతిరక్షణ చట్టం — సోవియటు ప్రజలు శాంతిని వాంఛిస్తారనేందుకూ, సాధ్యమైన అన్ని పద్ధతుల్లోనూ, వారి శక్తినంతనూ కేంద్రీకరించి శాంతికోసం పోరాడతారనేం దుకు ఒక ప్రబల నిదర్శనం.

---

## 28.—అంతర్జాతీయ స్టాలిన్ శాంతిబహుమతులంటే ఏమిటి ?

జోసెఫ్ స్టాలిన్ 70 వ జన్మదిన గౌరవార్థం సుప్రీం సోవియట్ అధిష్ఠానవర్గం 1949 డిశెంబరు 20 వ తేదీన ఒక ఆదేశంద్వారా 'దేశాలమధ్య శాంతిని సుస్థిరం చేసేందుకు' అంతర్జాతీయ స్టాలిన్ బహుమతుల్ని యేర్పాటుచేసింది.

ఈ బహుమతుల్లో అయిదు నుండి పది వరకూ ఏటేటా ఏదేశంయొక్క పౌరులైనా—వారి రాజకీయ సంబంధాలకు, విశ్వాసాలకూ, తెగలకూ నిమిత్తం లేకుండా—శాంతిసంరక్షణ, పురోగమనంకోసం జరిగే పోరాటంలో ప్రత్యేకపాత్ర నిర్వహించిన వారికి బహూకరించబడతాయి.

ఈ అంతర్జాతీయ స్టాలిన్ బహుమతి పొందేవారు "అంతర్జాతీయ స్టాలిన్ బహూకృతుడు" అనే బిరుదును, స్టాలిన్ బొమ్మవున్న బంగారుపతకాన్ని, లక్షరూబుల్సు నగదు బహుమానాన్ని పొందుతారు.

ఈ బహుమతులు నిర్ణయించేందుకు అనేక దేశాల ప్రజాతంత్రశక్తుల ప్రతినిధులతోకూడిన ఒక ప్రత్యేక అంతర్జాతీయ స్టాలిన్ శాంతి బహుమతి కమిటీ'' సుప్రీం సోవియట్ అధిష్ఠానవర్గంచే నియమించబడింది.

1950 లో అంతర్జాతీయ స్టాలిన్ శాంతి బహుమతులు యీ దిగువ పేర్కొన్న అనేకదేశాల ప్రజాతంత్రశక్తుల ప్రతినిధులకు బహూకరించబడ్డాయి : (ఫ్రెడరిక్ జూలియట్ క్యూరీ (ఫ్రాన్సు); సూంగ్ చింగ్ లింగ్ (సన్‌యట్‌సేన్ సతి, చైనా);

హ్యూలెట్ జాన్సన్ (క్యాంటర్బరీ పీఠాధిపతి, (బ్రిటన్); యూగెనీ కాటన్ (ఫ్రాన్స్); బిషప్ ఆర్థర్ మౌల్టన్ (అమెరికా); పాక్ డెన్ ఆయ్ (కొరియా); హెరిబర్టో జారా (మెక్సికో). కోమోజో (చైనా); పీట్రో నెన్నీ (ఇటలీ); ఇకువో వోయామా (జపాన్); మోనికా ఫెల్టన్ (బ్రిటన్); అన్నా సేగర్స్ (జర్మనీ); జార్జి అమడో (బ్రెజిల్)–1951 లో వీరికి బహూకరించబడ్డాయి.

సోవియట్ ప్రజలు న్యాయంగా పిలిచే 'స్టాలిన్ విదేశాంగ విధానం' అనేవిధానం—సోవియటుయూనియన్ దీక్షతో అనుసరించే శాంతియుత విదేశాంగ విధానానికి అంతర్జాతీయ స్టాలిన్ శాంతి బహుమతి ఏర్పాటొక విస్పష్టమైన దృష్టాంతం.

---

**29.—రాజ్యాంగచట్టంలో నిర్దేశించబడ్డ సోవియట్ పౌరులందరి సమానత్వమనే దాని అర్థం ఏమిటి?**

సోవియట్ సమాజం స్త్రీ - పురుషుల మధ్యగానీ, ఆస్తి గలవాళ్లు – లేనివాళ్ళ మధ్యగాని, నివాసులు-నివాసులు కానివాళ్ళ మధ్యగాని, విద్యావంతులు – విద్యలేనివాళ్ళ మధ్యగాని హక్కుల్లో తారతమ్యాన్ని గుర్తించదు.

ఏ జాతికి చెందినా, స్త్రీ గాని, పురుషుడు గాని, సోవియట్ పౌరులు ఏ ప్రభుత్వాధికార సంస్థకైనా ఎన్నికయ్యేందుకూ ఏ ప్రభుత్వోద్యోగానికైనా నియమించేందుకూ అర్హత కలిగివుంటారు. పౌరులంతా సమానమైన పనికి సమానమైన వేతనం పొందుతారు. ఏ శాస్త్రీయ, సాహిత్య, విద్యా విష

యక, రాజకీయ, తదితర సంఘ కార్యకలాపాల్లోనైనా స్వేచ్ఛగా పాల్గొనవచ్చు.

సోవియట్ సోషలిస్టు రిపబ్లిక్ సమాఖ్యలో స్త్రీలు, ఆర్థిక, పరిపాలన, రాజకీయ తదితర సంఘ కార్యకలాపాల్లో అన్ని రంగాల్లోనూ పురుషులతో పాటు సమాన హక్కులు పొందారు.

తెగనుబట్టి గాని, జాతినిబట్టి గాని – ప్రత్యక్షంగా గాని, పరోక్షంగా గాని – పౌరుల హక్కుల్ని సంకుచితపర చటం ఖచ్చితంగా నిషేధించబడింది.

తెగ, జాతికి సంబంధించిన కేటాయింపును ప్రచారం చేయటం, యే జాతిపైనైనా ద్వేషం, దురభిమానం రేకెత్తించటం. ప్రభుత్వ వ్యతిరేక నేరం. ఏ జాతి, తెగకు సంబంధించిన పౌరులకైనా ప్రత్యేక హక్కుల్ని నిర్దేశించటం గూడా సోవియట్ చట్టం నిషేధిస్తుంది. (రాజ్యాంగ చట్టం 123 వ సూత్రం)

సోవియట్ సమాజంలో అందరు పౌరులూ సమాన హక్కులు అనుభవిస్తారు. సమాజంలో స్థానం ఆస్తి హోదాను బట్టి గాని, జన్మించిన జాతినిబట్టి గాని, స్త్రీ పురుష భేదాన్ని బట్టి గాని, ఉద్యోగ హోదానుబట్టి గాని నిర్ణయించబడదు. శ్రమ, సామర్థ్యాలనుబట్టి నిర్ణయించబడుతుంది.

ప్రతి సోవియట్ పౌరుని పనికి, విశ్రాంతికీ, విద్యకూ, వృద్ధాప్యంలో, జబ్బులో, శక్తులుడిగినప్పుడు తన బ్రతుకు భద్రతకు హక్కు గ్యారంటీ చేయబడింది.

---

30.—సోవియట్ కి పౌరుని పనిచేసేహక్కు ఎలాహామీ ఇవ్వబడింది? సోవియట్ లో నిరుద్యోగం ఎందువల్లలేదు?

సోవియటు రష్యా రాజ్యాంగ చట్టం, 118 వ నిబంధన యిలా చెబుతుంది; "సోవియటు ప్రజలకు పనిచేసే హక్కు, వారి ఉత్పత్తి నైపుణ్యాలనుబట్టి సంపాదించుకునే హక్కు ప్రభుత్వం గ్యారంటీ చేస్తుంది. సోవియటు వుత్పత్తి శక్తుల నభివృద్ధిచేయడానికీ, ఆర్థిక సంక్షోభాలను నిర్మూలించడానికీ, నిరుద్యోగ సమస్యను రూపుమాపడానికి సోవియటు ప్రభుత్వం కంకణం కట్టుకుంది." వుత్పత్తి సాధనాలన్నీ ప్రజల పరం కావడంవల్ల ప్రజానీకానికి పని గ్యారంటీగా చూపించడానికి ప్రభుత్వానికి అవకాశం కల్గింది. ఈ సిద్ధాంతం మీద ఆధారపడే, సోవియటు ఆర్థిక వ్యవస్థను సంఘటితపరచి బలవత్తరం చేయడానికి గూడా ఆస్కారం చిక్కింది.

సోవియటు ప్రభుత్వం అమల్లోపెట్టే ఆర్థిక ప్రణాళిక ప్రకారం, వుత్పత్తి శక్తులను నిరాఘాటంగా అభివృద్ధిచేసి, ప్రజల జీవిత పరిమాణం ఉచ్ఛస్థాయికి తీసుకొనిపోబడుతుంది.

సోవియటు రష్యాలో ఉత్పత్తికీ, వినిమయానికీ మధ్య గండిపడడం అంటూవుండదు. ఈ రెండింటి అభివృద్ధికీ హద్దూ పరిమితి ఉండదు. రెండూ చేదోడు వాదోడుగా పురోగమిస్తూనే ఉంటాయి.

జాతీయాదాయం కష్టజీవులకు న్యాయంగా పంచబడుతుంది. ప్రజల ఆరోగ్య ఐశ్వర్యాలు క్రమంగా అభివృద్ధౌతు

న్నాయి. ప్రజల కొనుగోలుశక్తి అధికమౌతున్నది. ఈ కార ణాలన్నిటిచేతా, జాతీయోత్పత్తి క్రమేణా పెరిగిపోతున్నది.

సమగ్రంగా పరిశీలిస్తే, పైకారణా లన్నిటివల్లా సోవియట్ యూనియన్‌లో ఆర్థిక సంక్షోభాలనీ, నిరుద్యోగసమస్యలనీ మచ్చుకైనాలేవు. ప్రతివ్యక్తికీ చేతినిండా కావలసినంత పని చూపిస్తుంది ప్రభుత్వం. నిరుద్యోగసమస్య లేకపోవడమొక్కటేగాదు; జాతీయార్థిక ప్రణాళికను త్వరితగమనంతో పూర్తిచేయడాని కవసరమైన కార్మికయువకులను నిపుణులుగా తర్ఫీదు చేయడానికై ప్రతి సంవత్సరం ప్రభుత్వం పెద్దమొత్తాలను ఖర్చుపెడుతుందిగూడా.

జీతభత్యాలు చెల్లించబడే (శామికుల సంఖ్య నానాటికి పెరుగుతున్నది. 1950 ఆసాంతానికి, 1940 నాటికన్న 77లక్షల కార్మికులు యెక్కువగా పనిచేస్తున్నారు. 1951 నాటికి మరో 16 లక్షల కార్మికులు యెక్కువైనారు.

---

**81.—స్వార్జితాన్ని సోవియట్ ప్రభుత్వం ఎలా సంరక్షిస్తుంది?**

సోవియటు రాజ్యాంగ చట్టంలో 10వ నిబంధన యిలావుంది:

"సోవియటు ప్రజలు కష్టార్జితంతో సంపాదించుకున్న ధనంపైనా, వారి నివాస గృహాలమీద, గృహ సంబంధమైన యితర వినోదాల మీద, కుటుంబావసరాలకై వినియోగించే చిల్లర వస్తువుల మీదా, పెద్దలు సంపాదించి యిచ్చిన పె

జెప్పబడ్డరకపు ఆస్తులమీదా గల సంపూర్ణ హక్కును ప్రభుత్వం సంరక్షిస్తుంది.''

తమ ఆదాయాన్ని తమ అభీష్టానుసారంగా వినియోగించుకోడానికి సోవియటు పౌరునికి హక్కు వుంది. ఒక యిల్లు కట్టుకోడానికో, గ్రామీణ ప్రాంతంలో ఒక కుటీరం నిర్మించుకోడానికో, కారు కొనుక్కోడానికో, యింకే యితరమైన ఖర్చులు చేసుకోడానికైనా సోవియటు ప్రజలకు సంపూర్ణ హక్కువుంది. తాము చేసే ఖర్చంతా సంపాదనపైనా, ఆదాయం పైనా ఆధారపడి వుంటుంది. సోవియటు ప్రజల సంపాదనకుగల అవకాశా లెన్నటికీ పరిమితం కావు.

ఇల్లు కట్టుకోదలచిన సోవియటు పౌరుడికి ప్రభుత్వం వుచితంగా నివేశన స్థలం యిస్తుంది. కార్మికుడు పెట్టుకొన్న దరఖాస్తును ట్రేడ్ యూనియన్ సంఘం, ఫ్యాక్టరీ మేనేజిమెంటూ బలపరుస్తూ సిఫార్సు చేయాలి. అట్టి కార్మికునికి 5,000 నుండి 10,000 రూబుల్సు వరకూ ప్రభుత్వం అప్పిస్తుంది. ఈ అప్పును 5 నుండి 10 సంవత్సరాల్లో తిరిగి చెల్లించవచ్చు. ఈ రుణం మీద నూటికి సంవత్సరానికి 2 రూబుల్సు మాత్రమే వడ్డీ చెల్లించాలి. దీనికి తోడు గృహనిర్మాణ పరికరాలను, ఉచిత సాంకేతిక సలహాలను గూడా ప్రభుత్వం అందజేస్తుంది. కష్టించకుండా ఉటి) ఉపియంగా ధనం ఆర్జించే విధానంగానీ, తమ పూర్వులు యీ మార్గాల ద్వారా సంపాదించిన ఆస్తిని తామనుభవించడంగానీ సోవియటు చట్టం నిషేధించింది. స్పెక్యులేషన్, వడ్డీ వ్యాపారం మొదలైన అక్రమ మార్గాలు చట్టరీత్యా శిక్షార్హమైన నేరాలు.

పై పేర్కొన్న స్వామిత్వాన్ని, కాపీరైట్లను, పేటెంట్లను సోవియట్ పౌరుడు తన సంతానానికిగానీ, వారసులకుగానీ సంక్రమింప జేయవచ్చు.

---

## 32.—సోవియట్ వైవాహిక, కుటుంబనిబంధన లెలావుంటాయి ?

సోవియట్ కుటుంబంలో స్త్రీ పురుషు లిరువురకూ సంపూర్ణ సమానత్వం ఉంటుంది. యీ కుటుంబ నిర్మాణం, పరస్పర ఆదరణ, మిత్రత్వం ప్రేమాతిశయాలమీద ఆధారపడి ఉంటుంది. కుటుంబ నిర్మాణ సుస్థిరతను రక్షించడానికి సోవియట్ ప్రభుత్వం పూనుకుంటుంది. చట్టరీత్యా భార్యాభర్తల హక్కులను, విధులను రక్షిస్తుంది ప్రభుత్వం. తమ సంతానాన్ని పోషించి పెంచి పెద్దవాళ్లుగా తయారుచేసే బాధ్యత భార్యాభర్త లిరువురూ వహిస్తారు. సోవియట్ చట్టం, స్త్రీ హక్కుల నేమాత్రం కించపరచకుండా అనుభవించే అవకాశం కల్గిస్తుంది. వివాహానంతరం నిలవచేయబడ్డ ఆస్తి ఉభయ పక్షాలకూ సమాన ప్రతిపత్తిలో చెందివుంటుంది. ఒకరు అశక్తులైనప్పుడు వారిపోషణ బాధ్యత రెండవవారిది.

బాధ్యతారహిత ప్రవర్తనవల్ల కుటుంబజీవితానికి నష్టం కలిగించినా, గర్భస్రావం చేసుకోమని స్త్రీని బలవంతపెట్టినా, తమ పిల్లల్ని పోషించటంలో విఫలమైనా సోవియట్ చట్టసూత్రాలు శిక్ష విధిస్తాయి.

సోవియట్ యూనియన్‌లో వివాహం, స్థానిక శ్రమ జీవుల ప్రతినిధుల సోవియట్ యొక్క పౌర రిజిస్ట్రేషన్ సంస్థ ముందు రిజిష్టరు చేయబడుతుంది. ఉభయపక్షాల ప్యాస్‌పోర్టుల లోనూ వివాహం జరిగిన విషయాన్ని రికార్డు చేస్తారు.

కుటుంబజీవితాన్ని పటిష్టంచేసే ఉద్దేశ్యంతో, మాతా శిశువుల ప్రయోజనాల్ని పరిరక్షించే ఉద్దేశ్యంతో సోవియట్ న్యాయశాస్త్రం వివాహసంబంధాల్ని విడదీసుకోవటానికి లోతైన కారణాలున్న పరిస్థితుల్లోనూ, అదీ న్యాయస్థానం ద్వారా మాత్రమే అనుమతిస్తుంది. ఉభయపక్షాల కోరికమీద విడాకుల కార్యకలాపాలు రహస్యంగా జరపబడతాయి. న్యాయ స్థానం విడాకులను అంగీకరించటం సరేననుకుంటే, తీర్పులో తలి దండ్రుల్లో ఎవరుబిడ్డను పోషించాలో స్పష్టం చేస్తుంది. భార్యా భర్తలమధ్య ఆస్తిని పంపకం చేస్తుంది. వాళ్లు కావాలనుకుంటే వాళ్ళ వాళ్ళ స్వంతయింటి పేర్లను తిరిగిపెట్టుకునేందుకు అనుమ తిస్తుంది.

పూర్వపు వివాహాన్ని రద్దుచేసుకోకుండా పునర్వివాహం, ద్విభార్యత్వం, బహుభార్యత్వం చట్టరీత్యా నిషేధించబడ్డాయి.

---

**33.—బిడ్డలతల్లుల యెడల సోవియట్ ప్రభుత్వం యెట్టి శ్రద్ధాసక్తులు ప్రకటిస్తుంది?**

సోవియటు రష్యాలో బిడ్డల తల్లుల యెడల ప్రభుత్వం అమిత గౌరవ, శ్రద్ధాసక్తులు ప్రకటిస్తుంది. గర్భవతు

లైన మహిళలకు యెలాంటిపని యివ్వాలో, ఎంతపని ఇవ్వాలో గూడా నిర్ణయించే ప్రత్యేక చట్టాలను, నిబంధనలను సోవియటు ప్రభుత్వం రూపొందించింది. ప్రసవించడానికి పూర్వం 35 రోజులకు, తర్వాత 42 రోజులకు వీరికి పూర్తిజీతం మీద సెలవులియ్యబడతాయి. వారి ఆరోగ్య స్థితిగతులనుబట్టి అవసరమైతే, సెలవుపొడిగించబడుతుంది.

మాతాశిశుపోషణాలయాలు, పిల్లల జాడ్యాల నివారణకై సలహా సంప్రదింపులు జరిపే భవనాలు, బిడ్డల వినోద, క్రీడా కేంద్రాలు, గ్రామీణ, పట్టణ ప్రాంతాల్లో విరివిగా స్థాపించబడ్డాయి. ఈ కేంద్రాలన్నిటిలో చికిత్సలు, యితర క్రీడావినోదాలు ఉచితంగా జరిపించుకోవచ్చు. దేశమంతటా కలిసి 6000 మాతా శిశు పోషణాలయాలను, స్త్రీలు ప్రసవించే వందలకొలది వార్డులను ప్రభుత్వం యేర్పాటుచేసి జయప్రదంగా నడుపుతున్నది. సోవియటులో నూటికి 95 మంది స్త్రీలు యీ కేంద్రాల్లోనే ప్రసవిస్తారు. ఈ కేంద్రాల్లో అతి నిపుణులైన వైద్యులు, నర్సులు బాలింతలకు అత్యంత ప్రేమాదరాలతో చికిత్స చేస్తారు. చికిత్సకు, యితర సౌకర్యాలకు రాగి దమ్మిడీగూడా చెల్లించనవసరం లేదు.

ఈ మాతాశిశుపోషణాలయాల్లోను, ఆసుపత్రుల్లోనూ సాధ్యమైనంతవరకూ యేమాత్రం ప్రసవవేదన లేకుండానే స్త్రీలు బిడ్డలను కంటారు. గ్రామీణ, పట్టణ ప్రాంతాల్లో పురుట్లో చనిపోయే బిడ్డలసంఖ్య క్షీణించి క్రమంగా అదృశ్యమౌతున్నది. గర్భిణీలో వున్న స్త్రీల పేర్లు ముందుగానే రిజిష్టరు చేయబడి ప్రత్యేకభవనాల్లో వారిని నిపుణులైన డాక్టర్ల సంర

క్షణకింద ఉంచుతారు. తల్లులను, బిడ్డలను సంరక్షించే విష యంలో సోవియట్ అమలుపరచిన విధానం ప్రపంచంలో యెక్కడా సాటిలేనిదని సోవియట్ విధానాన్ని ప్రత్యక్షంగా పరిశీలించినవారందరూ అంగీకరించిన విషయమే.

బహుకుటుంబీకులైన తల్లులకు ప్రభుత్వం ఉచితవేతనా లిస్తుంది. మూడో సంతానాన్ని కన్న తల్లికి 200 రూబుల్స్, నాలుగో సంతానాన్ని కన్న తల్లికి 650 రూబుల్స్ యిదిగాక, ప్రతినెలా 40 రూబుల్స్ ప్రభుత్వం పారితోషికంగా యిస్తుంది. అయిదో బిడ్డను కన్నతల్లికి 850 రూబుల్స్, నెలసరికి 60 రూబుల్స్, ఆరవబిడ్డకు 1000, 70 రూబుల్స్, 7,8 బిడ్డలను కన్న స్త్రీలకు 1250–100 రూబుల్స్, తొమ్మిది, పది బిడ్డల తల్లులకు 1750–125 రూబుల్స్ యిస్తుంది. పదిమందినిగానీ, అంతకు యెక్కువగాగానీ కన్న బిడ్డలతల్లులకు ప్రతికాన్పుకూ 2500 రూబుల్స్ ఒకేమొత్తంగానూ, ప్రతినెలా వేతనంక్రింద 150 రూబుల్స్ యివ్వబడుతున్నాయి. యుద్ధానంతరం మొదటి అయిదేండ్లలో యీ విధమైన అలవెన్సులక్రింద సోవియట్ ప్రభుత్వం 1430 కోట్ల రూబుల్స్ ఖర్చుపెట్టింది.

భర్తలను కోల్పోయిన బిడ్డల తల్లులకు కూడా ప్రభుత్వం ఉచితంగా ధనం యిస్తుంది. బహు కుటుంబీకులైన తల్లులకు 1952 లో ప్రభుత్వం 450 కోట్ల రూబుల్స్ ఉచితంగా పంచి పెట్టింది.

పదిమంది గానీ, అంతకెక్కువమంది బిడ్డలను గానీ కన్న తల్లులకు ప్రభుత్వం "వీరమాత" లనే బిరుదిచ్చింది. ఈ బిరుదుతోపాటు ఒక బంగారు పతకం, సుప్రీం సోవియటు

అధిష్ఠానవర్గంచేత ఒక సర్టిఫికేట్లు బహూకరించబడతాయి. అయిదారు బిడ్డలను కన్న తల్లులకు మరో రకమైన పతకం బహూకరించబడుతుంది. ఏడు, యెనిమిది, తొమ్మిది మంది సంతానాన్ని గన్న తల్లులకు "ఆర్డర్ ఆఫ్ మదర్ హుడ్ గ్లోరీ" అనే బిరుదు, దానితోపాటు పతకాలు బహూకరించబడ బడతాయి. 1952 ప్రారంభం నాటికి, యిలాంటి బిరుదులు, పతకాలు 30 లక్షల స్త్రీలకు పైగా బహూకరించబడ్డాయి. సోవియట్ యూనియన్‌లో తల్లులయొక్క బిడ్డలయొక్క ఆరోగ్యాన్ని వున్నతస్థాయికి తీసుకుపోవడానికి నవీన శాస్త్రీయ పద్ధతులు, పరిశోధనల ద్వారా అభివృద్ధి చెందుతున్నాయి. ఈ శాఖలో పరిశోధనలు జరపడానికి 20 పైగా పరిశోధన కేంద్రాలు స్థాపించింది సోవియట్ ప్రభుత్వం.

---

**34.—సోవియట్ పరిశ్రమల్లో కార్మికులు యెట్టిసౌకర్యాలనుభవిస్తారు?**

సోషలిస్టు ప్రాతిపదికపై వుత్పత్తి జరిగే అన్ని పారిశ్రామిక సంస్థల్లోనూ కార్మికులు అధికోత్సాహంతో పనిచేస్తారు; వాతావరణమంతా అతి ప్రశాంతంగాను ఆరోగ్యకరంగానూ వుంటుంది. తమ ఆరోగ్యైశ్వర్యాభివృద్ధి కొరకే ప్రభుత్వం అత్యంత శ్రద్ధాసక్తులు చూపుతుందని కార్మికులైన స్త్రీ పురుషులు గ్రహిస్తారు.

సోవియట్‌లో పరిశ్రమలు ఒకటవ తరగతికి చెందిన వేలు రకం యంత్రాలను వుత్పత్తి చేస్తాయి. ఈ యంత్రాలు కార్మికుల కష్టాన్ని తగ్గించి అధికోత్పత్తికి దోహదమిచ్చేవిగా తయారౌతున్నాయి. సోవియట్ కార్మికులను నిరుద్యోగ రాక్షసి పీడించుకుతినే రోజులు యెన్నడో గతించాయి. యిక ముందెన్నడూ యీ బాధ వారికుండదు. నానాటికీ కష్టజీవులైన స్త్రీ పురుషు లందరి జీవితం మరింత సుభిక్షమౌతున్నది.

సోవియట్ రష్యాలో అమలు జరుగుతున్న సాంఘిక భీమా విధానం కార్మికుల, యితర కష్టజీవుల సుఖజీవనాని కెంతో దోహదకారౌతున్నది. ముసలితనానికీ, జాడ్యాలకూ, అశక్తతకుం గురైన కార్మికుల సుఖజీవనోపాధికై ప్రభుత్వమే తన స్వంత ఖర్చులతో భీమా విధానం కొనసాగిస్తుంది. ప్రతి కార్మికునికీ యేడాదికోసారి నిండు జీతం మీద శెలవు లివ్వబడతాయి.

కార్మికులపనిని నిర్ణయించే ప్రధానసమస్యలపై ప్రభుత్వం ఒక ప్రత్యేక కార్మిక నిబంధనావళిని రూపొందించింది. ఏ పరిస్థితుల్లోనూ రోజుకు 8 గంటలకన్న యెక్కువ పనిఉండదు. గనులలో పని కష్టతరం కావడంమూలాన, రోజుకు 6, 7 గంటలకన్న పని చేయరు. ఇంకా ప్రమాదకరమైన కార్యరంగాల్లో రోజుకు 4 గంటలే పని ఉంటుంది. అదనంగా పనిచేయడమనేది అత్యావసర పరిస్థితుల్లో మాత్రమే జరుగుతుంది. ఈపని చేయించడానికి ఆయా పరిశ్రమలకు చెందిన కార్మిక సంస్థలనుండి అనుమతి పొందాలి. అదనపుపని నిర్వహించడానికి మామూలు రేటుకన్నా దాదాపు రెట్టింపువరకుంటుంది.

చట్టరీత్యా పిల్లలచేత పనిచేయించడం నిషేధించబడ్డది. 16 యేండ్ల వయస్సులోపలి బాలురు గనుల్లో పనిచేయరాదు. పనిచేయడంలో తర్ఫీదుపొందే 14, 16 సంవత్సరాలుగల పిల్లలు 6 గంటలు మాత్రమే పనిచేయాలి. అయినా వీరికి రోజువేతనం పూర్తిగా ముడుతుంది. ప్రమాదకరమైన శాఖల్లో స్త్రీలు, యువకులు పనిచేయడం సోవియట్ చట్టం నిషేధించింది. గర్భిణీ స్త్రీలచేత, బిడ్డల తల్లులచేత అదనపు పని చేయించరాదు. అవసరమైనప్పుడు గర్భిణీస్త్రీల పని తేలికచేయడానికై, మామూలు జీతంమీదనే మరోశాఖలోకి మార్చవచ్చు. తమ బిడ్డలకు పాలిచ్చుకోడానికై తల్లులకు విశ్రాంతి కలిగిస్తుంది సోవియటు ప్రభుత్వం. ఈ విశ్రాంతి కాలానికి గూడా ఆమెకు వేతనా లివ్వబడతాయి.

ఆరోగ్యాన్ని దెబ్బతీసే రసాయనిక పరిశ్రమల్లోనూ, అచ్చుయంత్రాగారాల్లోనూ, ఇతర శాఖల్లోనూ పనిచేసే కార్మికులకు ప్రత్యేక ఆహారం, పాలు, వెన్న, మీగడ యివ్వబడతాయి. వీటికయ్యే ఖర్చంతా ప్రభుత్వమే భరిస్తుంది.

కార్మిక నిబంధనావళిని, చట్టాలను రూపొందించటంలో సోవియటు కార్మికులు ప్రముఖపాత్ర నిర్వహిస్తారు. కార్మిక సంస్థల అభిమతాలను, అభిప్రాయాలను వ్యక్తీకరించకుండా యే కార్మిక చట్టమూ సోవియటు యూనియన్‌లో అమల్లోకి రాదు. అధికభాగం, యీ చట్టాలు, సోవియట్ కేంద్రకార్మిక సమాఖ్యచేతనే శాసనసభలో ప్రవేశపెట్టబడుతాయి.

సోవియటు పారిశ్రామిక కట్టడాలన్నీ, కార్మికుల ఆరోగ్య వసతులను దృష్టిలోవుంచుకొని నిర్మించబడతాయి. ప్రమాదాల

నుండి తప్పించుకునే నవీన నైపుణ్యంతో యీ నిర్మాణమంతా కొనసాగుతుంది. ప్రతి ఫ్యాక్టరీలోకి, కర్మాగారంలోకి కావలసినంత గాలి, వెలుతురు పోకుతుంది. కార్మికుల ఆరోగ్యాన్ని రక్షించే అధునాతన యంత్రపరికరాలతోను, ఇతర సౌకర్యాలతోను యీ నిర్మాణమంతా కొనసాగుతుంది. 1946 నుండి 1950 వరకు సోవియటు ప్రభుత్వం యీ అధునాతన నిర్మాణాలకొరకు 450కోట్ల రూబుల్స్ ఖర్చుచేసింది. కార్మికసంఘాల చేతనియమించబడి, వాటి ఆదేశాలక్రింద పనిచేసే లేబర్ యిన్‌స్పెక్టర్లు, కార్మికచట్టాలు తు.చ. తప్పక అమలుజరిగేట్టు వేయికండ్లతో కనిపెట్టి ఉంటారు.

---

## 35.—సమిష్టి ఒడంబడికలంటే ఏమిటి ?

ఒక పారిశ్రామిక సంస్థకు చెందిన నిర్వాహకులు, ఆ సంస్థలో పనిచేసే కార్మికులు కలిసి చేసుకున్న ఒడంబడికనే 'సమిష్టి ఒడంబడిక' అని పిలవబడుతుంది. ఈ ఒడంబడికలో కొన్ని నిబంధనలు, కట్టుబాట్లు యేర్పడి, వాటిని అమలుజరపడానికి ఉభయ పక్షాలూ అంగీకరిస్తాయి. ఒక సంవత్సరం వరకు ఆ సంస్థలో పనిచేసే విధానం యెలా వుండాలో నిర్ణయించబడుతుంది. ఈ ఒడింబడికపైన సంస్థ నిర్వాహకులూ, స్థానిక కార్మిక సంఘం సంతకాలు చేస్తారు. సంతకాలు జరిగే ముందు యీ ఒడంబడికను కార్మికులు చర్చిస్తారు.

ఈ ఒడంబడిక ప్రకారం యెక్కువ నైపుణ్యం, పటిష్టత కలిగిన కొత్త యంత్రాలను యితర సాధనాలను మేనేజిమెంటు ప్రవేశపెట్టాలి. నూతన యంత్రాల ద్వారా కార్మికుల పని తేలికవడమేగాక ఉత్పత్తి గూడా అధికమౌతుంది; నైపుణ్యం గల కార్మికులను తర్ఫీదుచేయడం, కార్మికుల గృహనిర్మాణానికి సాయపడడం, కార్మికుల బిడ్డల సౌకర్యాలకు, క్రీడా, వినోద కేంద్రాలను నిర్మించడం మొదలైన కార్య భారమంతా పారిశ్రామిక సంస్థల నిర్వాహకులే వహించాలి.

ఇక పోతే, కార్మికుల ఉత్పత్తిస్థాయిని పెంచడానికి స్థానిక కార్మిక సంఘం కార్మికుల పక్షాన బాధ్యత వహిస్తుంది. ఈ సమిష్టి ఒడంబడికల ద్వారా కార్మికుల జీత భత్యాలు యెలా చెల్లించాలో, శాస్త్రీయ పద్ధతుల్లో పనినైపుణ్యాన్ని యెలా సాధించాలో గూడా నిర్ధారింపబడుతుంది.

---

**36.—సోవియట్ పరిశ్రమల్లో వేతనాలు యెన్ని విధాలుగా చెల్లించబడతాయి?**

సోవియట్ రష్యాలో యీ క్రింది శ్రేణులకు చెందిన పనులకు జీత భత్యాలు వివిధ రీతులుగా చెల్లించబడుతున్నాయి. 'టైమ్‌వర్క్', 'బోనస్‌తో కూడిన టైమ్ వర్క్', 'పీస్ రేటు', 'ప్రొగ్రెసివ్ పీస్ రేటు'.

సోవియటు పరిశ్రమల్లో ప్రధానంగా అమల్లోవున్నది 'పీస్ రేట్' విధానం. ఈ విధానం పని పరిమాణాన్ని, నైపు

ణ్యాన్నిబట్టి వేతనాలు చెల్లించాలనే సోవియటు సూత్రాని కనుగుణ్యంగా వుంటుంది. ఈ విధానం క్రిందనే అధిక సంఖ్యాకులైన కార్మికులకు వేతనాలు చెల్లించబడుతున్నాయి. ఉత్పత్తి విధానంలో, శ్రమశక్తి నిర్ణీతమైన సాంకేతిక పరిమాణంపై (technical standard) ఆధారపడి వినియోగించబడుతుంది. దీనిని ప్రాతిపదికగా తీసుకునే 'పీస్ రేట్లు' నిర్ణయించబడతాయి. ఈ పరిమాణాలు నిసలైన శాస్త్రీయపద్ధతిపై నిర్ణీతమౌతాయి. ఈ రేట్లను కార్మికులు, యింజనీర్లు, టెక్నీషియన్లు, కార్మిక సంఘ ప్రతినిధులు పాల్గొని చర్చించి ప్రకటిస్తారు.

ప్రతి పారిశ్రామిక శాఖకు ధరల నిర్ణయాలనీ, కూలి నిర్ణయాలనీ ఒక పట్టిక తయారౌతుంది. ఈ నిర్ణయాలను ప్రభుత్వం ఆమోదించాలి. వివిధ తరగతుల వస్తువులను తయారుచేయడానికవసరమయ్యే శక్తి, నైపుణ్యాలనుబట్టి వివిధ తరగతుల రేట్లు నిర్ణయమౌతాయి. శారీరక, మానసిక శక్తి, నైపుణ్యాలెక్కువగా వినియోగించ వలసిన పదార్థాల విలువ సహజంగా మిగతావాటికన్న యెక్కువగా ఉంటుంది. ప్రత్యేకంగా తయారైన ఒక్కొక్క వస్తువు ధర నిర్ణయించబడాలంటే, యీ పరిమాణాలమీద ఆధారపడి చేయాలి. ఈ వస్తువును వుత్పత్తిచేయడానికవసరమయ్యే శ్రమ, నైపుణ్యాలనుబట్టి కార్మికుడికి జీతం ముడుతుంది. ఇలాంటి విడి వస్తువులను తయారుచేసే కార్మికులు యెంతైనా సంపాదించుకోవచ్చు.

ఒక్కొక్కప్పుడు సోవియటు పరిశ్రమల్లో, బోనస్ — పీస్ రేట్లు సమ్మిళితమైన "ప్రొగ్రెసివ్ పీస్ రేటు" అనే విధానం మీదగూడా కార్మికులకు వేతనాలివ్వబడతాయి.

ఈ పద్ధతినిబట్టి, సాంకేతిక పరిమాణాన్నిగూడా మించి తన విశేష నైపుణ్యంచేత నిర్ణీతమైన కోటాకన్న అధికంగా ఉత్పత్తి చేసే కార్మికులకు అదనంగా జీతాలివ్వబడతాయి. ప్రధానమైన కొన్ని కొన్ని పరిశ్రమల్లోనూ, కార్మికుల్లో చొరవ, ఊహాశక్తి యెక్కువగా అవసరమయ్యే యితర పరిశ్రమల్లో మాత్రమే యీ విధానం అన్వయింపబడుతుంది. అధిక సంఖ్యాకులైన కార్మికులు యీ విధానాన్నే యెక్కువగా అభిలషిస్తారు. తన నైపుణ్యాన్ని అధికంచేసుకుని ఉత్పత్తి పెంపొందించడం మూలంగా అతని భౌతికజీవిత సౌఖ్యాన్నికూడా యినుమడింప జేసుకోగల్గుతున్నాడు కార్మికుడు.

ఇకపోతే, 'టైమ్‌వర్క్-విధానం' అనే మామూలు పద్ధతి ప్రకారం, కార్మికులకు తమ తమ పారిశ్రామిక సంస్థలచేత నిర్ణయింపబడ్డ మామూలు ప్రమాణాలనుబట్టి వేతనాలివ్వబడతాయి. 'పీస్‌వర్క్' విధానం అసంభవమై అనాచరణీయమైన పరిశ్రమల్లోనే 'టైమ్‌వర్క్' పద్ధతి అమలుపెట్టబడుతుంది. కొన్ని పరిశ్రమల్లో కార్మికుల ఉత్సాహశక్తిని, అధికోత్పత్తిని అభివృద్ధి చేయడానికై 'టైమ్‌వర్క్'తోపాటు బోనస్ విధానాన్నికూడా కలిపి అమలు జరుపబడుతుంది. ఈ విధానం వల్ల అధికోత్పత్తి ఒక్కటేగాక, వస్తువులనాణ్యం పెరగడంతోపాటు, యంత్రసామాగ్రిని, యితరపరికరాలను పొదుపుగా ఖర్చుపెట్టడంగూడా సంభవిస్తుంది.

పై పేర్కొన్న జీతభత్యాల విధానాలన్నీ సోవియటు రష్యాలోని కార్మికులందరికీ వర్తిస్తాయి. పురుషులతోపాటు సమానప్రమాణంతో పనిచేసే స్త్రీలకు, యువకులకుగూడా

సమానంగా వేతనాలివ్వబడతాయి. సోవియట్ కేంద్ర కార్మిక సమాఖ్య వివిధ ట్రేడ్‌యూనియన్ సంఘాలుకలిసి జీతభత్యాల రేట్లపరిమాణాలను నిర్ణయిస్తాయి.

---

## 37.—బోనసు ఎవరికి చెల్లించబడుతుంది?

దీర్ఘకాలంగా చిత్తశుద్ధితో కష్టించి పనిచేసే చైతన్యవంతుడైన ప్రతి కార్మికుడికీ సోవియట్ ప్రభుత్వం అన్నివిధాలా ప్రోత్సాహమిస్తుంది. ఇట్టి కార్మికులందరికి ప్రభుత్వం సంవత్సరానికిగానీ నెలకొకసారిగానీ బోనసు యిస్తుంది.

బొగ్గుగనుల్లో పనిచేసే ప్రతి కార్మికునికీ, ప్రతి గుమాస్తాకుగూడా బోనసుయివ్వబడుతుంది. ఏడాదికిపైగా పనిచేసిన కార్మికులకు, అతని సంవత్సరాదాయంలో నూటికి పదోవంతు బోనసు యివ్వబడుతుంది. మూడేండ్లనుంచి అయిదేండ్లవరకు పనిచేసిన కార్మికులకు నూటికి 15 వంతులు, అయిదేండ్లనుండి పదేండ్లవరకు పనిచేసినవారికి 20 వంతులు, 15 యేండ్ల పైబడ్డ సర్వీసుగలవారికి 30 వంతులు బోనసు యివ్వబడుతుంది. ప్రతి సంవత్సరం యీ బోనసు డిసెంబరులో చెల్లించబడుతుంది. 50 ఏండ్ల వయసొచ్చి, 20 సంవత్సరాలపాటు గనుల్లో పనిచేసిన కార్మికులకు వారి నెలజీతంలో సగంమొత్తం ప్రతినెలా పెన్షన్ రూపంలో చెల్లించబడుతుంది. కార్మికులు ఉద్యోగము నుండి విరమించుకున్నా లేకపోయినా, యీ పెన్షన్ వారికి ముడుతుంది.

ఈ బోనసులు యినుము, ఉక్కు, నూనె కర్మాగారా
ల్లోను, పరిశ్రమల్లోనూ పనిచేసే కార్మికులకుగూడా యివ్వబడు
తాయి; భూగర్భశాస్త్రవేత్తలు, వైమానికులు, సాంకేతిక,
వైజ్ఞానికశాస్త్రజ్ఞులు, ఉన్నతవిద్యాబోధకులు, ఉపాధ్యాయులు,
పోస్టల్, టెలిగ్రాఫ్ ఉద్యోగులు, యింకా అనేక యితర తరగ
తులకు చెందిన కార్మికులకుగూడా బోనసు యివ్వబడుతుంది.

అయితే, వివిధరంగాల్లో వివిధరీతులుగా యీ బోనసు
చెల్లించబడుతుంది.

---

**88.-సోవియట్ పౌరుడు తన జీతం కాక ప్రభుత్వంనుండి మరేయితర ప్రయోజనాలు పొందుతాడు?**

సోవియట్ కార్మికుడు తన శ్రమవల్లపొందే ప్రతిఫలమే
గాక, ప్రభుత్వంనుంచి రొఖ్ఖపూర్వకంగానూ, ఇతర
విధాలా అనేక ప్రయోజనాలను సాధిస్తున్నాడు. ఈ ప్రయోజ
నాలవల్ల అతనికుటుంబ ఆదాయం మూడింట ఒకవంతు పెరుగు
తున్నది. ఆదనంగా సంపాదించే ఆదాయం యీక్రింది విధంగా
వుంటుంది.

ప్రభుత్వ సాంఘిక భీమావిధానంనుండి పొందే అలవె
న్సులు, యితర ప్రయోజనాలు.

సోషల్ సెక్యూరిటీ లెజిస్లేషన్‌నుంచిసంక్రమించే పెన్షన్లు.

సెలవుల్లో యిచ్చేజీతాలు—ఈ జీతాలు అందరు కార్మి
కులకూ ముడతాయి.

ఆరోగ్యాన్ని కోలుకునే విశ్రాంతి కేంద్రాల్లో కార్మికులు పొందే వివిధసౌకర్యాలు. ఈ కేంద్రాల్లో సౌకర్యాలన్నీ ఉచితం గానో, లేదా అతి చౌకగానో లభిస్తాయి. ఈ విధంగానే పసి బిడ్డల వినోద, క్రీడా కేంద్రాల్లో లభ్యమయ్యే సౌకర్యాలు, బహుకుటుంబీకులైన బిడ్డలతల్లులు, భర్తలను కోల్పోయిన బిడ్డల తల్లులు పొందే సౌకర్యాలు, గ్రాంటులు.

బిడ్డలకు ఉచిత విద్యాసౌకర్యాలు, కార్మికులకు వివిధ రంగాల్లో యిచ్చే తర్ఫీదు.

సెకండరీ విద్యా సంస్థల్లోను, ఉన్నతవిద్యాలయాల్లోను విద్యార్థులకిచ్చే వేతనాలు.

ఉచిత వైద్యసౌకర్యాలు.

బోనసులు, యితరవసతి సౌకర్యాలు.

ఈ రూపాలద్వారా కార్మికులు సంపాదించే అదనపు ఆదాయం, వారి కుటుంబజీవిత పరిమాణాన్ని యెన్నోరెట్లు అధికం చేస్తున్నది.

1951 లో, ఉచిత వేతనాలు, అలవెన్సులు, బోనసుల ద్వారా కార్మికులకు ప్రభుత్వం చెల్లించిన మొత్తం 12500 కోట్ల రూబుల్సు. ఇదిగాక యెన్నోవందల కోట్లరూబుల్సు గృహ నిర్మాణంపైన ప్రభుత్వం ఖర్చుచేసింది. ఈ అదనపు సంపాదన మూలంగా కార్మికుల జీవితస్థాయి యెలాపెరిగిందో ఒక కార్మిక కుటుంబాన్ని వుదాహరణగా తీసుకుందాం:

ఒక మోటార్ పరిశ్రమలో ఫిట్టర్‌గా పనిచేసే 'ఫ్యొక్ కోవ్', అతని భార్య విశ్రాంతి తీసుకోగోరి ఆ ఫ్యాక్టరీకి చెందిన ఒక హాస్టల్లో బసచేశారు. వారి ఖర్చులకింద అమాంబాపతు

488 రూబుల్సు చెల్లించాల్సివచ్చింది. సాధారంగా యిద్దరు పెద్దవాండ్లకు వసతులు కుదిర్చినందుకు నెలకు 1800 రూబుల్సె ఖర్చవుతుంది. కాని వీరు చెల్లించినదిపోను మిగిలిన మొత్తం సోవియట్, ప్రభుత్వం సాంఘిక భీమా ఫండులోనుంచి తీసి చెల్లించింది. ఇక్కడ ఒక్కటే గమనించదగ్గ విశేషముంది. వీరు సెలవుల్లోవున్న రోజులకుగూడా పూర్తి జీతం వీరికి ముడుతుంది. సెలవుల్లో యిచ్చే జీతం వీరికి అడ్వాన్సుగా చెల్లించబడుతుంది. ఈ దంపతులకు చెల్లించబడ్డ మొత్తం వారి సగటు నెల సంపాదనంత ఉంటుంది.

హాస్టల్ సౌకర్యాలకై యీ దంపతులు చెల్లించిన ధనం సెలవరోజుల్లో వీరు సంపాదించే మొత్తంలో అతి స్వల్ప భాగం మాత్రమే. మిగిలిన డబ్బుతో వీరికి కావలసిన గుడ్డలు కుటుంబానికి కావలసిన యితర వస్తువులను పుష్కలంగా కొనుక్కోగలిగారు. ఈ మోటారు పరిశ్రమలో పనిచేసే 3500 మంది కార్మికులూ ప్రతియేటా యిలాంటి సౌకర్యాలు పొందుతున్నారు. ఈ దంపతులకు ముగ్గురు కుమార్తెలున్నారు. కడసారి బాలికకు అయిదేండ్లుంటాయి. ఈమె కిండర్ గార్టెన్ స్కూలుకుపోయి విద్య నభ్యసిస్తుంది. ఈమె కిండర్ గార్టెన్ స్కూల్లో చదివినన్నాళ్లు, విద్యా భోజన సౌకర్యాలకై ప్రభుత్వం యేటా 4000 రూబుల్సు వెచ్చిస్తుంది. ఈ స్కూల్లో విద్య నభ్యసించే పిల్లలను యేటేటా వసంతకాలంలో ప్రశాంతమైన చల్లని ప్రదేశాలకు వినోదార్థమై తీసుకొనిపోతారు. ఈ ప్రయాణాలకు, ఆహారం ఖర్చులకు వెచ్చించే డబ్బుకూడా యీ మొత్తంలోదే.

పదేండ్లుపైబడ్డ రెండో కుమార్తె సెకండరీస్కూల్లో విద్య నభ్యసిస్తుంది. ఈమె విద్యాసౌకర్యాలకై ప్రభుత్వాని యేటా 700 రూబుల్స్ ఖర్చుపెడుతుంది, పెద్ద కుమార్తె ఒక టెక్నికల్ సెకండరీస్కూల్లో విద్యాభ్యాసంచేస్తున్నది. ఈమెకు ప్రతిసంవత్సరం యిచ్చే 2000 రూబుల్స్ అలవెన్సుగాక విద్యాభ్యాసానికై ప్రభుత్వం యేటా 2000 రూబుల్సు ఖర్చుపెడుతుంది. ఈ కుటుంబానికి పైచెప్పిన సర్వసౌకర్యాలూ సమకూర్చడానికై ప్రభుత్వం దాదాపు 10,000 రూబుల్స్ ఖర్చుపెడుతుంది. అంటే యీ దంపతులు ఆర్జించే మొత్తం ఆదాయంలో మూడోవంతు యీ కుటుంబానికి అదనంగా ఖర్చుపెడుతుందన్నమాట. ఈ మొత్తంలో ఉచితవైద్య సౌకర్యాలు ఇతరప్రయోజనాలకై ప్రభుత్వంచేసేఖర్చు యిమిడిలేదు. ఇవిగాక ఆహారపదార్థాల ధరలు తగ్గించడం మూలంగా యీ కుటుంబానికెంతో ఆదాయం చేకూరుతుంది. సోవియట్ యూనియన్‌లో ప్రతి కుటుంబం, తమ ప్రత్యక్ష సంపాదనతో పాటు ప్రభుత్వంనుంచి పొందే యితర సౌకర్యాలకు యీ కుటుంబం ఒక చక్కని ఉదాహరణగా పరిగణించబడుతుంది.

---

## 39.—" సోషలిస్టు " పోటీ అంటే ఏమిటి ?

సోవియట్ జాతీయ ఆర్థిక ప్రణాళిక ప్రకారం, అధికోత్పత్తి కొరకు బ్రహ్మాండమైన ప్రజా ఉద్యమం సాగుతోంది. ఈ మహోద్యమంలో కార్మిక కర్షకులు, యితర

కష్టజీవులు తమకు కేటాయించబడ్డ ఉత్పత్తిగాక అధికోత్పత్తి సాధించినవారికి బహుమానాలిస్తుంది ప్రభుత్వం. సోషలిస్టు నిర్మాణం కొరకై అమలుపరచే యీ కమ్యూనిస్టు పద్ధతినే "సోషలిస్టు ఎమ్యులేషన్" (సోషలిస్టు పోటీ) అని స్టాలిన్ వివరించాడు. కోటానకోట్ల సోవియట్ ప్రజల శ్రామిక మేధాశక్తులను కూడగట్టి సంఘటితం చేస్తున్నది ప్రభుత్వం. 1951 లో ప్రతి పదిమంది కార్మికుల్లో తొమ్మిదిమంది యీ ఉత్పత్తి ఉద్యమంలో పాల్గొన్నారు. ఈ క్రింది పారిశ్రామిక ప్రాతిపదికపై యీ మహోద్యమం పురోగమిస్తున్నది.

కార్మికులు, సమిష్టి వ్యవసాయదార్లు, యింజనీర్లు, పారిశ్రామిక సంస్థలకుచెందిన టెక్నీషియన్లు, ఆఫీసు గుమాస్తాలు, మొదలైన శ్రామికులంతా తమ స్వంత చొరవమీదా, సృజనాత్మక శక్తిమీద ఆధారపడి, నిర్ణీతమైన గడువులోగా అతి నైపుణ్యమైన పదార్థాలను తమకు కేటాయించబడ్డ మొత్తాలకన్న అధికంగా ఉత్పత్తిచేస్తారు. ఈ ఉద్యమంలో పాల్గొన్న వ్యక్తులుగానీ, సమిష్టి వ్యవసాయ సంస్థలుగానీ, ఫ్యాక్టరీ కార్మికులుగానీ కలిసి, తాము ఉత్పత్తిచేయ నిర్ణయించుకున్న వస్తువుల జాబితాను తయారుచేసుకుని, కార్యభారాన్ని నిర్వహించేందుకై ఒకసమిష్టి ఒడంబడిక చేసుకుంటారు. ఈ ఉత్పత్తి ఉద్యమంలో నిమగ్నులైన శ్రామికులు, కార్మికసంఘం ప్రతినిధులు, మంత్రివర్గాలూ, వివిధ సంస్థలయొక్క కార్యనిర్వాహకులు కలిసి నిర్ణీతమైన కాలంలో సాధించబడ్డ ఉత్పత్తి ఫలితాలను సమీక్షించి విజయం సాధించిన వ్యక్తులను నిర్ధారణ చేస్తారు. ఈ వ్యక్తులకు వివిధ ప్రమాణాల ననుసరించి బహు

మతులు, పారితోషికాలు, బిరుదులు, సుప్రీం సోవియట్ చే ప్రసాదించబడతాయి. ఉత్పత్తిశక్తిలోనూ సాంకేతిక నైపుణ్యంలోనూ వెనకబడ్డ వారందరినీ సాధ్యమైనంతగా సమాన స్థాయికి తేవడానికి అగ్రశ్రేణిలో ఉన్న కార్మికులు విశేషకృషి చేస్తారు. ఈ కృషికి, యీ ఉద్యమానికీ ప్రధానమూలసిద్ధాంతం. కాపిటలిస్టు పోటీవిధానానికీ సోవియట్ అధికోత్పత్తిసూత్రానికీ గల తేడాను స్టాలిన్ యీవిధంగా వివరించాడు.

"వెనుకబడ్డ కార్మికులను వారిగతికివారినివదిలెయ్యకపోతే మీ ఆధిక్యతను మీరు సంఘటిత పరచుకోలేర "ని కాపిటలిస్టు విధానం చెబుతుంది.

"కొందరు శ్రామికులు వెనకబడి ఉంటారు ; కొందరు చురుకుగా పనిచేస్తారు; మరికొందరు యింకా చురుకుగా శ్రమించి ఉత్పత్తిచేస్తారు. కాబట్టి చురుకుగా పనిచేసే వారితో పాటు యితరులనుగూడాకలపాలి. ఈ విధానంవల్ల ఉత్సాహం, ఉత్తేజంపొందిన లక్షలాది సోవియట్ శ్రామికులు యీ మహోద్యమంలో చేరి ప్రపంచ ప్రజలు విస్మయపడేట్లుగా అత్యధికోత్పత్తి కొనసాగిస్తున్నారు. యుద్ధానికి పూర్వం, యుద్ధానంతరం జయప్రదంగా అమలు జరిపబడ్డ పంచవర్ష ప్రణాళికలకూ, జాతీయార్థికాభివృద్ధికీ, యీ "సోషలిస్టుపోటీ" ప్రత్యక్ష నిదర్శనం. సోవియట్ రష్యాలో వ్యక్తి ప్రయోజనాలకూ, సామాజిక సమిష్టి ప్రయోజనాలకూ పోటీ, సంఘర్షణ అనేవి తలెత్తడం అసంభవం. ఈ నాడు సోవియట్ ఆర్థిక జీవితంలో ఒకే ఒక సూత్రం సమస్త ప్రజానీకానికీ అన్వయింపబడుతు

న్నది: “ఎవరిశక్తికి తగినట్లు వారు కృషి చేయడం, తన కృషి ఫలితాన్ని అనుభవించడం.”

ఈ ఉత్పత్తి మహోద్యమ ఫలితంగా ప్రతి శ్రామికుడూ, తన మానసిక శారీరక శక్తులను సంఘటితపరచి అధికోత్పత్తిని సాధించడంద్వారా తన ఆదాయాన్ని అభివృద్ధిపరుచుకోగల్గుతున్నాడు. ఉత్పత్తి పరిమాణాన్నిబట్టీ, నైపుణ్యాన్నిబట్టీ సోవియట్ ప్రజల ఆదాయం ఆధారపడివుండటమే దీనికిగల ప్రధాన కారణం.

---

## 40.—'స్టాఖనొవైట్స్' అంటే ఎవరు ?

అధికోత్పత్తి ఉద్యమంలో పాల్గొన్నవారిలో అధునాతన సాంకేతిక నైపుణ్యాన్ని సముపార్జించి, నిర్ణీతమైన ఉత్పత్తిపరిమాణాన్ని అధిగమించి ఎంతో ముందుకు పురోగమించిన శ్రామికులను 'స్టాఖనోవైట్స్' అని పిలుస్తారు. వీరిలో అధికసంఖ్యాకులు యువకులు, నడివయస్సుగల స్త్రీ, పురుషులు. వీరంతా సాంకేతిక విజ్ఞాన శాస్త్రాన్ని పట్టువిడవకుండా దీక్షతో అభ్యసిస్తారు; తమ కార్యనిర్వహణాలో నిశ్చితత్వం, సునిసితత్వం, నైపుణ్యం ప్రకటిస్తూ, అనుక్షణం యితరులకు మార్గదర్శకులుగా వ్యవహరించే సాంస్కృతిక, సాంకేతిక విజ్ఞానధురంధరులు వీరంతా. సాంకేతికశాస్త్రం నుంచీ, యంత్రనిర్మాణం నుంచీ పిండగల సారాన్ని పిండి అత్యధికోత్పత్తి సాధించి సోవియట్ ప్రజల

మన్న నలందిన దీక్షాదక్షులు వీరంతా. తమ పరిశోధనల్లో, వెనక బడ్డ సాంకేతిక సిద్ధాంతాలను విసర్జించి, అధునాతన మార్గాలు కనిపెడుతున్నారు. అధునాతన యంత్ర పరికరాలకు అధునాతన సాంకేతిక సూత్రాలను అన్వయించి, ఉత్పత్తివిధానంలో రోజు రోజూ కొత్తమార్పులు ప్రవేశపెడుతున్నారు; కొత్త కొత్త సాంకేతిక ప్రమాణాలను సృష్టిస్తున్నారు. సాంకేతిక, విజ్ఞాన శాస్త్రాలకే కొత్త వెలుగుబాటలు నిర్మిస్తున్నారు.

'స్టాఖనొవైట్సు' అధికోత్పత్తిని యాదృచ్ఛికంగా సాగించడమంటూ ఉండదు. లక్షలాదిగా వీరుపాల్గొనే మహో ద్యమాన్ని నిర్మాణయుక్తంగా నడపడం వల్లనే యీ అధికో త్పత్తి సాధ్యమౌతున్నది. ఈ ఉద్యమానికి అంకురార్పణచేసింది, 1935 లో బొగ్గుగనుల్లో పనిచేసిన అలెక్సీ స్టాఖనోవ్ అనే కార్మికుడు. ఈతని పేరుమీదగానే యీ మహోద్యమం ఆనాటి నుండీ విజయవంతంగా పురోగమిస్తున్నది. ఆదర్శపురుషుడైన యీ కార్మికుడు తన సాధనంతో మామూలు పనిగంటల్లోనే 102 టన్నుల బొగ్గును ఉత్పత్తి చేయగల్గాడు. అప్పటికున్న ఉత్పత్తి ప్రమాణంకన్న యిది 14రెట్లు అధికమని అంచనా కట్ట బడింది. బొగ్గుగనుల్లోని యితర కార్మికులు వెంటనే స్టాఖనోవ్ మార్గం అనుసరించి అతన్నిమించి బొగ్గు ఉత్పత్తి చేశారు. ఇతర పరిశ్రమల్లోని కార్మికులు గూడా స్టాఖనోవ్ మార్గాన్నే అవలంబించి కృతకృత్యులైనారు. ఈ విధంగా 1930 నాటికి 'స్టాఖనోవ్' ఉద్యమం దేశవ్యాపితమైన మహో ద్యమంగా రూపొంది సంఘటితపడ్డది. ఈ ఉద్యమాభివృద్ధి

నాలుగు ముఖాలుగా ఉద్భవించి విజృభించింది. సోవియట్ శ్రమజీవుల భౌతిక జీవిత సౌఖ్యాభివృద్ధి నానాటికీ ఉచ్చస్థాయికి అందుకోనడం మొదటిది. సోవియట్ ప్రజలు, దోపిడీదారల కొరకుగాక, తమ సమిష్టి సుఖ ప్రయోజనాలకే వుత్పత్తి సాగి స్తారనే విషయం రెండవది; ఇందుకే తమ మాతృభూమికి తామే అధిపతులమనీ, తమ భవిష్యత్తుకు తామే కర్తలమనే గాఢభావం వారిలో నానాటికీ దృఢమౌతున్నది. సోషలిస్టు పారిశ్రామిక విధానంవల్ల కలిగే ఫలితాలను సోవియట్ జాతీయ ఆర్థిక విధానం యీ నాడు పూర్తిగా అనుభవించ గల్గుతోంది; ఈ విధానంఫలితంగా తామే స్వయంగా వుత్పత్తి చేసుకొన్న అధునాతన యంత్రి పరికరాల సహాయంచేత, సోవియట్ పారిశ్రామిక రంగమంతా యీ నాడు అధికోత్పత్తి కొనసాగిస్తున్నది. ఇది మూడో అంశం. సోవియట్ రష్యాలో యీ నాడు ఒకనూతన కార్మికశక్తి వుద్భవించి, అభివృద్ధయి అధునాతన సాంకేతిక పరిజ్ఞానాన్ని మరింతగా అభివృద్ధి గావిస్తు న్నారు. ఇది నాలుగో అంశం.

ఉత్పత్తి పరిమాణాన్ని బట్టి, నైపుణ్యాన్ని బట్టి సోవియట్ శ్రామికులు ప్రతిఫలం పొందుతారనే సూత్రాన్ని అనుసరించే స్టాఖనోవ్ ఉద్యమం గూడా దినదినాభివృద్ధి చెందుతున్నది. ఈ సిద్ధాంతంద్వారా శ్రామికుడు తన వ్యక్తిత్వాన్ని, నైపుణ్యాన్ని, చొరవను సమిష్టి జాతీయ కార్యక్రమానికి అన్వయించి, తన వ్యక్తి ప్రయోజనాలను గూడా సాధించుకోగల్గు తున్నాడు. ఈ మహోద్యమం యేటేటా విస్తృతమౌతున్నది.

ఈ ఉద్యమం సాధించిన ఘనవిజయాల్లో సోవియట్ ప్రజల నిర్మాణయుక్తమైన, శాంతిదాయకమైన, దేశభక్తియుతమైన ఆశయాలు ప్రతిబింబిస్తున్నాయి. వివిధ పరిశ్రమలకు చెంది, యీ మహోద్యమంలో పాల్గొన్న లక్షలాది శ్రామికులు, గడువులోగా నిర్ణీతమైన తమ కోటాలను మించి అధికోత్పత్తి సాగించడమేగాక, అతినైపుణ్యంగల్గిన వస్తువులకే వుత్పత్తి చేస్తున్నారు. ఈ ఆశయంతో తమ తమ కార్యభారాన్ని నిర్వహించే కార్మికులు, రైతులు, యితర శ్రమజీవులు "స్టాఖనో వైట్స్" అని పిలవబడతారు.

---

**41.—కల్పనాశక్తి ఎలప్రోత్సహించబడుతుంది? కాల్పనికుల హక్కులేవి?**

ఈనాడు ప్రపంచానికి ఉపయోగపడుతున్న పరికరాల్లో యెక్కువ భాగం (స్టీమ్‌యింజన్, ట్రాక్టర్, విమానం, వైర్లెస్, టెలివిజన్ ప్రాథమిక పరికరాలు మొదలైనవి) రష్యాలోనే కనిపెట్టబడ్డాయి. సోవియట్ ప్రజల కల్పనాశక్తి సోషలిస్టు విప్లవానంతరం త్వరితగతితో పురోగమించింది. ఈ కల్పనా శక్తికి ప్రభుత్వం ప్రోత్సహామిచ్చి సర్వసహాయం చేయడం సోవియట్ ప్రభుత్వ కర్తవ్యం. తన కల్పనాశక్తిచే నూతన యంత్రాన్ని కనిపెట్టిన వ్యక్తిని ప్రభుత్వం ఆదరించి, అతని హక్కులను చట్టరీత్యా సంరక్షిస్తుంది. వీరు కనిపెట్టిన యంత్రశక్తినిబట్టి, జాతీయార్థిక విధానంలో యీ యంత్రం

నిర్వహించే పాత్రనుబట్టి, బహుమతులుగానీ, పారితోషికాలుగానీ నిర్ణయించబడతాయి. నూతన యంత్రం మూలంగా యేడాదికి 10,000 రూబుల్స్ ఆదాయం దేశానికి కలిసివస్తే, యంత్రం కనిపెట్టిన వ్యక్తికి 1450 రూబుల్స్ బహుమతి యివ్వబడుతుంది. 50 వేల రూబుల్స్ ఆదాయానికి 5500 రూబుల్స్, లక్ష రూబుల్స్, ఆదాయానికి 8700 రూబుల్స్ బహుమతి యివ్వబడుతుంది. యంత్రం కనిపెట్టిన వ్యక్తికి – సర్టిఫికెట్ గానీ, పేటెంటుగానీ – తానేదికోరితే అది ప్రభుత్వం యిస్తుంది. సాధారణంగా విదేశీవారులే పేటెంట్లను కోరతారు. సోవియట్ యంత్రకాల్పనికుల్లో అత్యధికభాగం తమ హక్కులను ప్రభుత్వానికే సంక్రమింపజేస్తారు. కాల్పనికుల వ్యక్తి ప్రయోజనాలకు, సామాజిక ప్రయోజనాలకూ అవిభాజ్యమైన అవినాభావ సంబంధమైన ఏకత్వం ఉండడమే దీనికి కారణం.

ఇతరులు కనిపెట్టినవిషయాన్ని తామే కనిపెట్టినట్టు స్వంతదిగా ప్రకటించుకున్నా, ఆ వస్తువుయొక్క కాల్పనిక రహస్యాలను రిజిష్టరు కాకముందే బయటపెట్టినా, ఆ వ్యక్తి శిక్షార్హుడు; కోర్టునిర్ణయం ప్రకారం అతడు నష్టపరిహారం చెల్లించాల్సివుంటుంది. కనిపెట్టబడ్డ వస్తువులనుగానీ, యంత్రాలనుగానీ, పరీక్షించకుండా, దానిని అమలు జరపకుండా సాచివేతచేసే అధికార్లపై ప్రభుత్వం చర్యతీసుకుంటుంది. అవసరమైతే బర్తరఫ్‌చేసి విచారణకెక్కిస్తుందిగూడా.

సోవియట్ కాల్పనికులయెడల ప్రజాసంస్థలు అత్యంత శ్రద్ధాసక్తులు ప్రకటిస్తాయి. వివిధపారిశ్రామిక సంస్థలకుచెందిన

కార్మిక సంఘాలు, యీ కాల్పనికులతో సహకరించుటకై కమిటీలను నియమిస్తాయి. వీరికి సలహాలిచ్చేందుకై మంత్రివర్గాల్లోనూ, ట్రస్టుల్లోనూ, ఫ్యాక్టరీల్లోనూ, గనులపరిశ్రమల్లోనూ ప్రత్యేకంగా 'బ్యూరోలు' నిర్మించబడతాయి. వీరిని బహూకరించేందుకై లక్షలధనం ప్రతి సంస్థా నిలవచేస్తుంది. అగ్రగణ్యులైన కాల్పనికులకు వారి అసాధారణమైన మేధాశక్తికి తగినట్లుగా 'స్టాలిన్ బహుమతులి'వ్వ బడతాయి—(90-వ జవాబు చూడండి). అనేకమంది కాల్పనికులకు అమూల్యమైన బహుమానాలు, పతకాలు నివేదించబడ్డాయిగూడా.

---

**42.—పారిశ్రామికోత్పత్తికై కార్మికులకు తర్ఫీదెలా యివ్వబడుతుంది?**

నిరుద్యోగ సమస్యలేని సోవియట్ రష్యాలో దినదినప్రవర్ధమానమౌతున్న పారిశ్రామికరంగంలో, జాతీయార్థికాభివృద్ధి కొరకై కార్మికులకు తర్ఫీదివ్వబడుతుంది. 1940 లో 'స్టేట్ లేబర్ రిజర్వ్ స్కూల్స్' అనే సంస్థలు స్థాపించబడ్డాయి. ఈ సంస్థల్లో, ఇనుము, ఉక్కు, ఇంజనీరింగు, గనులు, నూనెపరిశ్రమలు, రైల్వేలు, నావికాపరిశ్రమ, నీటిరాకపోకలు, భవన నిర్మాణపరిశ్రమ, యితరశాఖలకు అవసరమైన కార్మికులకు తర్ఫీదివ్వబడుతుంది. విస్తృతమైన సాంకేతికపరిజ్ఞానం అవసరమైన కార్మికులకు ప్రత్యేక సంస్థల్లో రెండేండ్లు తర్ఫీదివ్వబడుతుంది.

స్వల్పపరిశ్రమలకు అవసరమైన తర్ఫీదుపరిమితి ఆరుమాసాల వరకే ఉంటుంది. సామాన్య విద్యాభ్యాసంపొందిన యువతీ యువకులను యీ స్కూళ్ళలో చేర్చుకుంటారు. వీరికయ్యే ఖర్చంతా ప్రభుత్వమే భరిస్తుంది. భోజనంనుంచి గృహవసతి, గుడ్డలు, పాఠ్యగ్రంథాలవరకు ప్రభుత్వమే అన్ని సౌకర్యాలు సమకూర్చుతుంది. ఈ స్కూళ్ళలో తర్ఫీదయ్యే యువతీయువకులు అధునాతనపరిజ్ఞానంతోను, నవచైతన్యంతోను ఫ్యాక్టరీల్లో,కర్మాగారాల్లో తమ యథోచిత స్థానాలాక్రమించి, అధికోత్పత్తి కార్యక్రమంలో చురుకుగా పాల్గొంటారు. ఈ స్కూళ్ళను స్థాపించినప్పటినుండీ 50 లక్షలకుపైగా కార్మికయువతీయువకులు తర్ఫీదుపొందారు.

ఈ స్కూళ్ళతోపాటు పారిశ్రామిక సంస్థలు గూడా కార్మిక యువకులకు తర్ఫీదిచ్చే సంస్థలను యేర్పాటు చేసింది. ఈ తరగతుల్లో వ్యష్టిగాగానీ, సమిష్టిగాగానీ తర్ఫీదివ్వబడుతుంది. ఈ సంస్థల్లోగూడా ఉన్నత శిక్షణ క్రమబద్ధంగా నేర్పబడుతుంది.

'స్టాఖనోవైట్ స్కూల్స్' అనే పేరుగల మరో తరగతి తర్ఫీదు సంస్థలు గూడా దేశమంతటా వెలిశాయి. స్టాఖనోవైట్ ఉద్యమ నాయకులు, వుత్పత్తి విధానంలో నూతన పద్ధతులను కనిపెట్టినవారు యీ సంస్థల్లో తర్ఫీదిస్తారు. ఈ సంస్థల్లో తర్ఫీదు పరిమితి అవసరాలను బట్టి తమ తమ స్థాయిలలో మారుతూ వుంటుంది. 1951 లో 70 లక్షలమంది కార్మికులు తమ పారిశ్రామిక సంస్థలకు చెందిన తరగతుల్లో తర్ఫీదు పొందారు.

---

### 43.— మేనేజిమెంటుకూ, కార్మికులకూ మధ్య తగాదాలు వస్తాయా? అవి ఎలా పరిష్కారమౌతాయి?

సోవియట్ విధానం ప్రకారం, కార్మికుడు, ఫ్యాక్టరీ మేనేజరు విభిన్న వర్గాలకు చెందిన వారు కారు. సోషలిస్టు ఆర్థిక వ్యవస్థలో వీరిద్దరూ సమాన హక్కులు గల కార్మికులే, కార్మిక తగాదాలను పరిష్కరించే విధానం చట్టరీత్యా వివరించబడ్డది. కార్మికుల యిబ్బందులను తొలగించే ప్రత్యేక కమిటీలవల్లగాని, 'పీపుల్స్ కోర్టుల' వల్లగానీ యీ తగాదాలు పరిష్కృతమౌతాయి. ఈ ప్రత్యేకకమిటీలు అన్నిపారిశ్రామిక స్థావరాల్లోనూ, ఆఫీసుల్లోనూ, సంస్థల్లోనూ స్థాపించబడి, ట్రేడ్ యూనియన్ సంస్థల ఆధ్వర్యాన వ్యవహరిస్తాయి. ఈ కమిటీల్లో మేనేజిమెంటుపక్షాన, కార్మికసంఘాలపక్షాన సమానసంఖ్యగల ప్రతినిధులు పాల్గొంటారు.

ఒక కార్మికుడుగానీ, యింజనీరుగానీ, టెక్నీషియన్ గానీ తన జీతానికి సంబంధించిన తగాయిదానో, బర్తరఫ్‌నుగురించిన విషయాన్నో, ట్రాన్స్‌ఫర్‌నుగురించో — యీ స్పెషల్ కమిటీకి ఫిర్యాదు జేసుకుంటాడు. ఈ ఫిర్యాదును విచారించి మూడు రోజుల్లో కమిటీ తన నిర్ణయాన్ని తెలియజేయాలి. ఈ విచారణలో కార్మికప్రతినిధులూ, మేనేజిమెంటుప్రతినిధులూ సమాన హక్కులను చలాయిస్తారు. ఇరుపక్షాలు అంగీకరించనినిర్ణయం అమలుజరగదు. ఈ నిర్ణయాన్ని తలక్రిందులుచేయాలంటే, ఉన్నత కార్మికసంస్థవల్లనే అది సాధ్యమౌతుంది. అయితే

క్రింది కమిటీచేసిన నిర్ణయం చట్టవిరుద్ధమైనప్పుడూ లేక, కేసులోని యదార్థవిషయాలకూ యీ నిర్ణయానికీ పరస్పరవిభిన్నత కలిగినప్పుడుమాత్రమే యిదిసాధ్యపడుతుంది. కమిటీ యిచ్చిన తీర్పు అక్రమమని కార్మికుడు అభిప్రాయపడ్డట్లైతే, తన ఫిర్యాదును 'పీపుల్స్‌కోర్టు' ముందు పెట్టవచ్చు. ఈ కార్యకలాపంలో ఫిర్యాది కోర్టుఫీజు చెల్లించనవసరంలేదు.

---

## 44.—సోవియట్ ట్రేడ్‌యూనియన్ సంస్థలు ఎలా వ్యవహరిస్తాయి?

సోవియట్ రష్యాలోకల్లా ట్రేడ్‌యూనియన్ సంస్థలు బ్రహ్మాండమైన కార్మిక ప్రజాసంస్థలు. ఈ సంస్థల్లో యావన్మంది కార్మికులు, యింజనీర్లు, టెక్నీషియన్లు, గుమాస్తాలు, వైజ్ఞానిక, సాంస్కృతిక వ్యాసంగాల్లో నిమగ్నులైన ప్రజలు సంఘటితమైనారు. ఈ సంస్థలు, శ్రమజీవుల జీవిత పరిమాణాన్ని అభివృద్ధిచేయడానికై సోవియటు ప్రభుత్వానికీ, కమ్యూనిస్టుపార్టీకి సర్వవిధాలా చురుకుగా సహకారాన్ని అందిస్తాయి. అధికోత్పత్తి సాధించడానికీ, కార్మికవర్గం యొక్క రాజకీయపరిజ్ఞానాన్ని పెంపొందించడానికీ యీ సంస్థలు సహాయపడతాయి.

ఈ కార్మికసంస్థలను లెనిన్ 'కమ్యూనిస్టు విద్యాలయాలని' నామకరణంచేశాడు. సోషలిస్టు నిర్మాణం కొరకు అసంఖ్యాకులైన కార్మికవర్గం యీ సంస్థల్లోనుంచి కార్యరంగంలోకి

దూకడమే దీనికిగల కారణం; ఈ కార్మికసంస్థలే కార్మిక ప్రజానీకం యొక్క రాజకీయచైతన్యాన్ని, దేశభక్తిపరాయణతను ఉగ్గుపాలతో పోసిపెంచాయి. శ్రమశక్తిని కమ్యూనిస్టు దృక్పథం ద్వారా పరిశీలించడానికి యీ కార్మికసంస్థలు కార్మిక ప్రజానీకంలో యెంతో చైతన్యం కలిగించాయి. దేశభక్తియుతమైన సోషలిస్టు పోటీవిధానాన్ని, స్టాఖనోవ్ ఉద్యమాన్ని గూడా యీ కార్మికసంస్థలే నిర్మించాయి. (39,40 జవాబులను చూడండి) కార్మిక చట్టాలను అమలుజరపడంలో కార్మికసంస్థలు అప్రమత్తతతో వ్యవహరిస్తాయి.

పరిశ్రమలకు, కార్మికులకు, జీవిత పరిణామాలకు, సంస్కృతికి సంబంధించిన శాసనాలను తయారుచేయడంలో ట్రేడ్‌యూనియన్లు తమ పాత్రను చురుకుగా నిర్వహిస్తాయి. కార్మిక సంరక్షణ చట్టాలను అమలుజరపడంలోనూ, ప్రభుత్వ సాంఘిక భీమాఫండులను నిర్వహించడంలోనూ, పారిశ్రామిక భద్రతను సాధించే నిబంధనలను అమల్లోపెట్టడంలోనూ, కార్మిక సంస్థలు అజమాయిషీచేస్తాయి. జీత, భత్యాలను నిర్ణయించడంలోనూ, ఉత్పత్తి, నైపుణ్యాశక్తులనుబట్టి ప్రతిఫలం ముట్టచెప్పే సిద్ధాంతాన్ని తు. చ. తప్పక అనుసరించడంలోనూ, కార్మిక సంస్థలు అతిచురుకుగాను, అప్రమత్తతతోను తమ కార్యభారాన్ని నిర్వహిస్తాయి. ఉత్పత్తిప్రమాణాలు సహేతుకమైనవి, న్యాయమైనవిగా ఉండేట్లు యెప్పటికప్పుడు యీ సంస్థలు తనిఖీ చేస్తాయి.

ఫ్యాక్టరీల్లో పనిచేసే స్థానిక కార్మికసంఘాలు సోషలిస్టు పోటీవిధానాన్ని ఆచరణలోపెట్టి, కార్మికుల ఉన్నత విజ్ఞానా

నికై సహకారంచేస్తాయి. అధ్యయన తరగతులు యేర్పాటు చేయడం, తర్ఫీదునిప్పించడం, స్టాఖనొవైట్ స్కూళ్ళను నిర్మిం చడం. అధికోత్పత్తికుపకరించే నూతనవిధానాలను, సాంకేతిక రహస్యాలను పరిశోధించి ప్రజల్లో వ్యాప్తిచేయడం గూడా స్థానిక కార్మిక సంఘాల కార్యక్రమమే.

కార్మికులకు ప్రాతినిధ్యంవహించే ట్రేడ్ యూనియన్ సంఘాలు మేనేజిమెంటుతో సమిష్టి ఒడంబడికలు చేసుకుం టాయి. కార్మికుల భౌతిక, సాంస్కృతిక అవసరాలను తీర్చడం, ఆరోగ్య విశ్రాంతి, వినోద కేంద్రాలను, సాంస్కృతిక వైజ్ఞానిక భవనాలను, క్లబ్బులను, గ్రంథాలయాలను, క్రీడా స్థలాలను నిర్మించి పోషించడం గూడా యీ సంఘాల బాధ్యతే. పారిశ్రా మిక సంస్థలకు చెందిన కార్మిక భవనాల్లో కార్మికులకు వసతి సౌకర్యాలను కేటాయించడం, అక్కడ వారికవసరమైన గృహ సాంస్కృతిక అభివృద్ధి కార్యక్రమాలు అమలుజరిగేట్టు చూడడం గూడా ట్రేడ్ యూనియన్ల కార్యక్రమభాగమే.

సోవియట్ ట్రేడ్‌యూనియన్లు పారిశ్రామిక పద్ధతుల మీద నిర్మించబడ్డాయి. ఒక సంస్థలోని సామాన్య కార్మికుని వద్దనుండి మేనేజరు వరకు గల మధ్య శ్రేణుల వారంతా ఒకే సంస్థలో చేరుతారు. ఈ విధంగా సంఘటితమైన యేకీకృత సంస్థగా యిది రూపొందుతుంది. పారిశ్రామిక సంస్థలోని అన్ని తరగతుల కార్మికులదృష్టి ప్రయోజనాలకు యీ సంస్థ ప్రాతి నిధ్యం వహిస్తుంది. వివిధ పారిశ్రామిక శాఖలకు చెందిన యిలాంటి ట్రేడ్‌యూనియన్ సంఘాలు సోవియట్ యూనియన్‌లో 66 పనిచేస్తున్నాయి.

కార్మికుడు పనిలో ప్రవేశించిన వెంటనే ట్రేడ్‌యూని యన్‌లో సభ్యుడుగా చేరే హక్కు అతనికుంటుంది. యూని యన్ నిబంధనావళి ప్రకారం, ప్రతి సభ్యుడికీ ఓటు చేసే హక్కు, యూనియన్‌లో అభ్యర్థిగా నిలిచే హక్కు వున్నది. స్థానిక సంఘాల, ఉన్నతసంఘాల సమావే శాల్లో గానీ, పత్రికలద్వారాగానీ, వాటి కార్యకలాపాలను విమర్శించే హక్కు ఫ్యాక్టరీ కార్మిక సంఘంలోని ప్రతి సభ్యు డికీ వుంది. తాము చేసే ఫిర్యాదులను తక్షణమే విచారించి ఉన్నత సంఘాలనుండి న్యాయంపొందే హక్కు ప్రతి కార్మికు డికీ వుంది.

సోవియట్ ట్రేడ్‌యూనియన్ సక్రమ కార్యకలాపా లన్నిటికీమూలాధారం ప్రజలనుభవించే విస్తృత ప్రజాస్వామిక హక్కులే. క్రిందనుండి కేంద్ర సోవియట్ కార్మికసమాఖ్య వరకూ, అందరు అభ్యర్థులూ రహస్య ఓటింగుద్వారా ఎన్ని కైనవారే. ప్రతి ఉన్నత కార్మిక సంస్థా నిర్ణీతకాలంనాటికి తన కార్యకలాపాలను వివరిస్తూ క్రింది సభ్యులకు నివేదిక అందివ్వాలి.

దేశం అంతటికీ, అఖిల సోవియట్ కార్మిక సమాఖ్య యొక్క సెంట్రల్ కౌన్సిల్, కేంద్రట్రేడ్ యూనియన్ సంస్థగా వ్యవహరిస్తుంది. ప్రతి ట్రేడ్‌యూనియన్ యొక్క కేంద్ర సంఘం, ఆయా ట్రేడ్ యూనియన్ మహాసభ సమావేశాల్లో ఎన్నుకోబడుతుంది.

---

### 45.—సోవియట్ పౌరులు తమకుగల విశ్రాంతి హక్కును ఎలా చలాయిస్తారు ?

సోవియట్ పౌరులందరికీ విశ్రాంతి అనుభవించేహక్కు రాజ్యాంగ చట్టరీత్యా సంక్రమించింది. సోవియట్ రష్యాలో ఏ పరిశ్రమలోగానీ వారానికి 48 గంటలకుమించి పని ఉండదు. వారానికి కనీసం ఒక సెలవురోజు అనుభవించడంతో పాటు, కార్మికులకు యేటేటా పూర్తిజీతాలతో సెలవులియ్య బడతాయి. ఈ సెలవురోజులు 15 నుంచి ఒక నెలవరకు ఉంటాయి. గనులకార్మికులకు, యినుము, ఉక్కు, బట్టలఫ్యాక్టరీల కార్మికులకు, రైల్వే, యితరపరిశ్రమల్లో పనిచేసే కార్మికులకు నెలరోజులు సెలవులిస్తారు. ఉపాధ్యాయులు, సైంటిఫిక్ పరిశ్రమల కార్మికులు రెండునెలలసెలవు అనుభవిస్తారు.

ప్రతిసంవత్సరం లక్షలాది కార్మికులు తమ సెలవుదినాలను ఆరోగ్య, విశ్రాంతి భవనాల్లో హాయిగా గడుపుతారు.

---

### 46.—సోవియట్ సాంఘిక భీమా విధానం ఎలా నడుపబడుతుంది ?

ఫ్యాక్టరీ, ఆఫీసు కార్మికులకు సంబంధించిన సాంఘిక భీమావిధానమంతా ప్రభుత్వఖర్చుతోనే నిర్వహించబడుతుంది .ఈభీమాఫండుకు కావలసిన ధనమంతా వివిధ పారిశ్రామికసంస్థలు చెల్లిస్తాయి. కార్మికుల మొత్తం జీతాలలో

భీమాఫండుకు చెల్లించేధనం నూటికి 7 వంతులుంటుంది. వ్యక్తిగతంగా కార్మికులు యీ ఫండుకు ధనం చెల్లించరు. సోషలిస్టు ఆర్థికవ్యవస్థ అభివృద్ధితోపాటు, ప్రభుత్వ సాంఘిక భీమాబడ్జెటు గూడా అభివృద్ధిచెందుతుంది.

ప్రథమ పంచవర్ష ప్రణాళికకాలంలో (1928-1932) సాంఘిక భీమాఫండు 1040 కోట్ల రూబుల్స్‌వరకు వసూలైంది; రెండవ పంచవర్ష ప్రణాళిక తరుణంలో (1933-1937) 3250 కోట్లవరకు పెరిగింది. యుద్ధానంతరం పంచవర్ష ప్రణాళిక సమయంలో (1946-1950) 8010 కోట్లవరకు వసూలైంది. ఒక్క 1951 సంవత్సరంలోనే, సోవియట్ సాంఘికభీమాఫండు 2100 కోట్ల రూబుల్స్‌కుపైగా వసూలైంది.

ఈ ఫండు నుండి కార్మికుల సంక్షేమకార్యక్రమాలకు అనేకరీతులుగా విరాళాలు పంచిపెట్టబడ్డాయి. తాత్కాలికంగా అశక్తులైన కార్మికులకు, ప్రసవించినస్త్రీలకు బహుకుటుంబీకులైన కార్మికులకు, విశ్రాంతిగృహాలకై కార్మికులువెచ్చించే స్వల్పమొత్తాలు, వినోదయాత్రలు, పర్వతారోహణయాత్రలకు, కార్మికులబిడ్డలను వసంతకాలవినోదకేంద్రాలకు శానిటోరియాలకు పంపడానికయ్యే ఖర్చులన్నీ భీమాఫండులో నుంచే చెల్లించబడతాయి.

ఖాయిలారోజుల్లో, ఖాయిలాపడ్డ మొదటిదినంనుండి తిరిగి పనిలో చేరమని డాక్టరు అనుమతిచ్చేవరకూ అతని ఖర్చులను ప్రభుత్వమే భీమానుండి చెల్లిస్తుంది. గర్భిణీస్త్రీలకయ్యే ఖర్చు ప్రభుత్వమే భరిస్తుందని యిదివరకే తెలుసుకున్నాం. ఒక కార్మిక స్త్రీగాని, పురుషుడుగానీ—తనకుటుంబంలో యెవ

రైనా ఖాయిలాపడ్డప్పుడు – ఆవ్యక్తి సంరక్షణకు ఆమెగానీ, ఆయనగానీ యింటివద్దనే ఉండవలసిన అవసరం యేర్పడితే, ఆ కార్మికునికీగూడా ఈఫండులోనుంచే డబ్బు చెల్లించబడుతుంది.

కార్మికు లీవిధంగా అనుభవించే వుచితవేతనాలు, వారి సర్వీసునుబట్టి వారి మొత్తం సంపాదనలో సగంనుండి, పూర్తి మొత్తంవరకు ఉంటాయి.

మూడు మాసాలకు తక్కువ కాకుండా పనిచేసిన స్త్రీలకే ప్రసూతి సెలవులు యితర సౌకర్యాలు పూర్తి జీతంమీద యివ్వబడతాయి. కానుపు కాగానే బిడ్డలను పెంచడానికీ, యితర సౌకర్యాలు కలిగించడానికీ మొత్తంగా స్పెషల్ అల వెన్సు చెల్లించబడుతుంది.

అశక్తతవల్ల కార్మికునికి ముట్టేడబ్బు, అతని అశక్తత యొక్క పరిమితినిబట్టి, మొత్తం అతడు సంపాదించే జీతంలో మూడోవంతునుండి మొత్తం జీతంవరకు గూడా వుంటుంది. ఆరోగ్య, వినోద కేంద్రాలకు వెళ్లే కార్మికుల ఖర్చుకు వుచితంగాగానీ నూటికి 50 నుండి 70 వంతులు తగ్గించిగానీ ఫండు నుండి చెల్లించబడుతుంది.

1950 లో క్రిమియా, కాకేసస్‌లోనూ, ప్రకృతిశోభతో రమణీయంగా వున్న యితర ప్రాంతాల్లోనూ 1200 ఆరోగ్య, విశ్రాంతి స్థావరాలు కార్మిక సంస్థలచేత నిర్మించబడి పోషించబడినాయి. ప్రభుత్వ ఆరోగ్యశాఖచేత, యితర ఆర్థికసంస్థల చేత యిలాంటి విశ్రాంతి స్థావరాలెన్నో స్థాపించబడి పోషించబడుతున్నాయి.

ఇవిగాక అవసరమైన సందర్భాల్లో కార్మికుల ప్రత్యేక భోజన ఖర్చులకొరకు, అసాధారణ పరిస్థితుల్లో కార్మికుల, యితర కష్టజీవుల ఆరోగ్యరక్షణకై వినియోగించవలసిన మొత్తాలు సాంఘిక భీమా ఫండులో నుంచే చెల్లించ బడుతాయి. ఈ భీమా ఫండంతా ట్రేడ్‌యూనియన్ సంస్థల ఆధీనంలోనే వుంటుంది.

---

**47.—వృద్ధాప్యం జీవితభృతికి ప్రభుత్వం భద్రత ఎలా చేకూరుస్తుంది?**

వృద్ధాప్యంలో సోవియట్ పౌరుల రక్షణ బాధ్యత ప్రభుత్వమేనిర్వహిస్తుంది. సోవియట్ రాజ్యాంగచట్టం ప్రకారం, 25 సంవత్సరాల సర్వీసు కల్గి 60యేండ్లు నిండిన ప్రతి పురుషునికీ ప్రభుత్వం జీవితాంతంవరకు పెన్షన్ యిస్తుంది. 20 సంవత్సరాల సర్వీసుగల్గి 55 యేండ్లు నిండిన స్త్రీలు గూడా పెన్షన్ అనుభవిస్తారు. గని కార్మికులు, ఇనుము, ఉక్కు-పరిశ్రమలకు చెందిన యితర తరగతుల కార్మికులు 50 యేండ్లునిండగానే పెన్షన్ పుచ్చుకుంటారు. వృద్ధాప్యంలో ఆరోగ్యవంతులైన వ్యక్తికిగూడా సోవియట్ ప్రభుత్వం పెన్షన్ యిస్తుంది. పెన్షన్ అనుభవించే సోవియట్ పౌరులు, తమ కిష్టముండి, చేరగల్గితే, తిరిగి పనిలో చేరవచ్చు. అలా తిరిగిచేరిన వారికి గూడా పూర్తిపెన్షన్ యివ్వబడుతూనే వుంటుంది. తమ నెలసరి సంపాదనలో నూటికి 50 నుండి 60 వంతుల వరకు సోవి

యట్ పౌరులు పెన్షన్ అనుభవిస్తారు. గనికార్మికులకు, ఇనుము, ఉక్కు ఫ్యాక్టరీ కార్మికులకు, భూగర్భశాస్త్రజ్ఞులకు, కొన్ని యితర పరిశ్రమల్లో పనిచేసే కార్మికులకు పెన్షన్లు పైవారికన్నా అధికంగా యివ్వబడతాయి.

సమిష్టి వ్యవసాయక్షేత్రాల్లో వృద్ధాప్యం వచ్చిన రైతుల సహాయార్థం, ప్రత్యేక ఫండంటూ యేర్పాటు చేయబడుతుంది.

---

**48.—సోవియట్ పౌరుల వ్యక్తి, మనస్స్వాతంత్ర్యం ఎలా పరిరక్షింపబడుతుంది?**

సోవియట్ పౌరులు తమఅంతస్సాక్షిగా, హృదయపూర్వకంగా నమ్మిన సిద్ధాంతాలను ఆచరించుకునే హక్కు సోవియట్ రాజ్యాంగం సంక్రమింపజేస్తుంది. తన ఇష్టం వచ్చిన మతాన్ని అవలంబించడానికిగానీ, అసలు మతాన్నే విసర్జించడానికిగానీ ప్రతి సోవియట్ పౌరుడుకీ హక్కు ఉంది. మతం కేవలం వ్యక్తిగతమైన స్వకీయవిషయంగా పరిగణించబడుతుంది.

సోవియటు యూనియన్‌లో చర్చి ప్రభుత్వంనుండి వేరు చేయబడ్డది. రాజకీయ వ్యవహారాల్లో చర్చిజోక్యం కల్గించుకునే హక్కులేదు. అలాగే చర్చి వ్యవహారాల్లోగూడా సోవియట్ ప్రభుత్వం జోక్యంకల్గించుకోదు. సోవియట్‌రష్యాలో ఏక్రైస్తవ మతసంస్థలకూ ప్రభుత్వం విరాళాలివ్వదు. ప్రభుత్వానికి అన్ని క్రైస్తవ చర్చిలూ ఒకటే. ఏ మతమూ ప్రభుత్వంవల్ల ప్రత్యేక

సౌకర్యాలంటూ పొందదు. అందరు మతావలంబకులను ప్రభుత్వం ఒకే రీతిగా ఆదరిస్తుంది. పాస్‌పోర్టులలోగానీ, వివాహ లైసెన్సుఫారాల్లోగానీ, జనన మరణ సర్టిఫికెట్లలో గానీ సోవియట్ పౌరులు తమ మతంపేరు ఉదహరించగూడదు. క్రైస్తవ మతసంస్థల ఆధీనంనుండి విద్యావిధానం పూర్తిగా తొలగించబడ్డది. విద్యాసంస్థల్లో మతసంబంధమైన పరిజ్ఞానం బోధించబడదు.

ప్రభుత్వంనుండి క్రైస్తవ మతసంస్థలు వేరుచేయబడ్డ వంటే, మతాధిపతులకు, మతావలంబకులకు పౌరహక్కులులేవని అర్థంకాదు. ఇతర పౌరులతోపాటు, వీరు కూడా ఓటింగు హక్కులు, తదితర హక్కులు సంపూర్ణంగా చలాయిస్తారని అర్థంచేసుకోవాలి. ఏ మతానికిచెందిన సోవియట్ పౌరులైనా, తమ తమ మతసమావేశాల్లో పాల్గొనడానికీ, ప్రార్థనలు జరుపుకోడానికీ, వారి సంస్థల కేంద్రసంఘాలను పటిష్టంగా బల పర్చుకోడానికీ సర్వస్వాతంత్ర్యం ఉన్నది. ఈ కేంద్రసంఘాలు ఏటేటా తమ మహాసభలు జరుపుకుంటూ ఉంటాయి; గ్రంథాలను, పత్రికలను ప్రచురించడం, మత సంబంధమైన స్కూళ్ళను స్థాపించుకొనడం వారి కార్యక్రమంలోని భాగం. క్రైస్తవ మతావలంబకులనుండీ, సంఘ సభ్యులనుండీ వసూలైన విరాళాలచేత మతసంస్థలు, చర్చిలు పోషించబడతాయి.

చర్చిలు, మసీదులు, మఠాలు మొదలయిన ప్రార్థనా మందిరాలను ఉచితంగా ఉపయోగించుకునే హక్కు సోవియట్ ప్రభుత్వం ప్రతి మతసంస్థకూ యిస్తుంది. అవసరమనుకుంటే వారి వారి ప్రార్థనామందిరాలను స్వంతంగా నిర్మించుకో

వచ్చు గూడా. వీటి కవసరమైన ఖాళీస్థలాలను ప్రభుత్వం ఉచితంగా మంజూరుచేస్తుంది. మతగ్రంథాలనూ, పత్రికలను ప్రకటించుకోడాని కవసరమైన అచ్చుపరికరాలనుగూడా ప్రభుత్వమే అందజేస్తుంది.

ప్రస్తుత కాలంలో సోవియట్ యూనియన్‌లో వివిధ శాఖలకుచెందిన క్రైస్తవసంస్థలు 8,ముస్లిం మతసంస్థ 1, బౌద్ధ మత సంస్థ 1, యూదుమతసంస్థ 1 ఉన్నాయి.

సోవియట్ మంత్రిమండలి ''రష్యన్ ఆర్థడాక్స్‌చర్చి'' వ్యవహారాల నిమిత్తం ఒక సంఘాన్ని, యితర మతాల వ్యవహారాల నిమిత్తం మరొక సంఘాన్ని నియమించింది. వివిధ మతసంస్థలు ప్రభుత్వంతో యెలాంటి సంబంధం పెట్టుకొని వ్యవహరించాలో సలహా యివ్వడానికీ, మతావలంబకుల కిచ్చిన హక్కు, స్వాతంత్ర్యాలు యెలా అమలు జరపబడుతున్నవో పరిశీలించుటకూ యీ రెండు సంఘాలూ నియమించబడ్డాయి; మత సంస్థలు అప్పుడప్పుడు లేవదీసే వివిధ సమస్యల మీద చట్టాలు, నిబంధనలు తయారు చేయడం గూడా యీ సంఘాల బాధ్యతే.

మతోన్మాదం తలకెక్కి విపరీత వ్యాఖ్యానాలద్వారా శాంతియుతంగా సాగేయితర మతాల మనుగడకు, సోవియట్ సమాజ భద్రతకు భంగంకలిగించే మతాలను, వ్యక్తులను సోవియట్ ప్రభుత్వం గుర్తించదు.

సోవియట్ ప్రభుత్వం మతవ్యతిరేకప్రచారం చేసుకునే వారి హక్కుగూడా గుర్తిస్తుంది. అయినా, యిట్టి ప్రచారం

సాగించేవారు దేవుణ్ణినమ్మేవారి మనోభావాలకు బాధకలిగించ కుండా ఉండేట్లు ప్రభుత్వం తగుజాగ్రత తీసుకుంటుంది.

---

## 49.—సోవియట్ రష్యాలో పిల్లలందరూ పాఠశాలలకు వెళ్లుతారా ?

ఔవును; పిల్లలంతా పాఠశాలలకు విధిగా వెళ్లుతారు. చట్ట రీత్యా ప్రతిబాలుడు, బాలిక యేడవయేటనుండి 14వ సంవత్స రం వచ్చేవరకు నిర్బంధంగా ఉచితవిద్యా సౌకర్యాలు పొందు తారు. ఈ ఏడేండ్లచదువు పూర్తికాగానే అధికసంఖ్యాకులైన సోవియట్ బాలబాలికలు సెకండరీ పాఠశాలలకు, ఇతరస్పెషల్ కోర్సులకు పంపబడతారు. ఈ స్పెషల్‌కోర్సుల్లో ఒక్కొక్క స్పెషల్ సబ్జక్టులో తర్ఫీదివ్వబడుతున్నతరుణంలోనే, మామూలు పదేండ్ల సెకండరీ విద్యాభ్యాసంగూడా పూర్తవుతుంది.

1950లో మామూలు విద్యావిధానంలోగానీ, స్పెషల్ సెకండరీ విద్యావిధానంలోగానీ తర్ఫీదైన బాలబాలికలసంఖ్య 3 కోట్ల 70 లక్షలు. 1951 లో దాదాపు యీసంఖ్య 4 కోట్ల వరకూ పెరిగింది. సోవియట్ రష్యాలో యేడుసంవత్సరాల ప్రాథమిక విద్యావిధానాన్ని జయప్రదంచేయడానికై, ప్రభుత్వం 2 లక్షల 20 వేల పాఠశాలలను నిర్మించి పోషిస్తున్నది. వారి వారి మాతృభాషల్లో విద్యాబోధన జరుపబడుతున్నది. వేల మైళ్ళదూరానగల మారుమూల కుగ్రామాల్లోనూ, మధ్యా సియా యెడారుల్లోనూ విద్యాలయాలు నెలకొల్పబడ్డాయి.

సోషలిస్టు విప్లవానికిపూర్వం రష్యనేతరజాతులు నివసించే ప్రాంతాల్లో యిలాంటి విద్యాలయాలు, వివిధజాతుల లిపులు మచ్చుకైనా లేవు.

బాలబాలికలకు కావలసిన పాఠ్యగ్రంథాలూ, యితర పరికరాలూ ప్రభుత్వమే తయారుచేయిస్తుంది. ఉపాధ్యాయుల సంఖ్య నానాటికి పెరుగుతూంది. 1950 లో ప్రైమరీ, సెకండరీ ఉపాధ్యాయులసంఖ్య 16 లక్షలుంది. 1949 నాటికన్న యీ ఉపాధ్యాయులసంఖ్య 80 వేలెక్కువ.

---

### 50.—సోవియట్ రష్యాలో ఉపాధ్యాయుని సాంఘిక, ఆర్థికస్థితి ఎలావుంటుంది?

సోవియట్ యూనియన్‌లో ఉపాధ్యాయవృత్తి అత్యంత గౌరవప్రదంగా పరిగణించబడుతుంది. ఇతర ఉన్నతపదవుల్లో వున్నవారితో సరిసమానంగా ఉపాధ్యాయులకు జీతాలు చెల్లించబడతాయి. సర్వీసునుబట్టి, మేధాశక్తినిబట్టి, జీతాల హెచ్చింపులు, ప్రమోషన్లు యివ్వబడతాయి.

గ్రామీణ ప్రాంతాల్లో ఉపాధ్యాయులకు గృహ నిర్మాణం ప్రభుత్వమే చేయిస్తుంది. దీనితోపాటు కొద్దిగా కొంచ్రడగూడా యిస్తుంది. సెలవుల్లో ఉపాధ్యాయులకు రెండు నెలల జీతం ప్రభుత్వం ఉచితంగాయిస్తుంది. నూటికి 70 వంతులు తక్కువ చార్జీలతో ఉపాధ్యాయులు ఆరోగ్య, విశ్రాంతి కేంద్రాల్లో హాయిగా కాలంగడపవచ్చు. నిష్కల్మషమైన దేశ

భక్తి, సేవాదీక్షతో దీర్ఘకాలం పనిచేసిన ఉపాధ్యాయులకు ప్రభుత్వంబహుమతులను, పతాకాలనుగూడా యిస్తుంది. సర్వీసు మరింతగా దీర్ఘమై, తన మేధాసంపత్తుద్వారా విద్యావ్యాప్తికి దోహదమిచ్చిన అధ్యాపకులను ప్రభుత్వం వుచిత రీతులతో గౌరవిస్తుంది. 30 సంవత్సరాల అనుభవం సంపాదించిన అధ్యాపకులకు ప్రభుత్వం "ఆర్డర్ ఆఫ్ లెనిన్" బిరుదు ప్రదానం చేస్తుంది. ఇలాంటి బిరుదులన్నీ సుప్రీం సోవియట్ అధ్వర్యం క్రిందనే నిర్ణయించబడతాయి. గ్రామీణ పట్టణ ప్రాంతాల్లో వేలమంది వుపాధ్యాయులు సోవియట్లకు ప్రతినిధులుగా యెన్నుకోబడ్డారు.

---

## 51.—ఉన్నత విద్యవల్ల ప్రయోజనాలు, అవకాశాలేమిటి?

**1951** లో సోవియట్ రష్యాలోని ఉన్నత విద్యాలయాల సంఖ్య 887. వీటిలో 112 విద్యాలయాలు రెండవ ప్రపంచ యుద్ధానంతరం స్థాపించినవే. ఇన్ని విద్యా సంస్థలుగల దేశం ప్రపంచంలో మరెక్కడా లేదీనాడు. 17—35 సంవత్సరాల మధ్య వయస్సు గల్గి, సెకండరీ విద్యావిధానం పూర్తి చేసుకుని 'ప్రవేశ పరీక్ష' లో వుత్తీర్ణుడైన ప్రతి పౌరుడూ వున్నత విద్యాలయాల్లో ప్రవేశార్హుడే. చదివినంతవరకూ క్షుణ్ణమైన పరిజ్ఞానం కల్గివుంటే చాలు యీ వున్నత విద్యాలయాల్లో ప్రవేశం సంపాదించడానికి. సోవియట్ యూనియన్‌లో

అన్ని శాఖలకు, తరగతులకు చెందిన ప్రజానీకం యొక్క బిడ్డలందరూ విద్య నభ్యసిస్తున్నారు.

దూరప్రాంతం నుండి వచ్చే విద్యార్థులకు హాస్టల్ సౌకర్యాలేర్పర్చబడతాయి. సత్ప్రవర్తన గలిగి తెలివితేటలు, మేధాశక్తిని ప్రదర్శించే విద్యార్థులను, విద్య పూర్తయ్యేవరకూ నెలవారీగా వుచిత అలవెన్సులీయబడతాయి. ఈ అలవెన్సులద్వారా విద్యార్థులు సుఖజీవనం చేయొచ్చు గూడా. శెలవుల్లో వినోద, విశ్రాంతి కేంద్రాల్లో విద్యార్థులకు వుచిత సౌకర్యా లివ్వబడతాయి.

యూనియన్ రిపబ్లికుల్లోనూ, స్వతంత్ర రిపబ్లికుల్లోనూ, యితర స్థానిక రిపబ్లికుల్లోనూ ఉన్నత విద్యాసంస్థలున్నాయి. ఈ విద్యాసంస్థల్లో విద్యనభ్యసించే వారిలో అన్ని జాతులకు చెందిన బాలబాలికలున్నారు. విప్లవానికి పూర్వం లిపి గూడా లేని జాతులకుచెందిన బాలబాలిక లీనాడు ఉన్నత విద్యనభ్యసిస్తున్నారు.

సోవియట్ ప్రభుత్వం అధికారంలోకి వచ్చాక, 30000 మంది యువతీ యువకులు ఒక్క 'మాస్కోలో మొనొసోవ్' విశ్వవిద్యాలయంలో పట్టభద్రులైనారు. ఈ మహాసంస్థలో 11 శాఖలున్నాయి. ఈ శాఖల్లో 9000 మంది విద్యార్థులు, 1300 మంది అధ్యాపకులు, ఉపాధ్యాయులు ఉన్నారు.

సోవియట్ యూనియన్‌లో 3500 స్పెషల్ సెకండరీ విద్యాలయాలున్నాయి. వీటిలో జూనియర్ అధ్యాపకులు యేటేటా తయారౌతారు. 1951 లో సోవియట్ ఉన్నత విద్యాలయాల్లోనూ, స్పెషల్ సెకండరీ విద్యాలయాల్లోనూ

కలిసి 27 లక్షల 40 వేలమంది విద్యార్థులు తర్ఫీదుపొందారు; 1946–1950 మధ్యకాలంలో 6 లక్షల 52 వేలమంది వున్నత విద్యనూ, 12 లక్షల 78 వేలమంది స్పెషల్ సెకండరీ విద్యనూ అభ్యసించారు. 1951 లో 4 లక్షల 63 వేలమంది విద్యార్థులు తమ ఉన్నత, స్పెషల్ సెకండరీ విద్యను జయప్రదంగా ముగించారు. మొత్తం మీద 1951 లో 50 లక్షలమంది తమ కోర్సులను పూర్తిచేసుకుని వివిధ రంగాల్లో పనిచేస్తున్నారు. వీరుగాక, మరో 50 లక్షలమంది యువకులు వారి వారి వృత్తుల్లో పనిచేసుకుంటూ విశ్రాంతికాలంలో ఉన్నత, స్పెషల్ సెకండరీ విద్యావిధానాన్ని జయప్రదంగా ముగించిన వారున్నారు.

విజ్ఞానశాస్త్రంలో యువకులకు తర్ఫీదిచ్చేందుకై, ఉన్నత విద్యాసంస్థలు, పరిశోధనాలయాలు సోవియట్ ప్రభుత్వం నిర్మించింది. ఈ సంస్థల్లో తర్ఫీదయ్యే యువకులకు ప్రభుత్వం అలవెన్సులు మంజూరుచేస్తుంది. 1951 లో విజ్ఞాన శాస్త్రంలో ప్రత్యేక తర్ఫీదుపొందిన పట్టభద్రుల సంఖ్య 24 వేలు.

---

## 52.—సోవియట్ పౌరులనుభవించే రాజకీయ హక్కులేవి ?

సోవియట్ పౌరునికి యెన్నుకునే హక్కు, ఏ సోవియట్ ప్రభుత్వశాఖకైనాసరే ప్రతినిధిగా యెన్నుకొనబడే

హక్కు కూడా ఉంటుంది. సోవియట్ రాజ్యాంగం ద్వారా ప్రజలకు వాక్సభా, పత్రికా, సమావేశ, స్వాతంత్ర్యం, ఉత్స వాలు, ప్రదర్శనలు జరుపుకునే స్వాతంత్ర్యం సిద్ధిస్తుంది. ఈ హక్కులను చలాయించడాని కవసరమైన భౌతిక, రాజకీయ సాధనసామాగ్రి యావత్తూ సోవియటు ప్రజలకు లభ్యమౌ తుంది. వివిధ సంస్థల్లో పనిచేసే శ్రమజీవులు తమ పత్రికలను, గ్రంథాలను. ప్రకటించుకొనడాని కవసరమైన అచ్చుయంత్రా లను, కాగితాలను, యితర పరికరాలను ప్రభుత్వం అంద జేస్తుంది. ఈ అవకాశాన్ని వినియోగించుకుని ప్రతి పౌరుడూ పత్రికాముఖంగా తన అభిప్రాయాలను వ్యక్తీకరించుకొని ప్రభుత్వోద్యోగులపైన అవసరమైన విమర్శలు చేయవచ్చు. ఈ విధంగా ప్రభుత్వం ప్రజలకు పత్రికా స్వాతంత్ర్యాన్ని కలుగ జేస్తుంది.

ప్రభుత్వభవనాలు, రాకపోకలసాధనాలు మొదలైనవన్నీ ప్రజలపరమైన జాతీయసంపదకాబట్టి, ప్రజలీసాధనాలను వినియో గించుకొని, తమ వాక్సభా, సమావేశ స్వాతంత్ర్యాలనుభవించు టకు సంపూర్ణావకాశాలున్నాయి. ట్రేడ్ యూనియన్లలో గానీ, సహకార సంస్థల్లోగానీ, యువజన సంఘాల్లోగానీ. సాంస్కృతిక, సాంకేతిక, వైజ్ఞానిక శాస్త్ర, వినోద, క్రీడాసంస్థల్లో గానీ చేరడానికి ప్రతి సోవియట్ పౌరునికీ హక్కు ఉంది.

అందరికన్న చురుకుగల్గి, ఉన్నత రాజకీయ చైతన్యంగల పౌరులు సోవియట్ కమ్యూనిస్టుపార్టీలో సభ్యులుగా చేరుతారు. (94 వ జవాబు చూడండి).

---

## 53.—సోవియట్ పౌరుల విధులెవ్వి ?

సోవియట్ రాజ్యాంగచట్టం, 130, 131, 132, 133 నిబంధనలప్రకారం, సోవియట్ పౌరులీక్రింది విధులను నిర్వర్తించాలని నిర్దేశించబడ్డది.

"ప్రతి సోవియట్ పౌరుడు సోవియట్ సోషలిస్టురాజ్యాంగానికి కట్టుబడి, చట్టాలను ఆచరణలో పెట్టాలి; సుసంఘటితమైన శ్రామికశిక్షణను సంరక్షించాలి; తనకు నిర్ణయించబడ్డ విధులను పాలించాలి. సోషలిస్టు నిర్మాణానికవసరమైన పరస్పర సహకారం, సహనం, ఆదరణ, ప్రేమాభిమానాలను విధిగా మన్నించాలి. (130 వ నిబంధన).

"సోవియట్ సామాజిక నిర్మాణానికి గుండెకాయ, పునాదివంటిదైన సోషలిస్టు సంపదను అతిపవిత్రమైన నిధినిక్షేపంగా కాపాడుకుంటూ మరింత దృఢతరంచేయాలి. ఈ నిధినిక్షేపాన్ని కంట్లోపాపగా కాపాడుకుంటూ పటిష్టం చేసుకుంటేగాని సోవియట్ రాజ్యం సకలసౌభాగ్యాలతో తులతూగలేదు; సోవియట్ ప్రజలు విజ్ఞానసంస్కృతులతో చిరకాలంవిలసిల్లజాలరు. అనుల్లంఘనీయమైన, పరమపవిత్రమైన సోషలిస్టు నిధినిక్షేపానికి ద్రోహంతలపెట్టినవ్యక్తులు సోవియట్ ప్రజానీకానికి శత్రువులుగా పరిగణించబడతారు" (131వ నిబంధన).

"సార్వజనిక సైనికశిక్షణ సోవియట్ చట్టంప్రకారం పొందాలి. సోవియట్ పౌరులు, సాయుధసైనిక దళాల్లోచేరి దేశసేవచేయడం అతిగౌరవనీయమైనదిగాభావిస్తారు"(132నిబంధన)

"సోవియట్ రష్యాను రక్షించడం ప్రతిపౌరుడు తన పవిత్రకర్తవ్యంగా పరిగణిస్తాడు. దేశద్రోహం తలపెట్టడం, దేశభక్తి ప్రమాణాన్ని ఉల్లంఘించడం, శత్రుపక్షంచేరడం, సైనిక పాటవాన్ని భగ్నంచేసేపనులు చేయడం, కుట్రలుసాగించడం—యివన్నీ అతినీచమైన, ఘోరమైన అపరాధాలుగా పరిగణించబడి, కఠినశిక్ష విధించబడుతుంది." (133వ నిబంధన)

---

## 54.—సోవియట్ ప్రజలు చెల్లించే పన్నులేవి?

శ్రామికులైన ఫ్యాక్టరీ కార్మికులుగానీ, గుమాస్తాలుగానీ, రచయితలుగానీ, కళావేత్తలుగానీ, చేతిపనివారుగానీ. స్వతంత్రించి జీవనంచేసే యే యితర పౌరులుగానీ, ఆదాయం పన్ను చెల్లించాలి.

నిర్ణీతమైన ఆదాయానికి తక్కువగా సంపాదించే కార్మికులూ, వుచితవేతనాలుపొందే విద్యార్థులూ, పెన్షన్లు అనుభవించేవారూ ఆదాయం పన్ను చెల్లించరు. కార్మికులీ క్రింది సంఖ్యా ప్రమాణాన్నిబట్టి ప్రతినెలా పన్ను చెల్లిస్తారు.

| నెలసరి ఆదాయం | పన్ను |
|---|---|
| 400 రూబుల్స్ | 18 రూబుల్స్ |
| 500 ,, | 26 ,, |
| 600 ,, | 36 ,, |
| 750 ,, | 52 ,, |

| | | | |
|---|---|---|---|
| 1000 | ,, | 82 | ,, |
| 1500 | ,, | 147 | ,, |
| (మొదలుగాగలవి) | | (మొదలుగాగలవి) | |

తమ సంపాదనమీాద ఆధారపడి జీవించే కుటుంబీకులు నలుగురుకన్న మించినప్పుడు, కార్మికుడు చెల్లించేపన్ను చాలా స్వల్పంగావుంటుంది. 1941 లో సంతానవిహీనులమీాదా, యిద్దరు బిడ్డలుకన్న తక్కువ కన్న తల్లిదండ్రులమీాదా పన్ను విధించబడ్డది. 20-50 సంవత్సరాల మధ్యవయస్సుగల పురుషులు, 20-45 సంవత్సరాల మధ్యవయస్సుగలస్త్రీలు, సంతానవిహీనులైతే, నూటికి 6 వంతులు, ఒక బిడ్డను కంటే నూటికి ఒకవంతు, యిద్దరుబిడ్డలనుకంటే ½ వంతు పన్ను చెల్లించాలి. ముగ్గురుకిపైబడి సంతానాన్ని కన్నవారు యీా పన్ను చెల్లించనవసరంలేదు.

సైనికులు, వారి భార్యలు, 25 సంవత్సరాల లోపు వయస్సుగల విద్యార్థులు, శరీరపాటవండుడిగిన వ్యక్తులు, గత మహాయుద్ధంలో కొడుకులు, కూతుళ్ళను పోగొట్టుకున్న సోవియట్ పౌరులు ఆదాయంపన్ను చెల్లించనవసరంలేదు.

---

### 55.—ప్రజలు చెల్లించే అద్దెలేవి ?

సోవియట్ రష్యాలో అధికభాగం నివేశనగృహాలు ప్రభుత్వపు ఆస్తి. చట్టంప్రకారం ప్రతి 11 చదరపు అడుగుల వైశాల్యంగలప్రదేశానికి సోవియట్పౌరుడు 1½ రూ

బుల్స్ అద్దె చెల్లించాలి. ఈ లెక్కలో వంటశాలలు, పాయి ఖానాలు, స్నానాలగదులు, హాలులు, నడవమార్గాలు చేరవు. ఈ అంచనాప్రకారం, 325-430 చదరపుఅడుగుల వైశాల్యం గల భవనానికి నెలకు 40-53 రూబుల్సుకన్నా యెక్కువ అద్దె ఉండదు.

కార్మికుల యొక్కగానీ, యితర వుద్యోగులయొక్క గానీ మొత్తం సంపాదనలో యిరవయ్యో వంతుకన్న యింటి అద్దె యెన్నడూ యెక్కువ వుండదు. ప్రభుత్వమే అద్దెలను నిర్ణ యిస్తుంది. మరెవ్వరికీ అద్దెలు పెంచే హక్కులేదు. అక్రమంగా అద్దెలు పెంచేవారిపై చట్టరీత్యా చర్యతీసుకోబడుతుంది.

---

## 56.—ప్రజలకు వైద్యసహాయం ఎలా చేయబడుతుంది?

ప్రజారోగ్య రక్షణ విషయమై సోవియట్ ప్రభుత్వం సంపూర్ణ బాధ్యత స్వీకరించింది. ప్రజానీకానికి కంద జేసే సమస్త వైద్య సహాయం వుచితమే.

పట్టణ గ్రామీణ ప్రాంతాల్లో నివసించే యే పౌరుడైనా, వైద్యసలహా, చికిత్సలు జిల్లాముఖ్యకేంద్రాల్లోని ఆసుపత్రుల్లో పొందవచ్చు. ఈ ఆసుపత్రుల్లో ఆధునిక వైద్యపరికరాలు, రోగనిర్ణయ సాధనాలు, యక్స్‌రే యంత్రాలు, పరిశోధనా లయాలు, విద్యుత్ చికిత్స కుపకరించే సాధన సామగ్రి, యితర సమస్త సౌకర్యాలు సమకూర్చబడతాయి. ఎక్కడెక్కడ

ప్రత్యేక వైద్యనిపుణులు అవసరమో, వారిని ప్రభుత్వం నియ మిస్తుంది. అత్యవసర పరిస్థితుల్లో, అతి ప్రమాదమైన రోగాలను నివారించడానికి ప్రత్యేక యేర్పాట్లు చేయబడ్డాయి. అవసర మైనప్పుడల్లా తక్షణం రోగియింట్లకే డాక్టర్లు వెళ్ళి సేవచేయ డానికి టెలిఫోన్ యేర్పాట్లున్నాయి.

ప్రతిజిల్లాలో అంటువ్యాధులను నివారించే నిపుణులుం టారు. ఆయాశాఖలకు వీరే ఆధిపత్యం వహించి తమ బాధ్య తను క్రమబద్ధంగా, జయప్రదంగా నిర్వహిస్తారు. టీకాలు, పొడి పిల్లు వేయడం, పారిశుధ్య సూత్రాలను ప్రజల్లో ప్రచారం చేయడం వీరిబాధ్యత. పెద్ద పెద్ద ఫ్యాక్టరీల్లోను, యితర సంస్థ ల్లోనూ, ఆ సంస్థల నిర్వాహకులే తమ పనివారల కుటుంబాల ఆరోగ్యరక్షణకై ఆసుపత్రిలను నిర్మించుకుంటారు. ఈ ఆసుప త్రిల నిర్వహణకయ్యే ఖర్చంతా సాంఘిక భీమాఫండు నుండి కేటాయించబడుతుంది.

ఈ నాడు సోవియట్ యూనియన్‌లో యెంతమంది ప్రజలకైనా సరే, చాలినన్ని ఆసుపత్రులు, ప్రత్యేక నిపుణులు, పరిశోధన శాలలూ వున్నాయి. ఈ ఆసుపత్రిల్లో డాక్టర్లనూ, కాంపౌండర్లనూ, నర్సులనూ యితర సిబ్బందినీ ప్రభుత్వం విరి విగా నియమిస్తుంది. 1940 నాటికన్నా, 1950 లో డాక్టర్ల సంఖ్య నూటికి 75 వంతుల రెట్లు యెక్కువైంది ఆస్పత్రుల నిర్వహణకై కోట్లధనాన్ని ప్రభుత్వం ఖర్చుపెడుతుంది. 1947 సం॥ బడ్జెటులో ఆస్పత్రుల నిర్వహణకై 1890 కోట్లురూబుల్స్, 1948 లో 2050 కోట్ల రూబుల్స్, 1949 లో 2160 కోట్లు, 1950 లో 2200 కోట్లు, 1951 లో 2190 కోట్లు, 1952 లో

2280 కోట్లు ప్రభుత్వం వెచ్చించింది. అత్యంత శ్రద్ధా సక్తులతో ప్రజారోగ్యాన్ని సంరక్షించడం మూలాన, సోవియట్ ప్రజలఆరోగ్యం వుచ్ఛస్థాయిలో వుందీనాడు. 1940 లో మరణ సంఖ్యతో పోల్చుకుంటే సోవియట్ ప్రజల మరణసంఖ్య యీనాడు సగానికి సగం తగ్గిందని రుజువైంది. బాల్య మరణాల సంఖ్య యింకా యెంతో దిగజారిపోయింది.

---

**57.—సోవియట్ రష్యాలోని బ్యాంకులేవి? తమ ఆదాయాన్ని ప్రజలెక్కడ భద్రంచేసుకుంటారు?**

సోవియట్ రష్యాలోని బ్యాంకులన్నీ ప్రభుత్వానికి చెందినవే; ప్రైవేటు బ్యాంకులంటూ లేవు. ఈ బ్యాంకులు, సోవియట్ ఆర్థిక సాంస్కృతిక జాతీయజీవితాన్ని అభివృద్ధిచేయడానికెంతో సహాయపడతాయి. జాతీయజీవితానికి సంబంధించిన ప్రతి సంస్థమీదా, ఆర్థిక విధానంమీదా, సోవియట్ ప్రభుత్వం యీ బ్యాంకులద్వారా ఆధిపత్యం వహించి అజమాయిషీ చేస్తుంది.

దేశంలోకల్లా పెద్ద బ్యాంకు 'సోవియట్ స్టేట్ బ్యాంకు' అన్ని ప్రభుత్వ సంస్థలు, సహకార సంఘాలు, ప్రజాసంస్థలు, ఫ్యాక్టరీలు, ఆఫీసులు, 'స్టేట్‌బ్యాంకు' లో ఖాతాలేర్పర్చుకుంటాయి. ఈ ఖాతాలద్వారా వారి పరస్పర లావాదేవీలను పరిష్కరించుకుంటూ ఉంటారు. ప్రభుత్వ బడ్జెటు ఆదాయాన్నీ-

లాభపు పన్ను, ఆదాయం పన్ను గూడా ఈ స్టేట్ బ్యాంకే తన అధీనంలో ఉంచుకొని కార్యకలాపాలు సాగిస్తూ ఉంటుంది.

వివిధ సంస్థలకు స్వల్పకాలపరిమితిపై యీ బ్యాంకు అప్పులు, పెట్టుబడులు పెడుతుంది; ధనసహాయంచేస్తుంది. ఈ ధనమంతా ప్రభుత్వ బడ్జెటులోనిదే. ఈ బ్యాంకు శాఖోప శాఖలన్నీ అన్ని యూనియన్ రిపబ్లికుల్లోనూ, స్వతంత్ర మండలాలల్లోనూ, పట్టణాల్లోనూ, జిల్లా కేంద్రాల్లోనూ విస్తరించి ఉన్నాయి. విదేశాలలో వ్యాపార, వాణిజ్యాలు నడపడాని కవసరమయ్యే ధనమంతా 'సోవియటు విదేశ వ్యాపార బ్యాంకు' అనే ప్రత్యేక సంస్థద్వారా లభ్యమౌతుంది.

ఇవికాక, సోవియటు రష్యాలో దీర్ఘకాలపు పరిమితుల మీద ధనసహాయంచేసే బ్యాంకులు నాలుగున్నాయి. 1. ఇండస్ట్రియల్ బ్యాంకు, 2. ట్రేడ్ బ్యాంకు, 3. కేంద్ర వ్యవసాయ బ్యాంకు, 4. మునిసిపల్, గృహనిర్మాణ కేంద్రబ్యాంకు. ఈ బ్యాంకులు, గృహ, యంత్రనిర్మాణాని కవసరమైన ధనసహాయం చేయడంతోపాటు, జాతీయార్థిక విధానానికి సంబంధించిన వివిధ శాఖల్లో తయారయ్యే వస్తుసంపదను యెప్పటికప్పుడు విడుదల చేయడానికికూడా పూనుకుంటాయి.

ప్రజలు, ఆదాచేసుకున్న ధనాన్ని స్టేట్ సేవింగ్స బ్యాంకులో దాచుకుంటారు. ఈ బ్యాంకులు అన్ని పట్టణాల్లోను, పెద్ద గ్రామాల్లోనూ ఉన్నాయి. పోస్టాఫీసుల్లో గూడా వీటిశాఖలు పనిచేస్తుంటాయి. ప్రతిసంవత్సరం యీ బ్యాంకులో డబ్బు దాచుకునే ప్రజల సంఖ్య లక్షలకొద్దీ పెరుగుతున్నది. ప్రజలనుభవిస్తున్న సుఖజీవనానికిది ప్రబలతార్కాణం. 1950లో

పోల్చుకుంటే, అప్పటికన్నా 1951 లో యీ విధంగా ప్రజలు దాచుకున్న డబ్బు మొత్తం 400 కోట్లకు మించింది. డబ్బు దాచుకొన్న ప్రజల సంఖ్యకూడా 1950 కన్నా 3 లక్షలు పెరిగింది.

---

### 58.—దేశీయఋణాలు సోవియట్ జీవితంలో ఎట్టిపాత్ర నిర్వహిస్తాయి?

దేశీయప్రభుత్వ ఋణాలు సోవియట్ ప్రజల ధనసంపదను సమీకరించి సోషలిస్టు నిర్మాణాన్ని త్వరితగతితో అభివృద్ధిచేయడానికి సహాయపడుతున్నాయి. యుద్ధానికిపూర్వం అమలుజరిపిన పంచవర్ష ప్రణాళికల తరుణంలో ప్రభుత్వం ప్రజలనుండి 5000 కోట్ల రూబుల్సు రుణంచేసింది. ఈ ధనమంతా విద్యాసంస్థల, ఆసుపత్రుల, నాటకశాలల, బాలురక్రీడా, వినోదశాలల నిర్మాణంకొరకు వినియోగించబడ్డది.

గతమహాయుద్ధంలో సోవియట్ ప్రజలు తమ ఆదాయంలోనుండి ప్రభుత్వానికి 7600 కోట్ల రూబుల్సు ఋణమిచ్చారు. సోవియట్ ఆర్థిక, సైనిక పాటవాన్ని బలవత్తరంచేయడానికి యీ ఋణం యెంతో ఉపకరించింది. యుద్ధానంతరం ప్రభుత్వం సేకరించిన ఋణాలమొత్తం 13,000 కోట్లరూబుల్సు దాటింది. ఈ ఋణాలన్నీ ప్రజలు ఐచ్ఛికంగా ఆనందంతో యిస్తారు. సోవియట్ప్రజలనుండి ప్రభుత్వం ఋణాలు సేకరిం

చడం, ప్రజలెంతో ఉత్సాహంతో యివ్వడం మామూలైంది. ఇట్టి ఋణాలనే సిసలైన ప్రజాదరణగల ఋణాలని చెప్పాలి.

ఈ ఋణాలద్వారా సోవియట్ ప్రజలకు అదనపు ఆదాయంలభిస్తుంది. యుద్ధానంతర పంచవర్ష ప్రణాళిక కాలంలో సోవియట్ ప్రభుత్వం ప్రజలకు 1700 కోట్ల రూబుల్స్ వరకూ ఇట్టి అదనపుఆదాయాన్ని, వడ్డీనిచెల్లించింది. 1952 లోగూడా 890 కోట్లవరకూ చెల్లించింది.

**59.—సోవియట్ రష్యాలో సహకారసంస్థలేవి ? అవి ఎలాపనిచేస్తాయి ?**

సోవియట్ యూనియన్‌లో మూడుతరగతుల సహకార సంస్థలున్నాయి. (1) వినిమయదారులు, (2) ఉత్పత్తిదారులు, (3) అశక్తులు. వినిమయదార్ల సహకారసంఘాలన్నీ బ్రహ్మాండమైన వ్యాపారసంస్థలు. ఈ సంస్థలసభ్యత్వం 3 కోట్ల 20 లక్షలవరకూ వుంటుంది. వీరిచే యెన్నుకోబడ్డ మేనేజిమెంటుబోర్డులు యీ సహకార సంఘాలను నడుపుతాయి. ప్రతి యూనియన్ రిపబ్లికులోనూ, ప్రతి స్వతంత్రి రిపబ్లికులోనూ యీ వినిమయ సహకార సంఘాలు నిర్మింపబడ్డాయి. వివిధ సహకార సంఘాల ప్రతినిధుల మహాసభ ఒక కేంద్ర సంఘాన్ని యెన్నుకొంటుంది; వీటితోపాటుగా డైరెక్టర్లబోర్డును, ఆడిట్‌సంఘాన్నిగూడా యెన్నుకుంటుంది. ఈ సంఘాలు నాలుగేండ్లవరకు సహకార పరిపాలనాకార్యక్రమాన్ని కొనసాగిస్తాయి. దేశంలో ఉత్పత్తయిన పారిశ్రామిక

సరుకులను చిల్లరఅమ్మకంకొరకై ప్రభుత్వం ఉత్పత్తి వినిమయ సహకారసంస్థలకు సప్లయిచేస్తుంది. ఇవిగాక సహకారసంస్థలు స్వంత ఉపయోగంకొరకు రకరకాల పదార్థాలుకొంటాయి. చిన్నచిన్న పరిశ్రమలను నెలకొల్పి, వ్యవసాయానికి కావలసిన ముడిపదార్థాలను, ఆహారపదార్థాలనుగూడా యీ సహకార సంస్థలు తయారుచేస్తాయి. వినిమయ సహకారసంస్థలు దేశ వ్యాపితంగా అనేక వ్యాపారసంఘాలను స్థాపించాయి. గ్రామీణ ప్రాంతాల్లో 24000 కు పైగా యిట్టి సంఘాలున్నాయి. 2 లక్షల 40 వేల చిల్లరదుకాణాలు, అంగళ్లు, కాన్‌టీన్లు, టీ షాపులుగూడా యేర్పాటు చేయబడ్డాయి. ఈ కేంద్ర సహకారసంస్థ అంతర్జాతీయ సహకార సమాఖ్యకు అనుబంధించబడ్డది. దీనికి అనుబంధించబడ్డ సంఘాలలో సోవియటు కేంద్రి సహకార సంస్థే అన్నిటికన్నా పెద్దది.

సోవియటు పారిశ్రామిక సహకారసంస్థ కుటుంబవస్తువులను తయారుచేసే చేతిపనివారలను తనలోఐక్యంచేసుకుని సంఘటితపరుస్తుంది. వీటి ఆధ్వర్యానగూడా చిన్నచిన్న పరిశ్రిమలు నడుపబడుతున్నాయి. ప్రిభుత్వంతరఫునేగాక, తమ స్వంతవస్తువులనుగూడా అమ్ముకోడానికి వీటికిహక్కున్నది.

శారీరపాటవం వుడిగినవ్యక్తులకు ప్రిత్యేకంగా ఏర్పాటైన సహకారసంస్థల్లో, యుద్ధంలో వికలాంగులై పూర్వపు పనీపాటలు చెయ్యలేని అసమర్థులైన పౌరులందర్నీ సంఘటితపరుస్తారు. వీటికి ప్రిత్యేకంగా విద్యాలయాలు, కార్ఖానాలు నిర్మించబడ్డాయి; ఈశాఖల్లోపనినేర్చుకుంటూ చదువుకునే పౌరులకు ఉచితవేతనాలివ్వబడతాయి. తమ తర్ఫీదుపూర్తికావడంతోటే,

సహకారసంస్థలచేనపడబడే వర్క్‌షాపుల్లోనైనా చేరవచ్చు; లేదా చేతిపనివారల సంఘాల్లోచేరి తమయింట్లవద్దనే కష్టించి పనిచేసి సంపాదించుకోవచ్చు. తమ పనికితగినట్లు వేతనాలూ, వచ్చేలాభంలో భాగం వీరికి పంచిపెట్టబడతాయి. ఈసంపాదన వల్ల తమకొచ్చే పెన్షన్లు ఏవిధంగానూ తగ్గించబడవు. ప్రభుత్వం సహకార సంస్థలకు సంపూర్ణసహాయం అందజేస్తుంది.

---

## 60.—సోవియట్‌లో ఆంతరంగిక దేశీయ వ్యాపారం ఎలా నడుస్తుంది?

వ్యాపారులూ, స్పెక్యులేటర్లు లేకుండానే సోవియటు వ్యాపారం విజయవంతంగా పురోగమిస్తున్నది. ప్రభుత్వంచేతా, సహకారసంఘాలచేత యీ వ్యాపారం నడపబడుతున్నది. ఈ సంఘాలు దేశవ్యాపితంగా దుకాణాలను, హోటళ్ళను ఏర్పాటుచేసి, ఉత్పత్తయిన పదార్థాలను సరఫరా చేస్తున్నాయి.

ఉత్పత్తయిన సరుకులు ప్రభుత్వం నిర్ణయించిన ధరలకు యీ సహకార సంఘాలకు అందజేయబడతాయి. టోకుధరలు, చిల్లరధరలుగూడా ప్రభుత్వమే నిర్ణయిస్తుంది. ఈ కారణంచేత సోవియటు వ్యాపారవ్యవహారాల్లో ధరలు చిత్తంవచ్చినట్లు పెంచడానికివీల్లేదు. సోవియటుప్రజల సంక్షేమానికై ప్రభుత్వం శ్రద్ధవహిస్తుందనడానికి ఒకే ప్రబలమైన తార్కాణం వుంది.

ఆయేటికాయేడు అంగళ్ళలో అమ్మకాలమొత్తం విపరీతంగా పెరిగిపోతున్నది. 1928–40 మధ్యభాగంలో ప్రభుత్వ, సహకారసంఘాల ఆధ్వర్యంక్రింద నడుస్తున్నషాపుల్లో అంతకు ముందున్న అమ్మకంకన్న 11 రెట్లు అధికమైంది. 1950నాటికి ఆహారపదార్థాలు, యితరవస్తువుల అమ్మకాలమొత్తం 1940 నాటికన్న చాలాపెరిగింది. (21వ జవాబుచూడండి). 1951 లో చిల్లరఅమ్మకం 1950తో పోల్చిచూచుకుంటే నూటికి 15 వంతులు యెక్కువైంది.

ప్రభుత్వ సహకార విక్రియ సంస్థలతోపాటు, సమిష్టి వ్యవసాయక్షేత్రాలకు చెందిన మార్కెట్లలోగూడా రొట్టెలు, మాంసం, కాయగూరలు, యితర ఆహారపదార్థాలు లభ్యమౌతాయి. సమిష్టి వ్యవసాయ క్షేత్ర నిర్వాహకులు, స్వంత సేద్యం చేసే రైతులు తమకు సరిపోగా మిగిలిన సరకులను యీ మార్కెట్లలో అమ్మకానికి పెడతారు. సమిష్టి వ్యవసాయ క్షేత్రంద్వారా జరిగే వ్యాపారంవల్ల ప్రజలు తమకు కావలసిన అన్నిరకాల ఆహారపదార్థాలు, వస్తువులు చౌకధరలకు కొనుక్కోగల్గుతున్నారు.

---

## 61.—సోవియట్‌లో విదేశీ వ్యాపారం ఎలా నడుస్తుంది?

సోవియట్ విదేశ వ్యాపారాన్ని ప్రభుత్వం తన స్వంత బాధ్యతమీద నడుపుతుంది. విదేశవ్యాపార మంత్రి

వర్గం యీ శాఖకు అధ్వర్యం వహిస్తుంది. విదేశవ్యాపారాన్ని అభివృద్ధి చేయడానికై యితరదేశాల్లో సోవియట్ వ్యాపార ప్రతినిధివర్గాలు పనిచేస్తూ వుంటాయి. విదేశాలకూ సోవియట్ రష్యాకుమధ్య ఆర్థిక వ్యాపార సత్సంబంధాలు ఏర్పాటు చేయడం, రష్యా విదేశ వ్యాపారాన్ని అభివృద్ధిపరచడం యీ ప్రతినిధి వర్గాల బాధ్యత.

ప్రధానంగా విదేశాంగ వ్యాపారం ప్రత్యేకంగా ఏర్పాటైన ఎగుమతి దిగుమతి వ్యాపారసంస్థల చేత నిర్వహించబడుతుంది. ప్రత్యేకంగా వివిధ పదార్థాలను యెగుమతి దిగుమతి చేసుకునే శాఖోపశాఖలు కూడా యీ సంస్థల యాజమాన్యాన వ్యవహరిస్తాయి. విదేశకంపెనీలతో యీసంస్థలు కంట్రాక్టులు చేసుకొనడం ద్వారా తమ వ్యాపారాన్ని నడుపుతాయి. విదేశ కంపెనీలతో లావాదేవీలుజరపడానికి సోవియట్ప్రభుత్వం తన ఎగుమతి దిగుమతి వ్యాపార సంస్థలకు అధికారమిచ్చింది; స్వతంత్రమైన బాధ్యత కూడా యిచ్చింది. విదేశకంపెనీలకు ఎగుమతి దిగుమతి సంస్థలు రుణపడ్డ మొత్తాలకు ప్రభుత్వమెంతమాత్రం బాధ్యత వహించజాలదని చట్టరీత్యా నిర్ణయించబడ్డది. అలాగే ప్రభుత్వ రుణాలకు గానీ, యితర ఆర్థిక సంస్థలు, విదేశవ్యాపార స్థంస్థలు చేసిన అప్పులకు గానీ, ఎగుమతి దిగుమతి వ్యాపార సంస్థలు భాధ్యతవహించవు.

సోవియట్ రష్యాకు, విదేశాలకు మధ్యసాగే వ్యాపార వాణిజ్యాలు, వ్యాపార పరిమాణం, ధరల చెల్లింపులను స్థిరీకరిస్తూ యిరుదేశాలమధ్యా జరిగిన వ్యాపార ఒడంబడికనుబట్టి నిర్ణయమవుతాయి. ఈ ఒడంబడికల్లో రెండుదేశాలూ పరస్ప

రంగా యే యే పదార్థాలను యిచ్చి పుచ్చుకోవాలో, యెంతెంత, యేయేధరలకు కొనుగోలు జరగాలోగూడా వుదహరించబడుతూ జాబితాలు తయారు చేయబడతాయి.

ఏ దేశమూ తాను ఖరీదుచేసిన సరుకువెల ప్రత్యక్షంగా వెంటనే చెల్లించదు. కంట్రాక్టుఆఖరుకు లెక్కలన్నీ తనిఖీచేయబడి జమాఖర్చులు తేల్చబడతాయి. సాధారణంగా రెండు దేశాలమధ్యా కొనుగోళ్లు, అమ్మకాలూ సరిసమానంగానే ఉంటాయి.

సోవియట్ పారిశ్రామిక, వ్యవసాయాభివృద్ధిమూలంగా విదేశవ్యాపారం విస్తారంగా విజృంభించింది. ఈనాడు సోవియట్ రష్యా, మోటార్లు, లారీలు, ట్రాక్టర్లు, వ్యవసాయకయంత్రసామాగ్రి, రసాయనికపదార్థాలు, రకరకాలైన యెరువులు, ప్రత్తి, నూనెగింజలు, కలప, గోధుమ, జంతుచర్మాలు, ఉన్ని మొదలైన పదార్థాలను ఎగుమతి చేస్తున్నది.

తూర్పు, ఆగ్నేయ యూరప్ దేశాలనుండి సోవియట్ రష్యా, పెట్రోలియంపదార్థాలను, బొగ్గు, రైళ్ళపెట్టెలను, పడవలను, బట్టలను, యితరవస్తువులను దిగుమతిచేసుకుంటుంది.

ఇతర దేశాలతో ఆర్థికసహకారాన్ని పెంపొందించి విస్తరిల్లచేయాలనే ఆశయంతో సోవియట్‌రష్యా, వివిధదేశాల మధ్య శాంతివాతావరణం, సుహృద్భావం దృఢతరం కావాలని అభిలషిస్తున్నది. ఈ సిద్ధాంతాలకు సోవియట్‌రష్యా ఎల్లప్పుడూ కట్టుబడివుండి, చిన్న, పెద్ద అనే భేదభావంలేక అన్నిదేశాలతో సమానగౌరవప్రతిపత్తులతో తన సత్సంబంధాలను పటిష్టం చేసుకుంటుంది. ప్రాక్పశ్చిమదేశాలతో పూర్వంకన్న ఊహించ

నంత ఉన్నతస్థాయిలో వ్యాపారంచేయడానికి యీనాడు సోవియట్ యూనియన్‌కు బలసంపదలు, శక్తియుక్తులు చేకూరినై.

సోవియట్ విదేశవాణిజ్య, వ్యాపారసంస్థలు పశ్చిమ యూరప్ దేశాలనుండీ, ఉత్తర, దక్షిణ అమెరికాలనుండీ, ఆగ్నేయాసియా, మధ్యప్రాచ్యదేశాలనుండీ, ఆఫ్రికా, ఆస్ట్రేలియాల నుండి, మామూలుగా యీదేశాలు యెగుమతిచేసే సరకులన్నిటినీ కొనేస్థితిలోఉన్నది. ఇదేవిధంగా యీదేశాలకవసరమైన సరుకులన్నిటినీ సోవియట్‌యూనియన్ వచ్చే రెండు మూడు సంవత్సరాల్లో 3000 నుండి 4000 ల కోట్లవిలువగల మొత్తంవరకూ అమ్మగలవుగూడా. 1948 లో సోవియట్‌యూనియన్ చేసిన 500 కోట్ల రూబుల్స్ విదేశవ్యాపారంతో పోల్చితే, యీనాటి సోవియటు విదేశవ్యాపారాభివృద్ధి ఎంత పురోగమించిందో స్పష్టమౌతుంది.

విదేశాలతో వ్యాపారాభివృద్ధికై సోవియటు రష్యా చేసిన సూచనలను ఆచరణలోపెడితే, ఆదేశాల్లో ప్రజల కొన్ని సంవత్సరాలవరకు 15, 20 లక్షలమంది ప్రజలు శ్రమపడిచేసిన సరకులను ఒక్క సోవియటు ప్రభుత్వమే కొనగల్గుతుంది.

---

**62.—సోవియట్ రష్యాలో ధరలు నిర్ణయించేదెవరు ?**

వివిధపదార్థాల ధరలు ప్రభుత్వ ఆర్థికప్రణాళికాధిపతులచే నిర్ణయింపబడి ప్రభుత్వామోదం పొందుతాయి. ఆహారపదార్థాలు మినహా, తక్కిన ముఖ్యమైన వస్తువుల ధరలన్నీ దేశం

అంతటా ఒక్కటే. ఆహారపదార్థాల్లోకల్లా ముఖ్యమైనవాటి ధరలు, అవిపండే ప్రదేశాన్నిబట్టి వేర్వేరుగా నిర్ణయించబడ తాయి. ఇందుకే దేశాన్నంతా ఐదుభాగాలుగా విభజించింది ప్రభుత్వం. ధరలు నిర్ణయించేవిషయంలో ఉత్పత్తికయ్యే సమస్త ఖర్చులూ లెక్కకట్టబడతాయి. పారిశ్రామిక, వ్యవసాయో త్పత్తిలో అధికభాగం ప్రభుత్వమే నిర్వహించడంవల్ల, విని మయం గూడా ప్రభుత్వ, సహకారసంస్థలద్వారా జరగడంవల్ల, దేశానికి యావత్తూ ఒకే విధమైన రేట్లు నిర్ణయించడం అంత కష్టమైన విషయంగాదు. సోవియట్ ఆర్థిక విధానంలో ధరల ఒడిదుడుకులు, స్పెక్యులేషన్ మూలంగా ధరలు చుక్కలం టడం అసంభవమైన విషయం.

సహకార సంస్థలచేత ఉత్పత్తి కాబడ్డ సరకులకు గూడా ప్రభుత్వం నిర్ణయించేధరలే అమలుజరపబడతాయి. సమిష్టివ్యవ సాయక్షేత్రాల మార్కెట్లల్లో చిల్లర ధరలు గిరాకీనిబట్టీ, సప్లయినిబట్టీ ఉంటాయి. అయితే ప్రభుత్వ సహకార విక్రయ శాలల్లో ఒకేరేటు చొప్పున అమ్ముతున్నప్పుడు, సమిష్టి వ్యవ సాయదార్లుగూడా అదేరేటుకో, అంతకన్న తక్కువకో అమ్మాలి. ఈ విధంగా సోవియట్ ప్రభుత్వం సోషలిస్టు ఆర్థిక సూత్రాలను సాధనాలుగా ఉపయోగించి సమిష్టి వ్యవసాయ క్షేత్ర విక్రయ శాలల్లోగూడా ఒకేరేటుకు సరుకులను అమ్మే టట్టు చేస్తుంది.

---

63.—ధరలు తగ్గించడం యెలా సాధ్యమైంది? తగ్గింపువల్ల ప్రజలకు కలిగిన ప్రయోజనాలేమిటి?

ప్రజల నిత్య జీవితావసర వస్తువుల చిల్లర ధరలు క్రమంగా తగ్గించడానికి సోవియట్ ప్రభుత్వం క్రమబద్ధమైన ఒక సూటిమార్గాన్ని అనుసరిస్తున్నది. యుద్ధానంతరం నుండి యీ నాటివరకూ ప్రభుత్వం అయిదుసార్లు ధరలను తగ్గిస్తూ ప్రకటనలు చేసింది. ఈ ధరలు తగ్గించడంమూలంగా సోవియట్ ప్రజల జీవితస్థాయిని పెంచడంలో ప్రభుత్వం యెంత శ్రద్ధాశక్తులు ప్రకటిస్తున్నదో ద్యోతకమౌతుంది. సోవియట్ ప్రజల భౌతిక, సాంస్కృతిక అవసరాలు నానాటికి అధికమౌతున్నాయనీ, యీ అవసరాలను తీర్చి ప్రజల సుఖమయ జీవితాన్ని సర్వతోముఖంగా అభివృద్ధి చేయడమే సోషలిస్టు ఆర్థిక సిద్ధాంత ప్రాథమిక లక్షణమనీ స్టాలిన్ ప్రబోధించాడు.

యుద కాలం నాటినుండీ దిన దిన ప్రవర్ధమానమౌతున్న సోవియట్ శాంతియుత ఆర్థిక విధానమూ (21 వ జవాబు చూడండి) నానాటికీ పెరుగుతున్న పారిశ్రామిక, వ్యవసాయకోత్పత్తీ, ఉచ్చస్థాయి నందుతున్న శ్రామిక వుత్పత్తిశక్తి, క్రమంగా తగ్గుముఖం పట్టిన ఉత్పత్తి ఖర్చులూ, — యిన్నీ కలిసి ధరలు తగ్గించే అవకాశం సోవియట్ ప్రభుత్వానికి కల్గించాయి.

డబ్బు లెక్కనుబట్టి యీ ధరల తగ్గింపువల్ల ప్రజలకు కలిగిన ప్రయోజనాలేమిటి? 1947 చివరలో ప్రథమ పర్యా

యంగా సోవియట్ ప్రభుత్వం ధరలు తగ్గించింది. దీనివల్ల ప్రజలకు 8600 కోట్లు రూబుల్స్ అదా అయింది ఒక సంవత్సరంలో. అంటే వారి జీతాలు రెట్టింపురూపంలో ముట్టినట్లుగా భావించాలి. 1949 లో రెండవసారి ధరల తగ్గింపు ప్రకటించినప్పుడు, ప్రజల ఆదాయం 7100 కోట్ల రూబుల్స్ వరకూ పెరిగింది. 1950 లో ఆహారపదార్థాల, యితర వస్తువుల ధరలు మూడోసారి తగ్గించినప్పుడు ప్రజలకు 8000 కోట్లు కలిసి వచ్చింది. ప్రభుత్వ, సహకార సమిష్టి వ్యవసాయక్షేత్ర విక్రయ సంస్థల్లో కూడా ఒకేసారి వస్తువుల ధరలు తగ్గడంవల్ల, సమిష్టిగా ప్రజలకు సంవత్సరానికి 11,000 కోట్ల రూబుల్స్ ఆదా అయింది. 1951 మార్చి 1 వ తేదీన సోవియట్ ప్రభుత్వం నాల్గోసారి ధరలను తగ్గిస్తూ ప్రకటనచేసింది. ఆ సంవత్సరం ప్రజలకైన ఆదా 3500 కోట్ల రూబుల్స్. 1952 ఏప్రిల్ 1 వ తేదీన అయిదోసారిగా సోవియట్ ప్రభుత్వం ధరల తగ్గింపు అమల్లోపెట్టింది. ముఖ్యమైన ఆహారపదార్థాల ధరల్లో కూడా నూటికి 10 నుండి 30 వంతులు వరకు తగ్గింపు జరిగింది. దీనివల్ల కూడా ప్రజలు 2300 కోట్ల రూబుల్స్ ఆదాచేసుకోగల్గారు.

---

### 64.—సోవియట్ రష్యాలో న్యాయపాలన యెలా నిర్వహించబడుతున్నది?

సోవియట్ ప్రజల ఆస్తిహక్కులను, ప్రయోజనాలను, సోవియట్ సంస్థలయొక్క చట్టసమ్మతమైన హక్కు-

లను, ప్రయోజనాలను సంరక్షించడం సోవియట్ న్యాయ స్థానాల విధ్యుక్తధర్మం. స్థానిక న్యాయస్థానమైన ప్రజాకోర్టు నుండి సుప్రీం సోవియటు వరకూ అన్ని న్యాయస్థానాలూ ప్రజలచేత యెన్నుకోబడ్డవే. ప్రతి న్యాయస్థానంయొక్క అధి కారాలు స్పష్టంగా నిర్ణయించబడ్డాయి. క్రిమినల్, సివిల్ కేసుల్లో అత్యధికభాగం, ఒక న్యాయాధిపతి, యిద్దరు అస్సె సర్లతో కూడిన ప్రజాకోర్టుచేత విచారించబడతాయి. ప్రాంతీయ భూభాలకు చెందిన న్యాయస్థానాలు, ప్రభుత్వానికి వ్యతిరేకంగా చేసిన నేరాలను, ప్రజాసంస్థలకు, ప్రభుత్వానికి మధ్యవచ్చే తగాయిదాలను, క్రిందికోర్టుల్లో విధించిన శిక్షపై చేసుకునే అప్పీళ్ళను విచారిస్తాయి.

వివిధ రిపబ్లికుల్లోని న్యాయస్థానాల కార్యకలాపాలను ఆ రిపబ్లికుల సుప్రీం సోవియట్లు పరిశీలిస్తాయి. అఖిల సుప్రీం సోవియటు, సోవియటు యూనియన్‌లోని వివిధ న్యాయ స్థానాల కార్యకలాపాలను పర్యవేక్షిస్తుంది. న్యాయస్థానాలన్ని టిలో ప్రజలచే యెన్నుకొనబడే అస్సెసర్లు పాల్గొంటారు. జడ్జీలవలెనే అస్సెసర్లు కూడా ప్రజలచే యెన్నుకోబడతారు. సోవియటు న్యాయశాస్త్రంలో యిదొక విశిష్ట లక్షణం.

సోవియటు రాజ్యాంగంలో జడ్జీలకు సంపూర్ణ స్వేచ్ఛ యివ్వబడ్డది. ఏ ప్రభుత్వసంస్థగానీ, అధికారిగానీ, న్యాయాధి కారిని తమ పక్షాన త్రిప్పుకోడానికీ, వలుకుబడి నుపయోగించి తీర్పును తమ కనుకూలంగా యిప్పించుకోడానికీ వీలువడదు.

న్యాయాధికారి తీర్పు రాజ్యాంగ చట్టసమ్మతంగా, కేసు సాక్ష్యంమీద ఆధారపడి ఉండాలి.

రాజ్యాంగచట్టానికి ప్రజలందరూ బద్ధులైవుండితీరాలి ప్రజల్లో యేతరగతివారికీ ప్రత్యేక న్యాయస్థానాలంటూలేవు. గ్రామీణప్రాంతంలోని ప్రజాకోర్టుల్లోనే అన్నితరగతులకు చెందినపౌరులూ విచారించబడతారు.

ఆయా ప్రాంతాలకు చెందిన ప్రజలను విచారణకుపెట్టి నప్పుడు, విచారణకలాపమంతా వారి మాతృభాషలోనేజరుగు తుంది. ప్రాంతీయభాష తెలియని ముద్దాయి విచారించబడ్డ ప్పుడు, జరిగేకార్యకలాపమంతా అతనికి తెలిసిన భాషలో అనువదించి చెప్పబడుతుంది. ప్రతిపౌరుడూ తన మాతృభాషను న్యాయస్థానాల్లో మాట్లాడేహక్కువుంది. కేసులన్నీ బహిరం గంగా ప్రజాసమక్షంలో విచారించడం, సోవియటు న్యాయ పాలనావిధానంలో అతి ప్రధానసిద్ధాంతం. ప్రభుత్వ, సైనిక, రాజ్యాంగ రహస్యాలకు సంబంధించిన కేసులుమాత్రం రహ స్యంగా విచారించబడతాయి. (32వ జవాబు చూడండి)

సోవియటు న్యాయస్థానాలు పవిత్రమైన నైజ్ఞానికపాత్ర కూడా నిర్వహిస్తున్నాయి. నేరస్తులను శిక్షించడంతోపాటు, వారి మనస్తత్వాన్నిమార్చి, విజ్ఞానప్రబోధం చేయడంద్వారా, నూతనదృక్పథంగల మానవులుగా వీరు పరిణామంచెందడానికి సంపూర్ణమైన అవకాశాలు కల్గిస్తున్నారు. సోవియటుచట్టాల ఆశయం నేరస్తుణ్ణి అవమానపరచి, శిక్షించి, బాధించడ మెంత మాత్రంకాదు. తమ శిక్షాపరిమితిలో తమ నేరాలకుగల కార ణాలను గ్రహించుకుని, ఆ కారణాలను రూపుమాపుకొనడం ద్వారా చైతన్యవంతులూ, గౌరవనీయులైన సోవియటు పౌరు

లుగా రూపొందగల అవకాశాలన్నిటినీ సోవియటు ప్రభుత్వం నేరస్తులకు కలుగజేస్తుంది.

---

## 65.—జడ్జీ కాగల అర్హతలెవ్వి?

సోవియటు న్యాయశాఖాధికారులంతా ప్రజలచే ఎన్నికైనవారే. 23 యేండ్ల వయస్సుగల్గి, ప్రజల సంపూర్ణ విశ్వాస గౌరవాలు చూరగొన్న ప్రతి సోవియట్ స్త్రీ, పురుషుడూ న్యాయాధికారి కావచ్చు. న్యాయాధికార్లూ, అస్సెసర్లూ, సమావేశమై విచారణజరిపే వివిధ ప్రాంతాల్లోని ప్రజలు సమాన ప్రతిపత్తిగల ప్రత్యక్ష రహస్య ఓటింగు ద్వారా మూడు సంవత్సరాల పరిమితి వరకు జడ్జీలను, అస్సెసర్లను యెన్నుకుంటారు. ఒక జడ్జీతోపాటు 50 నుండి 75 వరకూ అస్సెసర్లు ప్రతిజిల్లానుండీ యెన్నికౌతారు. 1951 చివరభాగంలో న్యాయాధికార్ల యెన్నికకై మాస్కోలో జరిగిన ఓటింగులో నూటికి 99 మంది ప్రజలు పాల్గొన్నారు. జడ్జీల్లోనూ, అస్సెసర్లలోనూ, నూటికి 45 వంతులు స్త్రీలు.

ఉన్నత న్యాయస్థానాలకుచెందిన జడ్జీలు, అస్సెసర్లూ, యూనియన్ రిపబ్లిక్కుల సుప్రీం కోర్టుల సభ్యులూ, సోవియటు యూనియన్ సుప్రీంకోర్టు సభ్యులూ, ఆ యా ప్రాంతాల సోవియట్లచేత, సుప్రీం సోవియట్లచేత అయిదేండ్లకోసారి యెన్నుకోబడతారు.

---

## 66. సోవియట్ రష్యాలో 'ప్రాక్యురేటర్-జనరల్' అధికారాలెవ్వి ?

సోవియటు అధికారవర్గాలు, సంస్థలు, ఉద్యోగులు, సోవియటు పౌరులు రాజ్యాంగచట్టాన్ని సక్రమంగా పాటించేందుకై పర్యవేక్షణచేయడం 'ప్రాక్యురేటర్-జనరల్' యొక్క విధ్యుక్తధర్మం. రాజ్యాంగ చట్టాన్ని ఉల్లంఘిస్తూ అధికార్లుగానీ, మంత్రులుగానీ, జారీచేసే ఆదేశాలకు, ఆర్డర్లకు, చేసే చర్యలకు 'ప్రాక్యురేటర్-జనరల్' తన అసమ్మతిని ప్రకటించే అధికారం ఉంది. ఈ అధికారిని సుప్రీం సోవియటు నియమిస్తుంది. ఈ అధికారి తిరిగి అన్ని యూనియన్ రిపబ్లికుల్లోనూ, యితర ప్రాంతాల్లోనూ ప్రాక్యురేటర్లను నియమిస్తాడు. వీరంతా స్థానికసంస్థలతో నిమిత్తంలేక సూటిగా ప్రాక్యురేటర్-జనరల్ కే బాధ్యులై వుంటారు!

ప్రాక్యురేటర్-జనరల్, యితరప్రాక్యురేటర్లూ, అవసరమైనప్పుడల్లా న్యాయస్థానాల్లో ప్రభుత్వపక్షాన వాదిస్తారు. ఏ సోవియట్ పౌరుడికైనా, రాజ్యాంగనిబంధనలను ఉల్లఘించే వ్యక్తులమీదగానీ, అధికార్లమీదగానీ, ప్రభుత్వ సంస్థలమీదగాని ప్రాక్యురేటర్-జనరల్ వద్ద ఫిర్యాదుచేసుకునే హక్కుంది; న్యాయసమ్మతమైన తన హక్కులను, ప్రయోజనాలను సంరక్షించుకోడానికిగూడా పై అధికారివద్ద దరఖాస్తుపెట్టుకోవచ్చు. ఈ ఫిర్యాదులనూ, అర్జీలనూ అధికారి తక్షణమే న్యాయసమ్మతంగా విచారిస్తాడు.

తమ విధి నిర్వహణలో యీ అధికార్లకు ప్రజాసా మాన్యం అవసరమైన సర్వసహాయం అందచేస్తుంది. సోవియట్ న్యాయస్థానాలమాదిరే, ప్రాక్యురేటర్-జనరల్, యితరప్రాక్యురేటర్లూ, ప్రజలతో సన్నిహితసంబంధంకలిగివుండి, వారి సమిష్టి, వ్యక్తిగత ప్రయోజనాలను, సోవియటు సామాజిక విధానాన్ని భద్రంగా సంరక్షిస్తారు.

---

**67.—సోవియట్ యూనియన్‌లో న్యాయవాది వృత్తి ఉందా ?**

అవును; ఉన్నది. గ్రామీణ, పట్టణ ప్రాంతాల్లో న్యాయవాదుల సంఘాలున్నాయి. సోవియట్ చట్టంప్రకారం క్రిమినల్ కేసుల్లో ప్రతివాదులూ, సివిల్ కేసుల్లో వాదిప్రతివాదులిరువురూ న్యాయవాదుల సహాయాన్ని పొందే హక్కున్నది. ప్రాక్యురేటర్ చేత స్వయంగా నడపబడే కేసులన్నిటిలోనూ, ప్రతివాది తరఫున పనిచేసే న్యాయవాది కోర్టులో విధిగా హాజరుకావాలి. ఇంతేకాక అంగవైకల్యంకలిగి (గుడ్డి, చెముడు, మూగ) తమ కేసులను నడుపుకోలేని ప్రతివాదుల తరఫున కూడా తప్పక హాజరుకావాలి.

న్యాయవాదులు వసూలు చేసే చార్జీలు స్వల్పంగా ఉంటాయి. తన యిష్టమొచ్చిన న్యాయవాదిని ప్రతివాది స్వతంత్రంగా నిర్ణయించుకోవచ్చు; లేదా న్యాయవాదుల సంఘం సలహాపొంది, వారిద్వారా యేర్పాటు చేసుకోవచ్చు. ఈ

స్వల్ప మొత్తంకూడా చెల్లించలేని ప్రతివాదికి న్యాయస్థానమే ఉచితంగా ప్లీడరును ఏర్పాటు చేస్తుంది.

క్రిమినల్ కేసులో గానీ, సివిల్ కేసులోగానీ ప్రతివాది తన కవసరమైన సాక్షులను పిలిపించి విచారించమని న్యాయస్థానాన్ని కోరవచ్చు కూడా. విచారణ కవసరమయ్యే దస్తావేజులను, యితర డాక్యుమెంట్లను ప్రభుత్వ ఖర్చులమీద తెప్పించుకోవచ్చు. తనకు ఒక న్యాయస్థానంలో న్యాయం జరగదనిగాని, జరగలేదని గానీ అసంతృప్తి కలిగినయెడల, తిరిగి విచారణకు పెట్టమని కోరడానికికూడా హక్కున్నది.

---

**68.—బాలుర 'కిండర్ గార్డెన్లు' క్రెచీలు' ఎలాంటి పాత్ర వహిస్తాయి ?**

"కిండర్ గార్టెన్లు" 'క్రెచీల' ను స్థాపించడంలో, సోవియటు ప్రభుత్వానికి గల ఉద్దేశ్యం, స్త్రీలు పారిశ్రామిక రంగంలో పనిచేసి, విజ్ఞానంపొంది, జాతీయరంగంలో పాల్గొనడానికి సదవకాశాలు కల్గించడమే. పిల్లలకు నాలుగేండ్లవయస్సు వచ్చేవరకు 'క్రెచీ' సంరక్షిస్తుంది; నాలుగేండ్ల నుంచి ఏడేండ్ల వయస్సు వచ్చేవరకు 'కిండర్ గార్టెన్' శ్రద్ధవహించి పోషిస్తుంది. పగలల్లా పిల్లలు యీ రెండు సంస్థల్లోనూ కాలంగడుపుతారు. ఈ కాలంలో తమ తల్లులు తమ పనులను నిర్వర్తిస్తూ ఉంటారు. విద్యావిధానంలో ప్రత్యేక శిక్షణతో కట్టుదిట్టంగా తర్ఫీదు బొందినవారు యీ పిల్లలను సంరక్షిస్తారు. డాక్టర్లు

వారి ఆరోగ్యం, శారీరక పటుత్వం విషయంలో శ్రిద్ధవహి స్తారు. బాలుర వయస్సునుబట్టి ఆరోగ్యకరమైన ఆహారం యివ్వబడుతుంది.

ఈ రెండు సంస్థల్లో పిల్లల జీతాలు అతిస్వల్పంగా మాత్రిమే ఉంటాయి. ఖర్చుల్లో అధికభాగం ప్రభుత్వం భరి స్తుంది. 1950 లో 12 లక్షల 50 వేలమంది బాలురు గ్రామీణ ప్రాంతాల్లోని క్రెచీల్లో రక్షణ పొందారు. కిందక్ గాట్లైన్ల సంఖ్య 27000 దాకా పెరిగింది. కొన్ని కొన్ని తరుణాల్లో పొలం పనుల రోజుల్లో పల్లెల ప్రాంతాల్లో 30 నుంచి 40 లక్షల వరకూ బాలురు క్రెచీలలో సంరక్షణ పొందుతారు. తమ బిడ్డలను యీ సంస్థలకు పంపడమూ, పంపకపోవడమూ అనేది తల్లిదండ్రులే నిర్ణయించుకోడానికి హక్కుంది.

---

**69.—సోవియట్ కార్మికుడు తనపనిని నిర్వర్తిస్తూనే సాంకేతిక నిపుణుడుగా తయారు కాగలడా?**

తప్పకుండా కాగలడు. అనేకవిద్యాసంస్థలూ, సెకండరీ సాంకేతికవిద్యాశాలలూసాయంకాలపుతరగతులంటూ ఏర్పాటు చేశాయి; ఇవిగాక పోస్టుద్వారా తర్ఫీదుపొందే కోర్సులుగూడా ప్రారంభించాయి. ప్రత్యేకంగా పోస్టల్ ట్యూషన్‌మాత్రమే నిర్వహించే సాంకేతికవిద్యాసంస్థలూ ఉన్నాయి. సోవియట్‌లో అభివృద్ధియిన యిలాంటి ఒక సంస్థలో 9000 విద్యార్థులు ఏడు రకాలైన శాఖల్లో తర్ఫీదుపొందుతున్నారు. సాయంకాలపు

తరగతులు యెక్కువభాగం పెద్దపెద్ద ఫ్యాక్టరీల ఆధ్వర్యంక్రింద ఏర్పాటుచేయబడతాయి. విద్యార్థులు అధ్యయన తరగతులకు హాజరై, పనిగంటలు పూర్తిఅయినతర్వాత లాబొరేటరీ కార్యక్రమాలకు వెడతారు.

పోస్టుద్వారా తర్ఫీదయ్యే విద్యార్థులకుగూడా నోట్సు, లెక్చర్లు, యితరసౌకర్యాలు వ్రాతమూలంగా అందజేయబడతాయి. సంవత్సరంమొత్తంలో యీ విద్యార్థులుగూడా అనేకసార్లు విద్యాలయాలకొచ్చి తోటివిద్యార్థులతోపాటు విద్యనభ్యసించాల్సుంటుంది. యీ విధంగా సాయంకాలపుస్కూళ్ళవల్ల, పోస్టల్ ట్యూషన్‌వల్లా ఉన్నతసాంకేతిక పరిజ్ఞానాన్ని తాను మామూలుగా పనిచేస్తూవుండేకాలంలోనే సంపాదించగలుగుతున్నాడు సోవియటు కార్మికచట్టాలప్రకారం యీ విద్య నభ్యసించే కార్మికులకు, సలహాలుపొందడానికీ, పరీక్షలకు తయారుగావడానికీ, నూతనసాంకేతిక సిద్ధాంతాలను కనిపెట్టేఅవకాశం పొందడానికి ప్రత్యేకసెలవులిస్తారు. పరీక్షలో ఉత్తీర్ణులైనవారికి యితర విద్యార్థులవలెనే డిప్లొమాలివ్వబడతాయి. 1951 లో అనేక లక్షలమంది కార్మికులీపరీక్షల్లో ఉత్తీర్ణులైనారు.

---

**70.—సోవియట్ రష్యా స్త్రీలలో ఎంతమంది ఇంజనీర్లు, టెక్నిషియన్లు, విజ్ఞానశాస్త్రవేత్తలు, రాజ్యాంగవేత్తలు న్నారు?**

సోవియటు రష్యాలో ప్రభుత్వానికి సంబంధించిన ప్రతి ఆర్థిక, సాంస్కృతిక, వైజ్ఞానిక, రాజకీయరంగా

ల్లోనూ, పురుషులతోపాటు స్త్రీలకు సమానహక్కులుంటాయని తెలుసుకున్నాం.

అక్టోబరు సోషలిస్టు విప్లవానికిపూర్వం రష్యాలో 600 మంది యింజనీర్లు మాత్రమేవున్నారు; కాని 1951 నాటికి 3 లక్షల 80 వేలవరకు అభివృద్ధయినారు.

1951 వ సంవత్సరంలో విద్యాశాఖలో 10 లక్షలకు పైగా ఉపాధ్యాయినులు పనిచేశారు; ఆస్పత్రుల్లోను యితర ఆరోగ్యశాఖల్లోనూ 10 లక్షలమంది స్త్రీలు పనిచేస్తూ వచ్చారు; వీరిలో 2 లక్షల 7 వేలమంది డాక్టర్లే.

వున్నత విద్యాలయాల్లో అధ్యాపకులుగా వున్న స్త్రీల సంఖ్య 8 లక్షల 30 వేలకు మించింది. 1951 లో 10 లక్షలకు పైగా వున్నత విద్యాలయాల్లోనూ, స్పెషల్ సెకండరీ విద్యా సంస్థల్లోనూ విద్య నభ్యసించారు.

అనేక వైజ్ఞానిక పరిశోధనాలయాలు, ఉన్నతవిద్యాలయాలు, పెద్దఫ్యాక్టరీలు, ప్రభుత్వ సమిష్టివ్యవసాయక్షేత్రాలు పాఠశాలలు, ఆసుపత్రులు స్త్రీల అజమాయిషీక్రింద నడుస్తున్నాయి. 60 వేలమంది స్త్రీలు విశ్వవిద్యాలయ పరిశోధన కేంద్రాల్లోనూ యితర సంస్థల్లోనూ నియమించబడ్డారు.

వీరుగాక వ్యవసాయశాస్త్రంలో నైపుణ్యం సంపాదించి, ఉత్పత్తివిధానంలో అందెవేసి, అనేకబహుమతులు, పతకాలు పొందిన మహిళామణులు వేనకువేలున్నారు. విజ్ఞానశాస్త్రంలో పరిశోధనచేసినందుకూ, నూతనయంత్రపరికరాలను, సిద్ధాంతాలను కనిపెట్టినందుకూ, సాహిత్యకళారంగాల్లో విశేషకృషిచేసి

ఫలితాలుపొందినందుకూ 600 మంది స్త్రీలకు స్టాలిన్ బహుమతులివ్వబడ్డాయి.

దేశపరిపాలనావ్యవహారాల్లో స్త్రీలు అతిసమర్థతతోను, చురుకుగాను పనిచేస్తున్నారు. 1950 మార్చి యెన్నికల్లో సుప్రీం సోవియట్‌కు 280 మంది స్త్రీలు ప్రతినిధులుగా ఎన్నుకోబడ్డారు. 1951 ఫిబ్రవరిలో యూనియన్ సుప్రీంసోవియట్లకూ, స్వతంత్ర రిపబ్లికులకూ కలసి 2209 మంది స్త్రీ ప్రతినిధులు యెన్నుకోబడ్డారు. స్థానిక సోవియట్లలో 5 లక్షలకు పైగా స్త్రీలు ప్రతినిధులుగా పనిచేస్తున్నారు.

---

## 71.—సోవియట్‌లోవున్న విజ్ఞానశాస్త్ర సంస్థలేవి ?

సోవియట్ రష్యాలో విజ్ఞానశాస్త్రం సర్వతోముఖంగా, సమగ్రమైన అభివృద్ధి చెందుతున్నట్లు మరేదేశంలోనూ చెందడంలేదు. ఈ విజ్ఞానశాస్త్రాభివృద్ధి 'సోవియట్ అకాడమీ ఆఫ్‌సైన్సు' అనే సంస్థ నాయకత్వం క్రింద సాగుతున్నది. ఈ సంస్థ 1725 లో స్థాపించబడ్డది. విప్లవానికిపూర్వం యీ సంస్థలో అయిదు చిన్న లేబరేటరీలు మాత్రమే ఉండేవి. సోషలిస్టు రాజ్యాంగంలో యీ సంస్థలో వందలకొద్దీ పరిశోధనాలయాలు నిర్మించబడ్డాయి. పదార్థ విజ్ఞానశాస్త్రం, గణితశాస్త్రం. రసాయనికశాస్త్రం, భూగర్భశాస్త్రం, భూగోళశాస్త్రం, జీవశాస్త్రం, టెక్నాలజీ, చరిత్ర, తత్వశాస్త్రం, ఆర్థికశాస్త్రం, న్యాయశాస్త్రం, సాహిత్యం, భాషాశాస్త్రాల్లో

పరిశోధనలు అపారంగా జరిగి యెన్నో ఫలితాలు సాధించ బడ్డాయి.

16 యూనియన్ రిపబ్లికుల్లో పన్నెండింటిలో 'సైన్సు ఎకాడమీలు' న్నాయి; వీటికి వివిధ విషయాలమీద పరిశోధనలు జరిపే "రిసెర్చికేంద్రాలు" గూడా అనుబంధింప బడ్డాయి. దేశం మొత్తంమీద పనిచేస్తున్న 'సైన్సుఅకాడమీ'కి వివిధ రిపబ్లికుల్లో శాఖోపశాఖలున్నాయి. ఈ శాఖలద్వారా ఆయా రిపబ్లికుల సర్వతోముఖాభివృద్ధి సాధ్యమౌతున్నది.

ఇవికాక వ్యవసాయ శాస్త్రంలోనూ, వైద్యశాస్త్రం లోనూ, విద్యావిషయక శాస్త్రంలోనూ ఆర్థిక, సాంఘిక, సాహితీ, కళా, శిల్పశాస్త్రాల్లోనూ ప్రత్యేక 'అకాడమీలు' పనిచేస్తున్నాయి. వివిధ మంత్రి వర్గాల క్రింద వేర్వేరు విజ్ఞాన శాస్త్ర పరిశోధనశాలలు గూడా ఉన్నాయి. పారిశ్రామిక ఉత్పత్తి రంగంలోను, వ్యవసాయరంగంలోను సాధిస్తున్న మహత్తర విజయాలకూ, ఆర్థిక, సాంస్కృతిక విజయాలకూ యీ అకాడమీలూ, వాటిక్రింద పనిచేస్తున్న పరిశోధన కేంద్రాలయాలే కారణం.

ఇవికాక దేశమంతటిలో అనేక శాఖలకు చెందిన విజ్ఞాన శాస్త్రసంస్థలు కూడా కృషిచేస్తున్నాయి. ఈ సంస్థల అనుపమాన కృషివల్ల యీ నాడు సోవియట్ యూనియన్ ప్రపంచంలో అన్నిదేశాలకన్న ముందుండి నూతన సమాజ నిర్మాణంద్వారా కమ్యూనిస్టు ఆశయానికి పురోగమిస్తున్నది.

---

## 72.—సోవియట్ రష్యాలో ప్రచురించబడే పత్రికలేవి?

సోవియట్ ప్రభుత్వ ఆధ్వర్యంక్రింద పత్రికారచన, పత్రికా ప్రచురణ అతిశక్తివంతంగా అభివృద్ధిచెందింది. ప్రస్తుతం 7800 రకాల దినపత్రికలు, 1400 రకాల మాస, పక్ష, వారపత్రికలు సోవియట్ రష్యాలో ప్రకటించబడుతున్నాయి. 1950 లో ప్రతినిత్యా అమ్ముడుపోయే పత్రికలసంఖ్య 3 కోట్ల 60 లక్షలు. 1913 వ నాటి సంఖ్యతో పోల్చిచూస్తే, యిది 12½ రెట్లు. ప్రతి జిల్లాలోనూ ఏదో దినపత్రిక ప్రకటించబడుతూనేఉంటుంది.

మాస్కోలో ప్రకటితమయ్యే కమ్యూనిస్టు దినపత్రిక 'ప్రవ్దా', సోవియట్ ప్రభుత్వపత్రిక "ఇజ్‌వెస్టియా", అఖిల ట్రేడ్‌యూనియన్‌సమాఖ్యదినపత్రిక 'ట్రిడ్', యువక కమ్యూనిస్టులపత్రిక 'కామ్సోమోల్‌స్కయాప్రవదా' మొదలైనవి సోవియట్ ప్రజల సంపూర్ణవిశ్వాసం చూరగొన్నవి. వేర్వేరు రిపబ్లికుల్లో ప్రకటింపబడే పత్రికల్తోపాటు, పారిశ్రామికసంస్థల్లోనూ ప్రభుత్వ, సమిష్టివ్యవసాయ క్షేత్రాల్లోనూ ఉన్నతవిద్యాలయాల్లోనూ వందలకొద్దీ పత్రికలు ప్రకటించబడుతున్నాయి. వ్యక్తిగతంగా నడపబడే పత్రికలుగానీ, సంచికలుగానీ సోవియటు యూనియన్‌లో లేవు. ప్రతి పత్రికా, సంచికా యేదో ఒక సంస్థచేత నడుపబడుతూనే ఉంటుంది.

వివిధమంత్రివర్గాలచేత సమిష్టిగా నడపబడే పత్రికలు అనేకం ఉన్నాయి. ఇలాగే అనేక విద్యాసంస్థల సమిష్టిఆధ్వర్యాన నడిచేపత్రికలూ ఉన్నాయి.

సోవియటు పత్రికలన్నీ సోవియటుప్రజల జీవితచిత్రాన్నీ వారి శాంతి, సహన, పౌరుషతత్వాన్నీ, కమ్యూనిస్టుసమాజ నిర్మాణంకొరకూ, సాంస్కృతిక అభివృద్ధికొరకూ వారు అవిర ళంగాచేసే అనన్యకృషినీ ఉన్నది వున్నట్లు విశదీకరిస్తాయి. ప్రపంచరాజకీయాల సమీక్షకై పత్రికల్లో ప్రముఖస్థానం యివ్వబడుతుంది. అన్నిజాతులు, తెగలమధ్య శాంతి సౌహార్ద సంబంధాలు శాశ్వతంగా నెలకొని దృఢతరంకావాలనీ, ప్రపంచ శాంతి త్వరలోస్థాపించబడాలనీ సోవియటు పత్రికల్లో ఉద్ఘా టించబడుతుంది.

రాజ్యాంగచట్టంప్రకారం సోషలిస్టుసమాజ నిర్మాణానికి పునాదులైన ప్రాథమిక సూత్రాలను ఉల్లంఘించిన అసమర్థు లను నిర్భయంగా, నిర్మొగమాటంగా సోవియటు పత్రికలు విమర్శిస్తాయి. సోవియటు పత్రికలు ప్రజల విశ్వాసం, మన్నన పొంది, ప్రజల క్షేమంకొరకు ప్రజా ప్రతినిధులచే నడపబడే పత్రికలు.

---

### 73.—సోవియట్ యూనియన్‌లోవున్న నాటకశాలలేవి ?

సోవియట్‌యూనియన్‌లో 800 పైగా నాటకసంఘాలు, నాటకశాలలున్నాయి. ప్రపంచంలోకల్లా ప్రఖ్యాతి వహించిన రష్యన్ నాటకశాలను తలుచుకొని సోవియట్‌ప్రజలు గర్విస్తుంటారు. నేటి నాటకకళాక్షేత్రంలో సోవియట్ థియేటర్ ఉద్యమం అనన్యమైన విశిష్టతను ఆర్జించిందని ప్రపంచంలోని

నాటకకళావేత్తలంగీకరించిన విషయమే. మాస్కో ఆర్ట్ థియేటర్, మాలీ థియేటర్, బోల్షాయ్ ఒపేరా, బాలెట్ థియేటర్ పుష్కిన్ థియేటర్, కిరోవ్ ఒపేరా మొదలైనవి రష్యన్ నాటకశాలల్లో అతి ప్రాముఖ్యమైనవి. సోషలిస్టువిప్లవంతర్వాత స్థాపించబడ్డ నాటకసమాజాలన్నీ సోవియట్ రష్యాలోనేగాక, విదేశాల్లోగూడా ప్రజల, కళావేత్తల ఆదరాభిమానాలు సంపాదించాయి. వివిధరిపబ్లికుల్లోకూడా నవీనకళావైదగ్ధ్యం ఉట్టిపడే నటకులు, నాటకసంఘాలు, నాటకకళాశాలలూ వెలిశాయి. వీటితోపాటు సైనిక కేంద్రాల్లోగూడా నాటకశాలలున్నాయి. సైనికవిద్య, శిక్షణతోపాటు, వైజ్ఞానిక కళారంగాల్లోగూడా సోవియట్ సైనికులు యితర దేశ సైనికులకన్న ఎంతో ముందున్నారు.

రష్యనేతర జాతుల్లోగూడా ఊహాకందని కళాపిపాస అభివృద్ధిచెందింది. ఇదంతా సోవియట్ రాజ్యాంగం చలవవల్లనే. ఈనాడు సోవియట్ రష్యాలో 40 భాషల్లో నాటక ప్రదర్శనలివ్వబడుతున్నాయి. విప్లవానికి పూర్వం నాటక కళ అంటే ఒనమాలు తెలియని వెనకబడ్డ జాతుల్లోగూడా యీనాడు అపూర్వమైన అభివృద్ధికలిగింది. ఈ జాతులు నివసించే ప్రాంతంలో 30 వరకూ నాటకశాలలు ఉద్భవించాయి.

సోవియట్ రష్యాలో నాటక కళ ప్రజల అభ్యున్నతిని ప్రతిబింబించే మహత్తరకళగా పెంపొందుతున్నది. కనీసం ఒక్క నాటకశాలైనాలేని జిల్లాఅంటూ అక్కడలేదు. ఇవిగాక టూరింగ్ నాటకసంఘాలనేకం వెలిశాయి. ఈ నాటకసంఘాలు

మారుమూలలలోవున్న గ్రామాల్లోగూడా తమ ప్రదర్శనలను జరుపుతాయి.

మాస్కో, లెనిన్‌గ్రాడ్, ఆల్మా-అటా (కజక్‌స్థాన్) మొదలైన పట్టణాల్లో పిల్లల ఆనందం, విజ్ఞానం కొరకు ప్రత్యేకంగా నాటకసంఘాలు, నాటకశాలలు నిర్మించబడ్డాయి.

---

**74.-రష్యాలో ఏయే నాటకాలు, ఓపేరాలు, నృత్య గానాలు, గేయాలు ఉత్పత్తవుతున్నాయి?**

సోవియట్ నవీన నాటకరంగంలో వందలకొద్దీ నాటకాలు, నాటికలు, ఒపేరాలు, గేయాలు క్రొత్తక్రొత్త కళారూపాలతో ఆవిర్భవించాయి. సోవియట్ కళాభిమానులందరికీ యీ రచనలు అపరిమితానందాన్ని కలిగిస్తాయి.

ఆధునిక రచనలతోపాటు ప్రాచీన రష్యా రచయితలు యితర దేశాల రచయితలు ఉత్పత్తిచేసిన నాటకాలకు గూడా సోవియట్ ప్రభుత్వం ప్రముఖస్థానమిస్తుంది.

రష్యన్ గేయకారులు వ్రాసిన ''బోరిస్‌గోడ్యునోవ్'' అనే గొప్పనాటకాన్ని 'బోల్షాయ్ అకడమిక్ థియేటర్' అద్భుతంగా ప్రదర్శించింది. ఈ థియేటరుకు అనుబంధించబడ్డ నాటక బృందాలుగూడా యితర నాటకాలను అతిసమర్థంగా ప్రదర్శించాయి. ప్రపంచవిఖ్యాతిగాంచిన షేక్స్పియర్ నాటకాలను, ఇంగ్లండు దేశంలోకన్నా, రష్యన్ నాటకసంఘాలు అతిసమర్థంగా ప్రదర్శిస్తూవున్నాయి. అభ్యుదయకరమైన యే దేశపు నాట

కాలన్నా, ఏ కాలపునాటివైనాగానీ సోవియట్ ప్రజలు చెవి కోసుకుంటారు.

సోవియట్ నాటక కళారంగానికీ ప్రజల నిత్యజీవితానికీ సన్నిహితసంబంధంవుంటుంది. ఈనాడభివృద్ధౌతున్న ఏ సామాజిక రంగాన్నయినాగానీ, నాటక కళ ప్రతిబింబించకుండావుండదు. సోవియట్ నాటక కళ ప్రజలను దేశభక్తియుతులుగానూ, ఉదాత్తమైన నైతిక మానవతావాదులుగానూ రూపొందించడానికి కృషిచేస్తుంది. ఈనాటి క్లిష్టసమస్యలన్నిటికీ పరిష్కారమార్గం చూపుతూ రచించబడతాయి సోవియట్ నాటకాలూ, నాటికలూ.

ఇటీవలి ప్రజాయుద్ధకాలంలో సోవియట్ప్రజల్ని యెదుర్కొన్న అనేకవిషమసమస్యలు కథావస్తువుగా యేసుకోబడి ఉత్కృష్టనాటకరచనలు చేయబడ్డాయి. ఇలాంటి గ్రంథరచనలనెన్నింటినో ఉదాహరణగా పేర్కొనవచ్చు. (గ్రంథవిస్తరణ భీతిచే యీ ఉదాహరణలు వదిలెయ్యాక తప్పడంలేదు.) సోవియట్ సామాజికనిర్మాణంలో వివిధరంగాల్లో, వ్యక్తిపరంగానూ సమిష్టిగానూ యెలాంటిప్రతిభావంతమైన పాత్రనిర్వహిస్తున్నారో, యెట్టి అద్భుతవిజయాలు సాధిస్తున్నారో యీ నాటకాలు ప్రపంచానికి చిత్రిస్తున్నాయి. సోవియట్ యూనియన్‌లో గ్రామగ్రామాన, పట్టణపట్టణాన వందలసంఖ్యలోవున్న నాటకసమాజాలు యీ నాటకాల్ని రసపుష్టితో శక్తివంతంగా ప్రదర్శిస్తున్నాయి.

---

**75.—సోవియట్ రష్యాలో ప్రజాభిమానాన్ని పొందిన చలనచిత్రాలేవి?**

సోవియట్ జాతీయజీవనంలో చలనచిత్రాలు లీనమైపోయాయి. సోవియట్ సామాజికాభివృద్ధికి సోవియటు చలనచిత్రపరిశ్రమ ఒక ఘనమైన తార్కాణం. సోవియటు సినిమారంగం దేశభక్తిపూరితమైన అత్యుత్తమ చిత్రాలను నిర్మించింది. లెనిన్, స్టాలిన్‌వంటి సోవియట్ మహాపురుషుల జీవితవిశేషాలను యీ ఫిలిములు చిత్రిస్తాయి. "అక్టోబరులో లెనిన్", "1918 లో లెనిన్" "ప్రతిజ్ఞ"వంటి చిత్రాలనెన్నో తయారుచేసింది. సోవియట్‌ప్రజల చారిత్రకానుభవాలనాధారం చేసుకుని తయారుచేయబడే చిత్రాలమీద ప్రజలకెంతో అభిమానముంది. ఇలాంటి చిత్రాల్లో "అలెగ్జాండర్ నెవిస్కీ", 'పీటర్ దిగ్రేట్', 'ఇవాన్ ది టెర్రిబుల్' మొదలైనవి కొన్నిమాత్రమే. విజ్ఞానశాస్త్రవేత్తలయొక్క, రచయితలు, యితర ప్రముఖులయొక్క జీవితచరిత్రలను చిత్రించే ఫిలిములనేకం ఉద్భవించాయి. 1918-20 నాటి అంతర్యుద్ధంలో ప్రముఖపాత్రవహించిన జాతీయవీరుల చరిత్రలుగూడా వీటిల్లో వున్నాయి. 1920–1930 మధ్యకాలంలో తయారైన ప్రముఖ సోవియటు చలనచిత్రాలు యితరదేశాల్లోగూడా ఖ్యాతి గడించాయి. "బాటిల్‌షిప్ పొటెమ్‌కిన్", గోర్కీ నవలను ఆధారంచేసుకుని నిర్మించబడ్డ "అమ్మ" చిత్రం, మొదలైనవి విశ్వవిఖ్యాతి గడించిపెట్టాయి.

గత సోవియట్ ప్రజాయుద్ధకాలంలో, ప్రజలను దేశ రక్షణకు, దేశస్వాతంత్ర్యానికీ ఉత్తేజపరచే సినిమాలను సోవియట్ చలనచిత్రపరిశ్రమ యెన్నో తయారుచేసింది. వీటిలో ప్రధానమైనవి. 'రెయిన్‌బో', 'రష్యన్‌ప్రజలు', 'షి డిఫెండ్స్ హర్ కంట్రీ', 'ఇన్‌వేషన్', 'ఎంగ్‌గార్డ్', 'స్టాలిన్‌గ్రాడ్ యుద్ధం' "బెర్లిన్ పతనం' మొదలైనవి. జర్మన్ ఫాసిస్టుమూకలపైన ప్రజా శక్తులు యెంతటి ఘనవిజయాన్ని సాధించినవో ఉగ్గడిస్తూ యీ చిత్రాలు తీయబడ్డవి. యుద్ధానంతరం నూతన జీవిత నిర్మాణ కార్యక్రమాన్ని సోవియటు ప్రజలు యెలా కొనసాగిస్తున్నారో నిరూపించే అనేకచిత్రాలు తయారు చేయబడ్డాయి. సామ్రాజ్యవాద, పెట్టుబడిదారీ దేశాల్లో చిత్రాలమాదిరి సమాజంలోని నికృష్టతను, నైచ్యాన్ని, అవినీతిని సోవియటు సినిమాలు చిత్రించక, ఉదాత్తమైన మానవత్వాన్ని, మానవ ప్రేమను మాత్రమే చిత్రించి ప్రపంచ చలనచిత్ర పరిశ్రమకు కొత్తవెలుగు బాటలు నిర్మిస్తుంది.

అంతర్జాతీయ ఫిలిం పోటీల్లో యితర దేశాలకన్న సోవియట్ రష్యాకే యెక్కువగా బహుమతులొచ్చాయి. నూరుకు పైగా డాక్యుమెంటరీ చిత్రాలకు, విజ్ఞానశాస్త్ర చలన చిత్రాలకు స్టాలిన్ బహుమతులు గూడా యివ్వబడ్డాయి.

---

## 76.—సోవియట్ లో రచయితలసంఘం ఎలా నిర్మించబడ్డది ? దాని కార్యకలాపాలేవి ?

సోవియట్ రచయితల సంఘంలో, అన్ని జాతులకు చెందిన రచయితలు 3000 కు పైగా సభ్యులుగా ఉన్నారు. ఈ సంఘం పలుకుబడి, ప్రజాదరణ సంపాదించిన సంస్థ. "మానవాత్మకు రచయితలు ఇంజనీర్ల వంటివార" ని స్టాలిన్ పేర్కొన్నట్లు, వీరంతా సోవియట్ ప్రజల జీవితాన్ని ప్రతిబింబిస్తూ, వారి ఆశలను, ఆశయాలను ఉన్నది ఉన్నట్లుగా చిత్రిస్తారు. సోవియట్ రచయితలంటే ప్రజానీకం అమితగౌరవా దరణలతో చూస్తారు. సోవియట్ ప్రజల ఉన్నత నైతిక లక్షణాలను రచయితలు చిత్రిస్తారు. వారి మాతృదేశ స్వాతంత్ర్యాన్ని, ఆయురారోగ్య ఐశ్వర్యాభివృద్ధిని, విశ్వమానవ శాంతి కల్యాణాలనూ సోవియట్ రచయితలు ఆశయంగా పెట్టుకుని, ఆశయసాధనకై నిర్విరామకృషి చేస్తారు. సోవియట్ రచయితలు తమ అద్భుత సృజనాత్మక కళాశక్తితో కమ్యూనిస్టు సమాజ నిర్మాణంకొరకై నిర్విరామకృషి చేస్తారు. సోవియట్ కవిశేఖరుడైన టిఖోనోవ్ అధ్యక్షతక్రింద నడిచే సోవియటు శాంతి ఉద్యమంలో రచయితలు చురుకైన పాత్రనిర్వహిస్తున్నారు.

సోషలిస్టు విప్లవం అనేక జాతీయ భాషలు తలెత్తడానికి అభివృద్ధి కావడానికి సహాయపడ్డది. లిపులులేని కొందరు అల్ప సంఖ్యాకులకు సులువైన లిపులు పరిశోధించబడి రూపొందించబడ్డాయి. అనేక జాతుల ప్రజల్లో కలిగిన భాషాచైతన్యం

రాజకీయ చైతన్యం మూలంగా సులైమాన్ స్టాల్‌స్కీ వంటి ప్రజ్ఞానిధులైన కవు లుద్భవించారు. ఇతర ప్రజాసంస్థల వలెనే రచయితల ఉద్యమంగూడా కేంద్రసంఘం, స్వతంత్ర రిపబ్లికుల సంఘాలు, జిల్లా సంఘాలు, స్థానికసంఘాలంటూ దేశమంతటా వెలిసి సుసంఘటితమైనాయి. ఈ శాఖోపశాఖలన్నీ అఖిల సోవియటు రచయితల సమాఖ్యకు అనుబంధించబడతాయి. అఖిల సోవియటు రచయితల సమాఖ్యకు రహస్యబ్యాలెటుద్వారా యెన్నుకోబడ్డ ఒక కేంద్ర కార్యనిర్వాహక వర్గం పనిచేస్తుంది.

సోవియటు రచయితల సంఘం బహుముఖాలుగా తన కార్యక్రమాన్ని నిర్వహిస్తుంది. గద్య పద్య రచనలు, నాటకాలు, విజ్ఞానశాస్త్రం, బహుభాషల్లో రచనలు, బాలసాహిత్యం మొదలైన శాఖల్లో పరిశ్రమించి విజయం సాధిస్తుంది. సోవియటు రచయితల సంఘం బ్రహ్మాండమైన గ్రంథప్రచురణాలయాన్ని నడుపుతున్నది. మాస్కో, లెనిన్‌గ్రాడ్ వంటి మహానగరాల్లో అనేక సాహిత్య పత్రికలను గూడా ప్రచురిస్తున్నది. అనేక దినపత్రికలను గూడా వివిధ భాషల్లో సాగిస్తున్నది.

---

**77.—ప్రచురణాలయాలేమున్నాయి? బహుళసంఖ్యలో గ్రంథాలు ప్రకటించబడతాయా?**

సోవియట్ రష్యాలో 220 పెద్ద పెద్ద గ్రంథ ప్రచురణాలయాలున్నాయి. వీటిలో అధికభాగం, కల్పనా రచ

నలు, వ్యవసాయ, భూగోళ, వైద్యగ్రంథాలు, టెక్నాలజీకి సంబంధించిన వేర్వేరుశాఖలపై గ్రంథాలు ప్రకటిస్తాయి. ఇవిగాక రష్యన్ సైన్సు అకాడమీ, సోవియట్ రచయితలసంఘం, అఖిల సోవియట్ కార్మికసమాఖ్యల అధ్వర్యాన స్వతంత్రంగా పెద్ద పెద్ద గ్రంథ ప్రకటనాలయాలు పనిచేస్తున్నాయి. "యంగ్ కమ్యూనిస్టులీగ్'' అధ్వర్యాన నడిచే ఒక ప్రచురణాలయం పిల్లల అవసరాలకై గ్రంథాలను ప్రకటిస్తుంది. ఇదిగాక వివిధ తరగతుల వయస్సుగల బాలుర ఉపయోగానికై ప్రభుత్వాధిపత్యంక్రింద నడిచే ప్రచురణాలయాల్లో లక్షలకొద్దీ గ్రంథాలు అచ్చవుతాయి.

ప్రతి యూనియన్ రిపబ్లిక్‌లో నడపబడే ప్రచురణాలయాల్లోనూ అన్నిభాషల్లో గ్రంథాలు ప్రకటిస్తారు. కేంద్ర స్థానిక ప్రచురణాలయాలేకాక, విశ్వవిద్యాలయాలకూ, ఉన్నత విద్యాసంస్థలకూ విజ్ఞాన శాస్త్రసంస్థలకూ అనుబంధించబడ్డ ప్రచురణాలయాల్లో లక్షలాది గ్రంథాలు ప్రకటించబడుతున్నాయి. ఒక్క మాస్కోలోనే అలాంటి ప్రచురణశాఖలు 540 ఉన్నాయి.

సోవియట్ యూనియన్‌లో వాఙ్మయం 119 భాషల్లో ప్రకటించబడుతుంది. స్వదేశభాషల్లోనేగాక, ఇంగ్లీషు, ఫ్రెంచి, జర్మన్, స్పానిష్, యింకా యితర విదేశభాషల్లోగూడా అనేక విషయాలపై లక్షలాది గ్రంథాలు ప్రకటించ బడుతున్నాయి. భారీమొత్తంమీద ప్రకటించబడే గ్రంథాలు రష్యన్ ప్రజలకు అతి చౌకలో లభ్యమౌతున్నాయి. 1918—1950 మధ్యకాలంలో

9 లక్షల 70 వేల రకాల గ్రంథాలు మొత్తం 1250 కోట్లప్రతులలో ప్రకటించబడ్డాయి సోవియట్ రష్యాలో.

జార్ కాలంనాటి రష్యాలో ప్రతి పదిమందికి 7 గురికి సరిపోనుమాత్రమే పుస్తకాలు లభించేవి. ఈనాడు ప్రతివ్యక్తికీ చాలినన్ని పుస్తకాలు చౌకధరలో సప్లైచేయబడుతున్నాయి. 1913 లో ప్రతి గ్రంథం 3300 ప్రతుల్లో ప్రకటిస్తే, 1952 లో 1,20,000 ప్రతుల్లో అచ్చవుతున్నది. ఈ లెక్కలనుబట్టి సోవియట్ రష్యాలో సాహిత్య, కళా, సంస్కృతీతృష్ణ ఎంత అధికమౌతున్నదో స్పష్టమౌతుంది. 1950 లో ప్రకటితమైన గ్రంథాలు 1940 నాటికన్న నూటికి 84 వంతులకు పైగా వున్నాయి.

రాజకీయ, సాంఘిక, ఆర్థిక సాహిత్యం ప్రకటించడంలో ప్రభుత్వం ఎక్కువశ్రద్ధ వహిస్తుంది. 13 సంవత్సరాల్లో సోవియట్ కమ్యూనిస్టుపార్టీ చరిత్రగ్రంథాలు 61 భాషల్లో 4 కోట్ల ప్రతులు ప్రకటించబడ్డాయి; అన్నీ పూర్తిగా అమ్ముడుపోయినై. దీన్నిబట్టే రాజకీయచైతన్యస్థాయిలో సోవియట్ ప్రజలు అగ్రగణ్యులని చెప్పాలి. ఇటీవల లెనిన్ రచనలసంపుటి, 35 సంపుటాలుగా నాల్గోముద్రణ వేయబడ్డది. స్టాలిన్ రచనలసంపుటి 12 సంపుటాలుగా ముద్రించబడ్డది. సమకాలికులైన సోవియట్, యితరదేశాల రచయితల గ్రంథాలు అనేక సంపుటాలతో లక్షలకొలది ప్రతులు ప్రకటించబడుతున్నాయి. సోవియట్ రాజ్యాంగం అమల్లోకివచ్చాక, రష్యన్ మహాకవి పుష్కిన్ గ్రంథాలు 80 దేశీయభాషల్లో 6 కోట్ల ప్రతులు ప్రకటించ

బడ్డాయి. గొగోల్ రచనలు 38 భాషల్లో 2 కోట్ల ప్రతులు అచ్చయినాయి. లియోటాల్‌స్టాయ్ గ్రంథాలు 71 భాషల్లో 7 కోట్ల 40 లక్షల ప్రతులు ప్రచురితమైనాయి. గోర్కీ రచనలు 14 భాషల్లో 6 కోట్ల ప్రతులు, షోలకోవ్ రచనలు 53 భాషలలో 1 కోటి 80 లక్షల ప్రతులు ప్రకటించబడ్డాయి.

---

## 78. సోవియట్ రష్యాలో ప్రచురించబడే విదేశీయ గ్రంథ రచనలేవి ?

లోన మేధాశక్తితో మానవుడు సృష్టించే ఉత్తమ రచనలన్నిటినీ ప్రచురించడానికి సోవియట్ ప్రభుత్వం శక్తినంతా ధారపోస్తుంది. ఏ దేశానికి, యే జాతికి చెందిన రచయితలైనా గానీ సోవియట్ ప్రభుత్వంచేత సమానగౌరవాదరణలు పొందుతారు. డెమాక్రిటస్, అరిస్టాటిల్, వోల్టేర్, డిడెరాట్, హెల్వీషియస్, హోల్‌బాక్, స్పినోజా, డెస్‌కార్టెస్, ఫ్యూర్‌బాకు, డార్విన్, న్యూటన్, ఈన్‌స్టీన్ వంటి యితరమేధావుల మహత్తర రచనలను సోవియటు ప్రభుత్వం లక్షలాది ప్రతులను ప్రకటిస్తుంది. విదేశాలకుచెందిన పూర్వాధునికకవుల ఉత్తమ రచనలు సోవియటు యూనియన్‌లో విరివిగా పఠిస్తారు. 1917–1948 మధ్య ఫ్రెంచిరచయితలు వ్రాసిన గ్రంథాలు 4 కోట్ల 80 లక్షల ప్రతుల్లో ప్రకటించారు; అమెరికన్ గ్రంథకర్తలు రచించిన పుస్తకాలు 4 కోట్ల ప్రతులు అచ్చువేశారు.

బ్రిటిష్ రచనలు 2 కోట్ల 70 లక్షల కాపీలు ప్రకటించారు. విదేశ రచయితలు వ్రాసిన అనేక గ్రంథాలను, వారి వారి దేశాల్లో ప్రకటించే ప్రతులకన్న యెక్కువ ప్రతులను సోవియటు ప్రభుత్వం ప్రకటించింది. 1919-1951 మధ్య విక్టర్ హ్యూగో రచించిన గ్రంథాలు 41 భాషల్లో 65 లక్షల ప్రతుల్లో ప్రకటించబడ్డాయి. గైడిమపాసాచే రచించబడ్డ గ్రంథాలు 47 లక్షల కాపీలు అచ్చయినాయి. బల్జాక్, రొమెయిన్ రొలాండ్, బార్బూస్, జోలా, డికెన్సులు వ్రాసిన గ్రంథాలు ఒక్కొక్కటి 30 లక్షలు ప్రకటించబడ్డాయి.

షేక్స్పియర్ గ్రంథాలు 20 భాషల్లో 21 లక్షల 78 వేల ప్రతుల్లో అచ్చయినాయి. వెల్స్, కిప్లింగ్ రచనలు 30 లక్షల కాపీలు ప్రకటితమైనాయి.

సోవియటు ప్రచురణాలయాలు సుప్రసిద్ధులైన అమెరికన్ రచయితలు జాక్ లండన్, మార్క్‌ట్వెయిన్, ఫెనిమోర్ కూపర్, థియొడోర్ డ్రెయిజర్, హొవార్డ్ ఫాస్ట్, ఆల్బర్ట్ మాల్ట్స వ్రాసినగ్రంథాలను కోట్లప్రతులలో ప్రకటిస్తున్నాయి.

---

**79. సోవియట్‌లో రేడియో ప్రచారం ఎలా నిర్వహించబడుతుంది?**

**1895** లో సుప్రసిద్ధ రష్యన్ విజ్ఞానశాస్త్రవేత్త ఎ. యస్. పొపొవ్ రేడియో ప్రసార విధానం కనిపెట్టాడు. విజ్ఞానశాస్త్రంలోనూ, యింజనీరింగు శాస్త్రంలోను యిదొక

నూతన దశకు మార్గం వేసింది. పొపోవ్ కన్న ఆలస్యంగా యీ రంగంలో ప్రవేశించిన మార్కొనీ రేడియో ప్రసారం కనిపెట్టిన ఘనత తనకే రావాలని ప్రయత్నించాడు. కాని 1900లో అంత ర్జాతీయ టెక్నికల్ ప్రదర్శనశాలలో (పారిస్) పొపోవ్‌కు ఒక బంగారు పతకం, ఒక డిప్లొమా బహూకరించబడ్డాయి. 1908 లో సర్ ఆలివర్ లాడ్జ్‌తో కూడిన అంతర్జాతీయ నిపుణుల కమిషన్ పొపోవ్‌ను రేడియో నిర్మాతగా గుర్తించి స్థిరపరచింది.

1919 లో లెనిన్ ఆదేశానుసారం ప్రపంచంలో మొదటి సారిగా సోవియట్ యూనియన్‌లో రేడియో స్టేషన్ నిర్మించ బడ్డది. సోవియట్ రష్యాలో మారుమూల ప్రాంతాల్లోగూడా శక్తివంతమైన రేడియో స్టేషన్లు నిర్మించబడ్డాయి. ఈ స్టేషన్ల ద్వారా అన్ని భాషల్లోనూ ప్రసారం చేయబడుతుంది. వార్తా ప్రసారమేకాక నాటకాలు, నాటికలు, జానపదాలు, గేయాలు, క్రీడావినోదాలుగూడా ప్రసారం చేయబడతాయి. మాస్కో నాటకశాలల్లో ప్రదర్శించబడే నాటకాలను "టెలివిజన్" ద్వారా సోవియట్ ప్రజానీకాని కందజేస్తారు. రష్యాలోకల్లా ముఖ్యమైన మాస్కో స్టేషనునుంచి ఒకే సమయంలో 70 రకా లైన రేడియో ప్రసారాలు చేస్తుంది. రిపబ్లికుల్లోను, ప్రాంతీయ సోవియట్లలోను స్థాపించిన స్టేషన్లు వాటి వాటి స్వంతభాషల్లో ప్రసారం జరుపుతాయి. ప్రజా సంస్థలుగానీ, పౌరులుగానీ సోవి యట్ రేడియో కేంద్రాలను ఉపయోగించుకోవచ్చు.

లాభార్జనకొరకు ఉపయోగించే రేడియో విధానం రష్యాలో లేదు. అక్కడి రేడియోలన్నీ ప్రజల ఆస్తులు. ప్రజల

విజ్ఞానాభివృద్ధికీ శాంతి సాధనకు ఉపయోగపడటమే వీటి ప్రయోజనం.

---

**10. సోవియట్ రష్యాలో యెన్ని గ్రంథాలయాలున్నాయి. అవి ఏవేవి?**

సోవియట్ రష్యాలో మూడులక్షల 50 వేల గ్రంథాలయాలున్నాయి. వీటిలో ఉన్న గ్రంథాల సంఖ్య 70 కోట్లు. అన్ని గ్రంథాలయాల్లోనూ ప్రజలు ఉచితంగా చదువుకోవచ్చు. 1914 లో రష్యాలో 12500 గ్రంథాలయాలు మాత్రమే ఉండేవి. మాస్కోలోని 'లెనిన్' స్టేట్ లైబ్రరీలో 1 కోటి 40 లక్షల గ్రంథాలూ, బైండుచేసిన వార్తాపత్రికలు, సంచికలు ఉన్నాయి. లెనిన్‌గ్రాడ్ 'సాల్టికోవ్ స్టేట్ లైబ్రరీలో 1 కోటి గ్రంథాలున్నాయి. ఈరెండూ ప్రపంచంలోకల్లా పెద్దవి. ఇవికాక యితర నగరాల్లోకూడా పెద్దపెద్ద గ్రంథాలయాలున్నాయి. అచ్చు గ్రంథాలతోపాటు పూర్వ సాహిత్యానికి సంబంధించిన అముద్రితములైన వ్రాతప్రతులు వేలసంఖ్యలో ఉన్నాయి. వీటిలో నలభై గ్రంథాలయాలకు వివిధ ప్రచురణాలయాలు, పత్రికాధిపతులనుండి ఒక్కొక్క ప్రతి చొప్పున ఉచితంగా సప్లయిచేయబడతాయి. వివిధ రిపబ్లికుల్లోను, జిల్లాల్లోనూ, పట్టణాల్లోనూ, గ్రామాల్లోనూ లక్షలకొలది గ్రంథాలయాలు స్థాపించబడ్డాయి. జిల్లాలలోను, పట్టణాలలోను గల గ్రంథాలయాలకు ప్రభుత్వమే గ్రంథాలను ఉచితంగా సప్లయిచేస్తుంది.

బహుభాషల్లో, పూర్వ, ఆధునిక గ్రంధాలను సేకరించిన సెంట్రల్ లైబ్రరీలనుండి అవసరమైనప్పుడల్లా స్థానిక లైబ్రరీలు గ్రంధాలను తాత్కాలికంగా ఉపయోగించుకుని తిరిగి వాటికి యివ్వవచ్చు. విద్యాలయాలకు పోయే వయస్సులేని బాలుర ఉపయోగంకోరకు గూడా పట్టణ, జిల్లా గ్రంధాలయాల్లో ప్రత్యేక గ్రంధాలు సేకరించి ఉంచబడతాయి. ఈ గ్రంధాలయాల్లో వైజ్ఞానిక శాస్త్ర, సాంకేతిక పరిజ్ఞానాన్ని ప్రబోధించే ప్రత్యేక గ్రంధాలుగూడా ఉంటాయి.

ఇవేగాక కార్మికసంస్థలు, సమిష్టి వ్యవసాయ క్షేత్రాలు వాటికి సంబంధించిన వేర్వేరు శాఖల్లో వేలకొద్దీ గ్రంధాలయాలను నిర్మించుకొన్నాయి. ఇవి యేటేటా అభివృద్ధి చెందుతున్నాయని వేరే చెప్పనక్కరలేదు.

---

**81. సోవియట్ రష్యాలోని వస్తుప్రదర్శనశాల లేవి?**

ప్రతిపట్టణంలోనూ, జిల్లా కేంద్రాలలోనూ, చారిత్రిక, ప్రకృతిశాస్త్రాలకు సంబంధించిన వస్తు ప్రదర్శనశాలలున్నాయి; భాషా శాస్త్రాలకు, చిత్రకళ, శిల్పకళలకు సంబంధించిన వస్తు ప్రదర్శనశాలలుగూడా దేశ వ్యాపితంగా ఉన్నాయి. పురాతత్వ వస్తు ప్రదర్శనశాలలు ప్రధాన కేంద్రాలన్నిటిలోనూ స్థాపించబడ్డాయి. దేశంమొత్తంలో యిలాంటి మ్యూజియములు వెయ్యికిపైగా ఉన్నాయి.

మాస్కోలోని లెనిన్ మ్యూజియంలను నిత్యా వేల మంది ప్రజలు దర్శిస్తారు. ఈ మ్యూజియములో ప్రదర్శించబడే అమూల్యమైన పత్రాలు, యితర వస్తువులు సోవియట్ సమాజ నిర్మాత లెనిన్ మహత్తర జీవితాన్ని, ఆయనకృషిని ప్రతిబింబిస్తాయి. ఈ వస్తుప్రదర్శనశాలకు అనేకపట్టణాల్లో శాఖలుగూడా ఉన్నాయి.

స్టాలిన్ జన్మించి బాల్యావస్థ గడిపిన జార్జియారాష్ట్రం లోని ఆయన యింటిని దర్శించడానికి దేశం నలుమూలలనుండీ వేలకొలదిగా ప్రజలు వస్తూఉంటారు. ప్రజాభిప్రాయాన్ని మన్నించి రచయితలు, గాయకులు, విజ్ఞానవేత్తలు కళాశాస్త్రజ్ఞులు మొదలైన ఉత్కృష్టపురుషులయొక్క స్వంత భవనాలను, ఆస్తులను సోవియట్ ప్రభుత్వం వస్తు ప్రదర్శనశాలలుగా మార్చింది. లియోటాల్‌స్టాయ్, చెయికోస్కీ, పుష్కిన్, సిమోల్‌కోవిస్కీ మొదలైన ఉత్తమపురుషుల సంపదయావత్తూ యినాడు కళాసంస్థలుగా మార్పుచెంది విలసిల్లుతున్నాయి. ఇవి గాక నిరంకుశులైన పూర్వపు రాజుల రాజభవనాలు గూడా యీ విధంగానే మారాయి.

సోవియట్ ప్రజల గర్వకారణమైన ప్రాచీనశిల్ప, చిత్ర కళాఖండాలు యీ నాడు వస్తుప్రదర్శనశాలల్లో ప్రజాదరణ పొందుతున్నాయి. పూర్వయుగాలనాటి ప్రజల జీవితాన్ని, సంస్కృతీ సంప్రదాయాలను ప్రతిబింబించే యీ కళాఖండాలు ప్రపంచంలోకల్లా ప్రధాన శ్రేణికి చెందినవని అంగీకరించబడ్డది. చారిత్రిక వస్తుప్రదర్శనశాలల్లో అమూల్యమైన చారిత్రక

సంఘటనలు, చారిత్రిక ఘట్టాలు, విప్లవ పోరాటాలను చిత్రించిన కళాఖండాలను యీనాడు దర్శించవచ్చు. విజ్ఞానశాస్త్రవస్తు పరిదర్శనశాలల్లో పురాతత్వశాస్త్రం, భూగర్భశాస్త్రం విజ్ఞాన శాస్త్రం సాంకేతిక శాస్త్రాలకు సంబంధించిన విశిష్టమైన కళాఖండా లనేకం పరిదర్శించబడుతున్నాయి. ఇవన్నీ గూడా విశ్వవిద్యాలయాలచేత, విజ్ఞానశాస్త్రసంస్థలచేత పోషించబడు తున్నాయి. ఇతర వస్తుపరిదర్శన శాలలవలెనే వీటినికూడా ప్రజలు ఉపయోగించుకుంటున్నారు. సాధారణంగా అన్ని ప్రదర్శనశాలలకు ప్రవేశం ఉచితమే అయితే ఒకవేళ డబ్బు చెల్లించవలసివస్తే, అది నామమాత్రంగానే ఉంటుంది. ప్రదర్శన శాలలను దర్శించేవారి సహాయంకొరకు, అక్కడ చూడవలసిన వస్తువులనుగురించి వివరించుటకూ సమర్థులైన వ్యక్తులు నియ మించ బడతారు.

---

## 82. సోవియట్ గ్రామాల్లో వున్న సాంస్కృతిక సంస్థలేవి?

సోవియట్ గ్రామీణ ప్రాంతాల్లో 1 లక్షా 50 వేల క్లబ్బులు, గ్రంథ, పఠనాలయాలు, 4000 సంస్కృతీ భవనాలు నిర్మించబడ్డాయి. ఈ సంస్థలన్నీ ప్రజలకు కావలసిన విద్యా విజ్ఞాన, సంస్కృతిక కార్యకలాపాలను కొనసాగిస్తున్నాయి. ఈసంస్థల ఆధ్వర్యంక్రింద సాహిత్యం, కళోద్ధరణ గూడా నిర్వహించ బడుతుంది. ఒక్క రష్యన్ సోషలిస్టు

రిపబ్లికులోనే అవతరించిన అమెచ్యూర్ నాటక సంఘాల్లో 5 లక్షలమంది సభ్యులున్నారు. 1949 తో పోల్చి చూచుకుంటే యీ రష్యన్ రిపబ్లికులో క్లబ్బులసంఖ్య మూడింతలు పెరిగింది. యుద్ధానంతరం అనేక గ్రామాల్లో ఉపన్యాసా లేర్పాటుచేసే సంస్థలు అవతరించాయి. వివిధ విషయాలమీద ప్రముఖులచేత గ్రామసీమల్లో ఉపన్యాసా లిప్పించబడతాయి. ఒక్క ఉక్రెయిన్ రిపబ్లికులో 1950 లో యిలాంటి సంస్థలు 10,000 స్థాపించబడ్డాయి. వివిధరంగాల్లో ఉత్తీర్ణులైన ఉపన్యాసకులు ఒక లక్ష మంది వరకు తర్ఫీదైనారు.

---

## ౬3.—సోవియట్ ప్రజల్లో క్రీడావినోదాలయందు ఆసక్తి ఉన్నదా ?

లక్షలాదిప్రజలు క్రీడావినోదాల్లో పాల్గొంటారు. కార్మికులు, సమిష్టి వ్యవసాయదార్లు, బాలబాలికలు, వైజ్ఞానశాస్త్రజ్ఞులు, రచయితలు, కళాకారులు—ఒకరేమిటి, అన్ని వృత్తి, వ్యాపారాల్లో నిమగ్నులైనవారికీ, పిల్లలకూ, పెద్దలకూ, క్రీడావినోద సంస్థల్లో పాల్గొనే హక్కున్నది. ఈ సంస్థలసభ్యత్వం ఏటేటా పెరుగుతున్నదిగూడా. ఒక్క 1950 లోనే 30 లక్షల మంది ప్రజలు అదనంగా సభ్యులైనారు.

క్రీడావినోదాలకు, వాటికవసరమైనభవనాలు, యితర సాధనాలు, ఆటస్థలాలు నిర్మించుటకు ప్రభుత్వం పెద్దమొత్తాలు ఖర్చుచేస్తుంది యేటేటా. ప్రత్యేకసౌకర్యాలతో నిర్మించిన

ఆటస్థలాలు, వినోదకేంద్రాలు 'స్టేడియములు', యీతనేర్చు కొనే చెరువులు ఫ్యాక్టరీల్లోను, సమిష్టి వ్యవసాయ క్షేత్రాల్లోను, విద్యాసంస్థల్లోనూ అనేకమున్నాయి. అన్నిటిలో ఉచితంగా పాల్గొనవచ్చు.

ప్రతి క్రీడారంగంలోను ప్రతిసంవత్సరం యెన్నో పోటీలు జరుగుతాయి. సోవియట్ ఆటగాండ్రు క్రీడావినోద సంస్థల్లో సభ్యులుగాచేరి, సమిష్టికృషిద్వారా తమ నైపుణ్యాన్ని అధికం చేసుకుంటారు.

గ్రామీణప్రాంతంలోగూడా 20 లక్షలమంది ప్రజలు తమ క్రీడాసంస్థల్లో సభ్యులుగావున్నారు. సమిష్టి వ్యవసాయ కార్మికుల్లో క్రీడావినోదాల్లో ఉత్తీర్ణులై బిరుదులు, పతకాలు, యితర బహుమానాలుపొందినవారు అనేకంగా ఉన్నారు. ఈ గ్రంథం వ్రాసేటప్పటికి అంతర్జాతీయపోటీలలో పాల్గొని ప్రథమ బహుమతులుపొందిన సోవియట్ ఆటగాండ్ర సంఖ్య 70 మంది వరకు పెరిగింది. 1951 లోనే యీ ఆటగాండ్రు సోవియట్ యూనియన్‌లో 531 మంది ప్రథమబహుమతులు సంపాదించు కున్నారు. వీరిలో 53 మంది ప్రపంచపోటీల స్థాయినిగూడా మించి పురోగమిస్తున్నారు.

చదరంగ పోటీలో ప్రపంచంలోకల్లా సోవియట్ స్త్రీ, పురుషులదే అగ్రస్థానం. వాలీబాల్, స్కేటింగు, యితర పోటీలలో సోవియట్ ఆటగాండ్రకే ప్రథమస్థానం లభించింది. ఈ ఆటల పోటీలలో స్త్రీలు అతిసమర్థంగా పాల్గొని ప్రపంచ పోటీల్లో గూడా బహుమతులు పొందుతున్నారు.

క్రీడా వినోదాల్లో ప్రత్యేక నైపుణ్యం సంపాదించటానికి తర్ఫీదిచ్చే ట్రెయినింగు శాఖలు ప్రతి విద్యాసంస్థలోనూ, పారిశ్రామిక సంస్థలోనూ, సమిష్టి వ్యవసాయ క్షేత్రంలోనూ ఉన్నాయి. సోవియట్ ప్రజల నైతిక, మానసిక, శారీరక పాటవాన్ని పెంపొందించుకోడానికి శారీరక వ్యాయామ, క్రీడావినోదాలు సోవియట్ రష్యాలో ప్రముఖపాత్ర నిర్వహిస్తున్నాయి.

---

| |
|---|
| 84.—క్రీడావినోదాలు వృత్తిగాగల ఆటగాండ్రు సోవియట్‌లో ఉన్నారా? |

అలాంటివారు సోవియట్ యూనియన్‌లో లేరు. సోవియట్ ఆటగాండ్రు తన శక్తినైపుణ్యాలను అమ్ముకొని లాభం ఆర్జించరు. వ్యక్తిస్వార్థంకన్న సమిష్టి ప్రయోజనాలనే ప్రధానమైనవిగా పాటిస్తారు. తమ తీరిక సమయాల్లో, తమ యిష్టంవచ్చిన క్రీడా వినోదాల్లో పాల్గొంటారు. సోవియట్ ఆటగాండ్రంతా వారి వారి ప్రత్యేక క్రీడావినోద సంస్థల్లో సభ్యులుగా చేరి భారీ యెత్తుమీద జరిగే పోటీల్లో చురుకుగా పాల్గొంటారు.

| |
|---|
| 85.—ప్రతిఫలాపేక్షలేని కళా, గాన, నాటక, నృత్య సంస్థలయెడల ప్రజాదరణ యెలావుంటుంది? |

ఈ సంస్థల యెడల సోవియట్ ప్రజలకు ఆదరాభిమానాలుమెండు. నాటకబృందాలు, సంగీత, నృత్యసభలు లేని

సంస్కృతీ సంస్థలుగానీ, ఫ్యాక్టరీలుగానీ, సమిష్టి వ్యవసాయ క్షేత్రాలుగానీ సోవియట్ రష్యాలో లేవు. కళోపాసనవృత్తిగా లేని సంఘాలు సోవియట్ రష్యాలో 2 లక్షలున్నాయి. వాటి సభ్యత్వం 40 లక్షల వరకున్నది. 1950 లో నాటక, సంగీత, నాట్యప్రదర్శనలు మొదలైనవి 5 లక్షలసార్లు జరిగాయి. 10 కోట్లమంది ప్రజలు వీటిని దర్శించారు. ఒస్ట్రోవస్కీ, గోర్కీ, చెకోవ్, షేక్సిపియర్, లోప్‌డివేగా, స్క్రైబ్ మొదలైన ఉత్తమ రచయితలు వ్రాసిన నాటకాలూ, అధునిక సోవియట్ నాటకాలూ ప్రదర్శించబడుతున్నాయి. అనేక రష్యన్, యితర దేశాల పూర్వాధునిక గానకళావేత్తలు రచించిన గేయాలు, ఘణతులు సోవియట్ ప్రజలు విని ముగ్ధులౌతారు.

నాటకాభినయం, గాన కళోపాసన వృత్తికాగల సోవియట్ పౌరులు, కళారాధన అభిమాన వస్తువుగాగల వారికి ఆర్థికంగానూ, యితర విధాలా సహాయపడతారు.

---

**86.—నటకులు, నృత్యగాండ్రు, సంగీత శాస్త్రజ్ఞులూ ఎలా తర్ఫీదు పొందుతారు?**

వివిధ కళారంగాల్లో స్వతస్సిద్ధంగా అభిరుచిగల బాలురకు, సెకండరీ విద్యావిధానం ప్రత్యేక విద్యాలయాల్లో బోధించబడుతుంది. ఇతర విషయాలతోపాటు, అభిమానంగల, వీణ, ఫిడీల్,పియానో, మొదలైన వాయిద్యాలలో ప్రత్యేక ప్రాథమిక తర్ఫీదివ్వబడుతుంది. ఇలాంటి విద్యా

లయాలు రష్యాలో వందలకొద్దీ ఉన్నాయి. నాటకాభినయం, సంగీతం మొదలైన కళల్లో ప్రత్యేక సెకండరీ కోర్సులను బోధించే విద్యాలయాలు వందకుపైగా ఉన్నాయి. కొన్నివిద్యాలయాలు పెద్ద నాటక సంస్థల యాజమాన్యాన నిర్వహించబడుతున్నాయి.

నాటకకళకు అవసరమైన ప్రత్యేక సిబ్బందికై, కళోపాసకులకు ప్రత్యేక ఉన్నత విద్యలో తర్ఫీదిచ్చే సంస్థలు రష్యాలో 22 ఉన్నాయి. వీటిలో మరీ పెద్దవి మాస్కో, లెనిన్‌గ్రాడ్ నగరాల్లో ఉన్నాయి. ఈ సంస్థలు యితర గానకళా పాఠశాలలకు సహాయం అందించడంతోపాటు ముఖ్యంగా రష్యనేతర రిపబ్లికుల్లోని పాఠశాలలకై ప్రత్యేక శ్రద్ధవహిస్తాయి. యూనియన్ రిపబ్లికుల్లోనూ, స్వతంత్రి రిపబ్లికుల్లోనూ గల సంగీత విద్వాంసులకూ, యితర కళారాధకులకు తర్ఫీదివ్వడానికై ప్రత్యేక స్టూడియోలుగూడా నిర్మించబడ్డాయి. సినిమటోగ్రఫీలోనూ, సినిమా నటనలోనూ, నాటకాభినయంలోనూ ప్రత్యేక తర్ఫీదిచ్చే ఉన్నత విద్యాకేంద్రాలుగూడా ఉన్నాయి. చిత్రలేఖనం, శిల్పకళ మొదలైన లలితకళల్లో గూడా చక్కటి తర్ఫీదివ్వబడే స్కూళ్లు, కాలేజీలున్నాయి. లెనిన్ గ్రాడ్‌లో బ్రహ్మాండమైన ఒక ఆర్ట్ ఎకాడమీగూడా స్థాపించబడ్డది. ప్రపంచంలోకల్లా ప్రథమ శ్రేణి నలంకరించే కళావేత్త లీనాడు సోవియట్ యూనియన్ సృష్టించింది.

---

## 87. సంస్కృతిభవనాలు, సంస్కృతి, వినోద, విశ్రాంతి ఆరామాలు, పార్కులు అంటే ఏమిటి?

పెద్దపెద్ద ఫ్యాక్టరీలకు, పారిశ్రామిక మండలాలకు అనుబంధించబడ్డ బ్రహ్మాండమైన క్లబ్బులను "సంస్కృతీ భవనాలం"టారు. ఈ భవనాలను ట్రేడ్ యూనియన్లు నిర్వహిస్తాయి. ఉదాహరణకు మాగ్నిటగోర్స్క్ ఇనుము ఉక్కు పరిశ్రమలో వున్న సంస్కృతీభవనంలో ఒక నాటక, నృత్య, గాన శాఖ, ఒక లైబ్రరీ, ఒక లెక్చర్ హాల్, ఒక ఇంజనీరింగుహాల్ ఒక సినిమాహాల్ మొదలైనవి వున్నాయి. ఈ భవనంలో కళావేత్తలు తమ కార్యకలాపాలను కొనసాగిస్తారు. పిల్లలకు ప్రత్యేక సౌకర్యాలుకూడా ఏర్పాటు చేయబడ్డాయి.

సంస్కృతీ, వినోద, విశ్రాంతి, క్రీడారామాలు నగరాల్లోనూ, పట్టణాల్లోనూ నిర్మించబడతాయి. ప్రభుత్వ, సమిష్టి వ్యవసాయక్షేత్రాల్లోగూడా స్థాపించబడతాయి. ప్రజల వినోదాల కవసరమైన ఆటల పరికరాలు, ఆటస్థలాలు, సినిమాశాలలు, యితర కళాకేంద్రాలుగూడా యేర్పరచబడతాయి.

ఇలాంటి సంస్కృతీ క్రీడారామాల్లోకల్లా మాస్కోలో వున్న "గోర్కీపార్కు ఆఫ్ కల్చర్ అండ్ రెస్ట్" చాలా పెద్దది. ఒక మైలువరకు విస్తరించిన యీ ఆరామం మోస్క్వా నది మీద నిర్మించబడ్డది. వసంతకాలంలో వేలకొద్దీ మాస్కో పౌరులు దీనిలో వినోదంగా కాలం వెళ్ళబుచ్చుతారు.

సోవియట్ యూనియన్‌లో అమలుజరుగుతున్న సోషలిస్టు పరిణామాలే నూతనంగా రూపొందుతున్న నగర నిర్మాణాలలో ప్రతిబింబిస్తున్నాయి. బోల్షివిక్ విప్లవం నాటినుండీ రష్యాలో 1280 పట్టణాలు పునర్నిర్మించబడి, 400 కొత్తనగరాలు ఉద్భవించాయి. దూరప్రాచ్యంలో ఆమూర్ నదీతీరాన నూతనంగా నిర్మాణమైన కొమ్సోమోల్స్క్ అనే నగరానికి 20 సంవత్సరాలక్రింద పునాదులువేయబడ్డాయి. ఈ మహానగరంలో యినుము ఫ్యాక్టరీలు, మిల్లులు, 35 విద్యాలయాలు, 16 క్లబ్బులు, 80 గ్రంథాలయాలు, ఒక నాటకశాల, ఒక సంస్కృతీభవనం, 11 ఆస్పత్రులు, ఒక స్టేడియం, రెండు సంస్కృతీ, విశ్రాంతి ఆరామాలు వెలసాయి. 15 సంవత్సరాలకిత్రితం. నిర్జనమైన తెల్ల సముద్రతీరంలో ఒక పాడుబడ్డ మఠంవద్ద సెలాటోస్క్ అనే నగరం నిర్మాణమైంది. ఆర్కేంజిల్ ప్రాంతాల్లో అవతరించిన పెద్దనగరాల్లోకల్లా యిది రెండవది. ఆర్కిటిక్ తీరంలో టండ్రా యెడారి మధ్యభాగంలో కిరోవ్స్క్ అనే నూతననగరం ఆవిర్భవించింది. దానికి ఉత్తరంగా వార్కుటా, నారిల్స్క్, ఇగర్కా అనే మహానగరాలు కొత్తగా నిర్మించబడ్డవే.

ఊరల్స్ దక్షిణప్రాంతాల్లో గల కొండల సమీపాన మాగ్నిటగార్స్క అనే మహానగరం సోవియట్ రష్యాలో గల

అతి అధునికనగరాల్లో ఒకటి. సైబీరియాఎడారుల్లో యీనాడు డజన్లకొద్దీ కొత్తపట్టణాలు సకల సౌకర్యాలతో సౌభాగ్యసంపదలతో విలసిల్లుతున్నాయి. గృహనిర్మాణం యీనాడు రష్యాలో దేశవ్యాపితంగా భారీయెత్తున జరుగుతోంది. 1951లో పట్టణాల్లోగానీ పారిశ్రామిక క్షేత్రాల్లోగానీ, 29 కోట్ల చదరపు అడుగుల వైశాల్యంగల గృహనిర్మాణం జరిగింది. మాస్కో నగరం, యూనియన్ రిపబ్లికులల్లోని రాజధానీనగరాలు ప్రపంచం లోకల్లా అత్యంత సుందరనగరాలుగా నిర్మించబడుతున్నాయి. 16 సంవత్సరాలనాడు స్టాలిన్ తయారు చేసిన ప్లాను ప్రకారం, మాస్కో మహానగర నిర్మాణం కొనసాగుతున్నది. నిర్మాణంలో చాలాభాగం పూర్తయిందిగూడా. వెడల్పైన నూతన రాజమార్గాలు, అందమైనకట్టడాలు, పార్కులు, క్లబ్బులు, నాటకశాలలు మొదలైన సకల సౌకర్యాలతో మాస్కో నగరం నిర్మాణమైంది. భూగర్భ రైలుమార్గాలు, ఎలిక్ట్రిక్ స్టేషన్లు, ఫ్యాక్టరీలు, వాటికనువైన స్థలాల్లో ప్లాను ప్రకారం నిర్మించబడ్డాయి. 1951 లో ఆకాశమార్గాన్ని అంటే దివ్యభవనాల నిర్మాణం ఆరంభమైంది. ప్రపంచంలోకల్లా అందమైన భూగర్భ రైలుమార్గం మాస్కోలో వెలిసింది.

ఈ గృహనిర్మాణమంతా జాతీయ ఆర్థికప్లానులో అంతర్భాగమే. ఈనిర్మాణ కార్యకలాపమంతా కొనసాగించే ప్రత్యేక శాఖ మంత్రిమండలి అధ్వర్యాన పనిచేస్తున్నది. అనేక శాస్త్ర పరిశోధనాలయాలూ, మునిసిపల్ సంస్థలూ, నగరనిర్మాణ సమస్యలను గురించి కృషిచేస్తున్నాయి. ఉన్నత విద్యాసంస్థల్లో యీ నిర్మాణానికి ముందు ప్రాథమికదశలో అవసరమయ్యే

"నమూనాలు" యింజనీర్లు తయారు చేస్తున్నారు. ఈ సంస్థల్లోనే యీ ఇంజనీర్లు కూడా తర్ఫీదౌతున్నారు.

---

**89.—సోవియట్ ప్రభుత్వం బహూకరించే పతకాలు ఎలాంటివి ?**

సోషలిస్టు సమాజనిర్మాణంలో ప్రముఖపాత్ర వహించి దేశసేవచేసే వ్యక్తులకూ, సోవియట్ దేశరక్షణలో గణనీయమైన సేవచేసే వారికీ,— వ్యక్తులుగానీ, సమిష్టిసంస్థలుగానీ, సైనికదళాలుగానీ సోవియట్ ప్రభుత్వం పతకాలు, బిరుదులూ, బహూకరిస్తూంది. సోవియట్ ప్రభుత్వం స్థాపించబడ్డ కొత్తల్లో దేశరక్షణ కార్యక్రమంలో వీరోచిత పాత్ర నిర్వహించిన సైనికులకు 'ఆర్డర్ ఆఫ్ బానర్' అనీ, ఉత్పత్తి కార్యక్రమంలో సేవచేసిన వారికి 'ఆర్డర్ ఆఫ్ రెడ్‌బానర్ ఆఫ్ లేబర్' అనీ రెండు బిరుదులు మాత్రమే సృష్టించబడ్డాయి. తర్వాత, పైవాటికన్నా గౌరవప్రదమైన "ఆర్డర్ ఆఫ్ లెనిన్" అనే బిరుదునుగూడా సోవియట్ ప్రభుత్వం సృష్టించింది. ఇవి కాక యితర పతకాలు కూడా బహూకరించడం ప్రారంభించింది. గడచిన మహాయుద్ధంలో యింకెన్నో బిరుదులు పతకాలు సృష్టించి, వివిధ రంగాల్లో గణనీయమైన సేవచేసిన దేశభక్తులకు బహూకరించింది. (స్థలవిస్తరభీతిచే వీటినన్నిటినీ యిక్కడ ఉదహరించడంలేదు. అనువాదకుడు.)

1944 లో సుప్రీం సోవియట్ అధిష్ఠానవర్గం బహు కుటుంబీకులైన తల్లులకు ప్రత్యేక బిరుదులిచ్చింది. పది బిడ్డలను కన్న తల్లులకు "వీరమాత" లనీ మొదలైన బిరుదులు స్త్రీలకు ప్రదానం చేసింది ప్రభుత్వం. దేశరక్షణలో ధైర్యసాహసాలు ప్రదర్శించిన పౌరులకు "హీరో ఆఫ్ సోవియట్ యూనియన్" అనే బిరుదు ప్రదానం చేయబడ్డది.

---

**80—స్టాలిన్ బహుమతులంటే ఏమిటి? అవి యెవరికి యెలా బహూకరించబడతాయి?**

స్టాలిన్ 60 వ జన్మదినోత్సవ సందర్భంలో ఆయన గౌరవార్థం స్టాలిన్ బహుమతులివ్వడం ప్రారంభమైంది. లెనిన్ మరణానంతరం సోవియట్ రాజ్యానికి సారథ్యంవహించి అనేక చరిత్రాత్మక విజయాలను సాధించిన స్టాలిన్ జ్ఞాపకార్థం యీ బహుమతులేర్పాటుచేయబడ్డాయి. విజ్ఞానశాస్త్రం, కాల్పనిక శక్తి ప్రదర్శన,సాహిత్యం, కళాశాస్త్రం మొదలైన రంగాల్లో ప్రముఖసేవ చేసినవారికీ బహుమతు లివ్వబడతాయి. ఇవి మూడు తరగతులుగావుంటాయి; ఈ మూడూ ధనరూపంలో వుంటాయి. ఈ ధనంతోపాటు "స్టాలిన్ బహుమతి గృహీత" అనే బిరుదుగూడా యివ్వబడుతుంది. ఇవిగాక యీ బహుమతులు పొందినవారికి స్టాలిన్‌చిత్రం పొదగబడ్డ ఒక బంగారు, వెండి బాడ్జీగూడా యివ్వబడుతాయి. వివిధ కళారంగాల్లోనూ, విద్యా, వైజ్ఞానిక, పారిశ్రామిక, చిత్రకళ, శిల్పం, సంగీత,

నాటక, నవలారచన, సినిమా మొదలయిన రంగాల్లో విశిష్ట మైన పాండిత్యం ప్రదర్శించినవారికి, దేశసేవచేసినవారికీ యీ బహుమతులివ్వబడతాయి. ఎవరెవరికి బహుమతులివ్వాలో ఒకప్రత్యేక కమిటీచేత నిర్ణయించబడుతుంది. ఈ కమిటీలో వివిధరంగాల్లో అఖండ పాండిత్యం గడించిన మేధావులుంటారు. తమ నిర్ణయాలను మంత్రిమండలి కెరుకపరచిన తర్వాత, వారి ఆమోదంపొంది, స్టాలిన్ బహుమతులు పంచిపెడతారు.

194 -1950 మధ్యకాలంలో 6500 మంది సోవియట్ పౌరులీ బహుమతులు పొందారు. సోవియట్ పౌరులేగాక, వంద లాది విదేశీయులకుగూడా స్టాలిన్‌బహుమతులివ్వబడుతున్నాయి.

---

## 91.—యువక కమ్యూనిస్టు సంఘం అంటే ఏమిటి?

రాజకీయ చైతన్యస్థాయిలో అగ్రగాములైన సోవియట్ యువకులు లక్షలాదిగా యువక కమ్యూనిస్టు సంఘాల్లో సంఘ టితపరాతారు. 1918 లో యిది ప్రప్రథమంగా స్థాపించబడ్డది. దీనిలో ప్రస్తుతం 1 కోటి 20 లక్షల కార్మిక, కర్షక, మధ్యతర గతి మేధావులు సభ్యులుగావున్నారు. ఏ పార్టీకిచెందని సంస్థ అయినా, యీ యువక కమ్యూనిస్టు సంఘం కమ్యూనిస్టుపార్టీ నాయకత్వంక్రిందనే నడుస్తున్నది, 1924 లో లెనిన్ మహా శయుడు మరణించిన తర్వాత, ఆయన జ్ఞాపకార్థం యువక కమ్యూనిస్టు సంఘానికి ముందు "లెనిన్'' అనే పదం చేర్చ బడ్డది.

14 నుండి 26 సంవత్సరాల వయస్సుగల యువతీ యువకులు యీ సంఘంలో సభ్యులుగాచేరవచ్చు. సభ్యులుగా చేరగోరువారు సంఘ నిబంధనలు, కార్యక్రమం అంగీకరించి, దాన్ని అమలు జరపడానికి దీక్షపూనాలి. ఈ సంఘాలు పరిశ్రమల్లోను, ప్రభుత్వ, సమిష్టి వ్యవసాయ క్షేత్రాల్లోనూ, వివిధ సంస్థల్లోనూ, స్కూళ్లు, కాలేజీలు, విశ్వవిద్యాలయాల్లోను స్థాపించబడతాయి, కనీసం ముగ్గురైనా సభ్యులుంటేగాని సంఘ నిర్మాణాని కవకాశం ఉండదు. ప్రాథమిక సంస్థనుండి, కేంద్రకమిటీవరకు మహాసభాసమావేశం తరుణంలో రహస్య బ్యాలెటు విధానంపైన యెన్నుకోబడతాయి. సంఘసభ్యులకు, యువక ప్రపంచానికీ దేశభక్తిని గూర్చి, సోషలిస్టు రాజ్యాంగాన్నిగూర్చి విజ్ఞాన ప్రబోధంచేయడమే యువక కమ్యూనిస్టు సంఘాల ప్రధానకర్తవ్యం. రాజకీయ జీవితంలో యీ సంఘాలు చురుకుగా పాల్గొంటాయి. రాజకీయ కార్యనిర్వహణకు, సాహిత్య కళాక్షేత్రాల్లో సేవచేయడానికీ యువకులను తర్ఫీదివ్వడం గూడా యీ సంఘాల కార్యక్రమంలో ఒక భాగం. దేశానికంతకూ ప్రాముఖ్యమైన కార్యక్రమ నిర్వహణకు గూడా యీ సంఘాలు పూనుకుంటాయి. ప్రథమ పంచవర్షప్రణాళికసమయంలో కార్మికసంస్థల్లోని యువకకమ్యూనిస్టు సంఘాలు పోటీపడి పనిచేయ నారంభించాయి. ప్రధానంగా యువకుల అభివృద్ధికి యీ సంఘాలు పాటుబడ్డా, అన్ని తరగతుల సోవియట్ ప్రజానీకం యొక్క ఆదరణకు పాత్రమైనాయి. అవసరమైన సమస్యలమీాద ప్రభుత్వ మంత్రులతో

సమిష్టిగా గానీ, వ్యక్తిగతంగా గానీ చర్చించడానికి యీ సంఘాలకు అధికారం ఉంది.

ఈ సంఘాలకు ప్రత్యేకంగా గ్రంథాలయాలు, క్లబ్బులు, ప్రచురణశాఖలు, దినపత్రికలు, యితర వార, పక్షపత్రికలు ఉన్నాయి. యువక కమ్యూనిస్టు సంఘం యాజమాన్యాన ప్రకటించబడే మొత్తం పత్రికల సంఖ్య 40 లక్షలు. దేశానికిచేసిన మహత్తర సేవఫలితంగా యీ సంఘానికి యెన్నో బిరుదులు, పతకాలు, బహుమతులు లభ్యమైనాయి. ఈ యువక కమ్యూనిస్టు సంఘం ప్రపంచ యువజన సమాఖ్యకు అనుబంధ సంస్థగా పనిచేస్తున్నది.

---

**92.—యువక మార్గదర్శకులంటే (Young Pioneers) ఎవరు ?**

**9-14** సంవత్సరాల వయస్సుగల విద్యార్థులు యువక మార్గదర్శకులని పిలువబడుతారు. వీరంతా "లెనిన్ ఎంగ్ పయినీర్స్" సంఘానికి చెందినవారు. వీరి సంఖ్యాబలం 1 కోటి 90 లక్షలు. స్కూళ్ళకు, ఉపాధ్యాయులకు అవసరమైన సహాయం అందించడమే వీరి ప్రధాన బాధ్యత. ఆదర్శవంతమైన వీరి నడతవల్ల, యితర బాలురకు ఎన్నో సద్గుణాలు అలవడుతున్నాయి. యువకమార్గదర్శకుల అధ్వర్యంక్రింద వివిధ తరగతుల క్లబ్బులు అభివృద్ధిచెందాయి. యువక టెక్నీషియన్లు, రేడియోనిపుణులు, విమాన నిర్మాణకులు, కళాపిపాసులు-యింకెందరో వీరిలోనుంచి తర్ఫీదౌతున్నారు. వీరికిప్రత్యేకంగా

క్రీడా, వినోదకేంద్రాలు, ఆటస్థలాలు, పార్కులు వున్నాయి. ఎండాకాలంలో యీ పిల్లలంతా వినోదయాత్రలకు బయల్దేరి అమూల్యమైన అనుభవాలు సంపాదిస్తారు.

అనేక రంగాల్లో వీరు చూపే చొరవవల్ల, శ్రద్ధవల్ల, విజ్ఞానసముపార్జనయందు, శిక్షణయందు, శ్రమశక్తియందు, నీతినియమాలయందు, పెద్దలయందు గౌరవంచూపడంలోను, నిజాయితీ, సత్యసంధత, పరస్పర సౌహార్ద్రత, సంఘసేవ మొదలైన గుణాలయందు వీరికి ఆసక్తి యెక్కువౌతుంది.

---

## 93.—సోవియట్ రష్యాలో ఒక్కటే రాజకీయ పార్టీ ఎందుకున్నది?

సోవియట్ రష్యాలోవున్న రాజకీయపార్టీ ఒక కమ్యూనిస్టు పార్టీయే. దేశంమొత్తంలో ఒకే ఒక రాజకీయ పార్టీ ఉండడానికిగల కారణం, సోవియట్ సోషలిస్టు సమాజ లక్షణాలను పరీక్షిస్తే బోధపడుతుంది; సోవియట్ రష్యాలో పెట్టుబడిదారీవర్గంలేదు; జమీందార్లు, భూస్వాములులేరు; ఒక్కముక్కలో చెప్పాలంటే, యితరుల శ్రమశక్తిమీద ఆధారపడి వారిని పీడించుకుని జీవించేవర్గంగానీ, ప్రజలుగానీ సోవియట్ రష్యాలోలేరు. సోవియట్ రష్యాలో, కార్మికులు, కర్షకులు అని రెండే వర్గాలున్నాయి. వీరి ప్రయోజనాలు, లక్ష్యాలు విభిన్నమైనవికాక, ఒకటిగానే ఉంటాయి. అందుచేత, సోవియట్ యూనియన్‌లో అనేక పార్టీలతో అవసరంలేదు. ఒకే

ఒక రాజకీయపార్టీకి ఆధారం, ఆస్కారంగూడా వున్నాయి. ఇదే దేశవ్యాపితంగావున్న సోవియట్ కమ్యూనిస్టుపార్టీ.

గతించిన 50 సంవత్సరాల్లో రష్యాలో తలెత్తిన అన్ని ప్రధాన రాజకీయపార్టీలను సోవియట్ ప్రజలు పట్టిచూచారు; ఆచరణలో వాటిని సాకల్యంగా పరీక్షించారుగూడా; భూస్వాములపార్టీ, పెట్టుబడిదార్లపార్టీ, మెన్షెవిక్కులపార్టీ, ధనికరైతులపార్టీ, కమ్యూనిస్టుపార్టీ. కమ్యూనిస్టుపార్టీ ఒకటే ప్రజల పక్షానవున్న పార్టీఅనీ, యీ పార్టీ ఒక్కటే కార్మిక, కర్షక, మధ్యతరగతి ప్రజల ప్రయోజనాలను హక్కులను రక్షించగలదని గట్టినమ్మకం ఏర్పడ్డతర్వాత, సోవియట్ ప్రజలు యితర పార్టీలన్నింటినీకాదని త్రోసిపుచ్చి ఒక్క కమ్యూనిస్టు పార్టీ నాయకత్వాన్నే వరించారు. సోవియట్‌రష్యాలో కమ్యూనిస్టుపార్టీ, ప్రజలు కలిసి బలోపేతమైన ఒక ఐక్యశక్తిగా సంఘటితమైనారు.

---

## 94.—సోవియట్ కమ్యూనిస్టు పార్టీ నిర్వహించేపాత్ర ఏది?

సోవియట్ ప్రభుత్వాన్నీ, సోవియట్ ప్రజల్నీ నడిపే యేకైక రాజకీయపార్టీ కమ్యూనిస్టుపార్టీ. సోవియట్ యూనియన్‌లో నిర్మించబడుతున్న సోషలిస్టు సమాజాన్ని సోవియట్ ప్రభుత్వం నాయకత్వం వహించి నడుపుతున్నది. ఈ నిర్మాణకార్యక్రమంలో కార్మికులదే ప్రధానపాత్ర. కాని

మార్క్సిస్టు-లెనినిస్టు సిద్ధాంతబలంలేని ఒక రాజకీయపార్టీ లేకుండా కార్మికవర్గం ప్రభుత్వానికి నాయకత్వంవహించి నడప లేదు. కార్మికవర్గానికి నాయకత్వంవహించగల్గేది కమ్యూనిస్టు పార్టీ ఒక్కటే. కార్మికవర్గానికి కమ్యూనిస్టుపార్టీవల్ల గలిగే ప్రయోజనం, రాజకీయాధికారాన్ని హస్తగతంచేసుకోవడ మొక్కటేగాదు. స్వాధీనంచేసుకున్న అధికారాన్ని సుస్థిరం చేసుకోవడం, చివరకు కమ్యూనిస్టు సమాజాన్ని నిర్మించుటకు అధికారాన్ని వినియోగించుకొనడం. ఇదీ కమ్యూనిస్టుపార్టీ ఆశయం.

సోవియట్ రాజ్యాంగచట్టంలో 126 వ నిబంధన ప్రకారం సోవియట్ ప్రభుత్వంలో కమ్యూనిస్టుపార్టీ నిర్వహించవలసిన పాత్ర స్పష్టీకరించబడ్డది: "కార్మికవర్గంలోను, యితర శ్రమజీవుల్లోను ఉచ్ఛస్థాయిలో రాజకీయ చైతన్యంగల వ్యక్తులు కమ్యూనిస్టుపార్టీలో సమైక్యమౌతారు. శ్రమజీవులకు నాయకత్వం వహించగల్గేది కమ్యూనిస్టుపార్టీ ఒక్కటే. ఈ పార్టీ నాయకతానే సోషలిస్టు సమాజనిర్మాణం సాధ్యమౌతుంది. అన్ని ప్రజాసంస్థలకూ, ప్రభుత్వ సంస్థలకూ అధినేతగా వుండి, సోషలిస్టు సమాజాన్ని పటిష్టం చేయడంద్వారా, కమ్యూనిస్టు సమాజాన్ని నిర్మించగలిగేది ఒక కమ్యూనిస్టు పార్టీయే.''

సోవియట్ ప్రభుత్వంయొక్క అస్తిత్వానికీ, అభివృద్ధికీ, కమ్యూనిస్టుపార్టీ నాయకత్వం అత్యవసరం. బలమైన కమ్యూనిస్టుపార్టీలేనిదే, సోవియట్ ప్రభుత్వం గూడా పటిష్టమై అభివృద్ధిచెందలేదు.

సోవియట్ ప్రభుత్వంలో కమ్యూనిస్టుపార్టీపాత్ర యే విధంగా వ్యక్తీకరించబడుతున్నది?

ప్రభుత్వం, యితర ప్రజాసంస్థలు నడపవలసిన కార్య విధానమంతా కమ్యూనిస్టుపార్టి నిర్దేశిస్తుంది. ఏ ప్రధాన రాజకీయ నిర్మాణసమస్యనైనా, కమ్యూనిస్టుపార్టి నాయకత్వం లేకుండా యే యితర ప్రజాసంస్థగానీ, యే ప్రభుత్వ సంస్థగాని నిర్ణయించదు.

సోవియట్ ప్రభుత్వవ్యవహారాలను నడపటంలో ప్రభుత్వస్థానే, ప్రజాసంస్థలస్థానే కమ్యూనిస్టుపార్టి యెన్నటికీ వ్యవహరించదు.

కమ్యూనిస్టుపార్టి, ప్రజాసంస్థలద్వారా - అంటే సోవియట్ల ద్వారా (ట్రేడ్‌యూనియన్లు, యువక కమ్యూనిస్టు సంఘం, సమిష్టి వ్యవసాయక్షేత్రాలు, సహకార సంఘాలు మొదలైనవి) తన సూచనలను, పాలసీలను ప్రభుత్వానికి అందజేస్తుంది. ఈ సంస్థల్లో పనిచేసే లక్షలాది ప్రజలు కమ్యూనిస్టు నాయకత్వాన్ని మనసారా అభిలషిస్తున్నారు. తమ జీవితాన్ని యెంతో అభివృద్ధిచేసి నూతన సమాజాన్ని సృష్టించడానికి కమ్యూనిస్టుపార్టి కారణభూతమన్న సత్యాన్ని స్వానుభవం ద్వారా సోవియట్ ప్రజలెన్నడో గ్రహించారు. సోవియట్ ప్రజలు కమ్యూనిస్టుపార్టిని తమలో లీనంచేసుకున్నారు. వారికి పార్టియందు గాఢమైన భక్తి ప్రేమలు నాటుకున్నాయి. ఈనాడు సోవియట్ కమ్యూనిస్టుపార్టి ఆశయం, సోవియట్ ప్రజల ఆశయం ఒకటే — అదే కమ్యూనిస్టు సమాజ నిర్మాణం.

## 95.—కమ్యూనిస్టు పార్టీకి ప్రధాన బలం ఎక్కడనుంచి వస్తుంది ?

కమ్యూనిస్టుపార్టీ ప్రధానబలం అత్యుత్తమమైన విప్లవకరమైన మార్క్సిస్టు - లెనినిస్టు సిద్ధాంత పరిజ్ఞానమేనని పార్టీ; నిర్మాత లెనిన్ ప్రవచించాడు. ఆ యా పరిస్థితుల కనుగుణ్యమైన విధముగా మార్క్సిస్టు - లెనినిస్టు సిద్ధాంతాన్ని అన్వయించుకొని తన యెత్తుగడలను వ్యూహాన్ని రచించుకోడానికీ, సమాజం, వివిధవర్గాలు, వివిధసంఘటనలు యేమార్గాన నడుస్తున్నవో ఆకళింపు చేసుకోడానికి యీ సిద్ధాంతం కమ్యూనిస్టుపార్టీకి సహాయపడుతుంది, మానవ సమాజాభివృద్ధిని నిర్ణయించే సూత్రాలను, నిబంధనలనుగురించి పరిజ్ఞానం పొందడంద్వారా శాస్త్రీయదృష్టితో యెట్టి నూతన పరిస్థితులు, సంఘటనలు, రానున్నవో ఊహించేశక్తి కమ్యూనిస్టుపార్టీకి కలుగుతుంది; అంతేకాక సరైన విధానాన్ని నిర్ణయించుకొని, శ్రమజీవుల ప్రయోజనాలను సాధించేనిమిత్తం పరిస్థితులను అనుకూలంగా మార్చుకునేశక్తి నిగూడా కమ్యూనిస్టుపార్టీ సంపాదించుకుంటుంది. మార్గమధ్యంలో కలిగే అవరోధాలను ప్రతిఘటించి కమ్యూనిస్టు సమాజనిర్మాణంవైపు ప్రజలు పురోగమించే శక్తిగూడా మార్క్సిస్టు - లెనినిస్టు సిద్ధాంతం కమ్యూనిస్టుపార్టీకి కలుగజేస్తుంది.

ప్రజల్లో లీనమైన సోవియట్ కమ్యూనిస్టుపార్టీకి, అభేద్యమైన ప్రజల సంఘటితశక్తినుంచే బలం చేకూరుతుంది. కమ్యూనిస్టుపార్టి యెల్లప్పుడూ సోవియట్ శ్రమజీవులతో తనకు

గల బంధనాలను దృఢతరంచేసుకుంటుంది; ప్రజలు చెప్పేకునేది. వారి అవసరాలను అర్థం చేసుకుంటుంది. వారికి ప్రబోధం చేయడమేగాకుండా, వారినుండి నేర్చుకుంటుంది.

ఈ కారణంవల్లనే కష్టజీవుల సంపూర్ణ విశ్వాసాన్ని సోవియట్ కమ్యూనిస్టుపార్టి పొందగల్గింది. కమ్యూనిస్టుపార్టి తమ సౌఖ్యానికే పాటుపడుతుందని గ్రహించుకున్న సోవియట్ ప్రజలు పార్టిని విశ్వసించి, దాన్ని అనుసరిస్తారు. శ్రమజీవులలో కమ్యూనిస్టుపార్టి పెనవేసుకొనడమే దాని అజేయశక్తికీ, బలానికీ మూలాధారం.

## 9.—విమర్శ ఆత్మవిమర్శ అంటే ఏమిటి?

సోవియట్ రష్యాలో కార్మికులు, కర్షకులు, మేధావులు వారి దేశసౌభాగ్యానికి అధినేతలు. శ్రమజీవులంతా వారిసంస్థలు సంఘాలు, పరిశ్రమలు, సమిష్టిక్షేత్రాలు మహోన్నతంగా విలసిల్లాలనీ, ఉత్పత్తిశక్తి, వైజ్ఞానిక, సాంస్కృతిక విలువలూ దినదినాభివృద్ధి కావాలనీ కాంక్షిస్తారు.

ఈ కారణంచేతనే తమసభల్లోనూ, సమావేశాల్లోనూ సోవియట్ మహాసభల్లోనూ, పత్రికల్లోనూ కమ్యూనిస్టులూ, కమ్యూనిస్టులు కాని సోవియట్ ప్రజలూ, ప్రభుత్వ సంస్థల్లోనూ, ఇతర పరిశ్రమల్లోను జరిగే లోపాలను చర్చించి విమర్శిస్తారు. ఇలా విమర్శించేవ్యక్తులూ, సంస్థలూ తమ లోపాలనుగూడా విమర్శించుకుంటారు. ప్రభుత్వ

ధికార్లూ, ప్రజాప్రతినిధులూ ఇతరులయెడల అనుసరించే విధా నాన్నీ, తమ కార్యకలాపాలయెడల తామనుసరించే నైఖరినీ సోవియట్ ప్రజలు "బోల్షివిక్ విమర్శఅనీ, ఆత్మవిమర్శ" అనీ అంటారు. దీనికీ పేరురావటానికి కారణం, లెనిన్, స్టాలిన్ల చేత నడపబడ్డ బోల్షివిక్ పార్టి యీ నూతన విధానాన్ని ప్రయోగించడంవల్లనే. విమర్శ, ఆత్మవిమర్శ అనే సాధనాన్ని దైనందినంగా పార్టి అవలంబించే కార్యక్రమంలో గూడా ప్రయోగిస్తారు. కమ్యూనిస్టు సమాజాన్ని నిర్మించడంలో పార్టి సభ్యులూ, ప్రజలూ ఒకే ఆశయంతో కృషిచేస్తారు గనుక, అన్ని రంగాల్లోనూ, అన్ని శాఖల్లోనూ, వ్యక్తిగత నిత్యజీవితం లోను, విమర్శ, ఆత్మవిమర్శ విధిగా పాటిస్తారు.

సోవియట్ సమాజంలో విమర్శ, ఆత్మవిమర్శ వహించే పాత్రను వివరిస్తూ స్టాలిన్ యిలా అన్నాడు :—

"మనం ముందుకు పురోగమించాలని కోరుకుంటు న్నాం. ముందుకు పురోగమించాలని కోరుతున్నాం కాబట్టే, నిజాయితీలో మనలను మనమే విప్లవాత్మకంగా విమర్శించుకునే విధానాన్ని ప్రధాన కర్తవ్యముగా నిర్ణయించుకోవాలి. ఈ సాధనం ప్రయోగించందే ముందుకుపోవడమనేది ఉండదు. ఇది లేనిదే అభివృద్ధి శూన్యం."

సోవియట్ సామాజిక జీవితంలో విమర్శ, ఆత్మవిమర్శ మహాశక్తివంతమైన ఆయుధంగా పరిణామంచెందింది. ఈ ఆయు ధప్రయోగంవల్ల యెప్పటికప్పుడు వివిధరంగాల్లో లోటుపాట్లు సరిదిద్దబడి, యింకా ముందుకు పురోగమించాలనే ఉత్సాహం కల్గుతుంది. తాము సాధించినదానితో సంతృప్తిచెందక, యితో

ధికదీక్షతో దానికి వెయ్యిరెట్లు యెక్కువఫలితాలు సాధించాలనే కాంక్ష జనిస్తుంది.

దేశానికి సంబంధించిన సమస్యలను పరిష్కరించేందుకై లక్షలాది శ్రామికులను సమీకరించి, వారి చురుకుదనాన్ని, దేశభక్తిని కార్యదీక్షను యినుమడించి తామే తమ భవిష్యత్తుకు రూపురేఖల దిద్దుకునేవారిని ఉత్సాహపరుచుటకు విమర్శ, ఆత్మవిమర్శ సహాయపడుతుంది. ప్రజాసామాన్యానికి వివిధశాఖల్లో జరిగే అవకతవకలను, లోపాలను బహిరంగంగా విమర్శించే హక్కువుండడంవల్ల, సోషలిస్టు విధానంలో సిసలైన ప్రజాస్వామ్యం వున్నదని స్పష్టపడుతుంది. సోవియట్‌సమాజమంతటిలో యీసిద్ధాతం పరివ్యాప్తమైంది.

---

## 97.—సోషలిస్టుజాతులంటేయేమిటి ?

సోవియట్ యూనియన్‌లో అనేక జాతులున్నాయి. ఈ సోషలిస్టు సమాఖ్యలో 60 పెద్ద జాతులు, జాతీయవిభాగాలు, యితర శాఖలూవున్నాయి. బోల్షివిక్ విప్లవానికిపూర్వం జార్ కాలంలో, ఈ జాతులు గుర్తించబడలేదు; ఆదరించబడలేదు. వారి భాషా సంస్కృతులు అణచివేయబడ్డాయి. అనేక చిన్నచిన్న జాతీయులు జార్ యినుపపాదాలక్రిందపడి నసించారు. సోవియట్ సోషలిస్టు విప్లవంతో యీ జాతుల పరిస్థితి సంపూర్ణంగా మార్పుచెందింది. సోషలిస్టు నిర్మాణదశలో అణగారిపోయిన జాతులకు విముక్తికల్గింది. వారి అభివృద్ధికి మార్గం సుగమం చేయబడ్డది. పీడితవర్గాలు రష్యు

చేయబడి, సోషలిస్టు నిర్మాణం విజయవంతంగా పురోగమిస్తున్న ఫలితంగా, వివిధజాతులన్నీ సోషలిస్టు జాతులుగా విప్లవపరిణామం చెందాయి.

విప్లవానికి పూర్వమున్న జాతులకూ, యీనాడు పరిణామం చెందిన సోషలిస్టు జాతులకూ తేడాఏమిటి? పురాతన జాతులన్నీ పెట్టుబడిదారీ నాయకత్వం చేతుల్లోవుండేవి. ఆ జాతుల భవిష్యత్తంతా పెట్టుబడిదారీవర్గమే నిర్ణయించేది. దోపిడీవర్గాల దుష్పరిపాలనను శాశ్వతంగా సుస్థిరం చేసుకోడానికి విభిన్నవర్గాలమధ్య అసహజమైన కృత్రిమమైన 'శాంతి' 'సౌహార్ద' వాతావరణాన్ని ప్రబోధించేవి. తమరాజ్య విస్తరణకై యితరజాతుల భూప్రదేశాలను అక్రమంగా ఆక్రమించుకునేవి. పెట్టుబడిదారీవర్గం ఒకజాతికీ, మరొకజాతికీ మధ్య ద్వేషాసూయలు రెచ్చగొట్టేది. అల్పసంఖ్యాకులను అణచివేసేది. సామ్రాజ్యవాదులతో ఏకమై ప్రజలను పీడించుకుతినేది. పెట్టుబడిదారీవర్గాల నాయకత్వలక్షణం యిలా వుండేది. వీటి నాయకత్వాన ముగ్గేజాతులస్థితి యెలావుండేదో స్పష్టమాతుంది.

సోషలిస్టుజాతుల పరిణామం, వాటిలక్షణాలు పరిశీలిద్దాం. ఈ జాతులకు నాయకత్వంవహించి నడిపేది కార్మికవర్గమూ, కమ్యూనిస్టుపార్టి. ఈ కమ్యూనిస్టుపార్టి, కార్మికవర్గమూ జాతులను పీడించుకుతినే విధానానికి బద్ధశత్రువులు. కమ్యూనిస్టుసమాజ నిర్మాణంకొరకై కార్మికులు, కర్షకులు ఐక్యమౌతారు. జాతులను పీడించడము సంపూర్ణంగా, నిశ్శేషంగా నిర్మూలమైంది. ఈ నాడు అన్నిజాతులూ సమానావ

కాశాలతో, సౌహార్ద్రభావంతో, సాంస్కృతిక, విద్యా విజ్ఞాన విషయాల్లో సర్వతోముఖాభివృద్ధి చెందుతూ, భౌతికజీవితాన్ని సుఖప్రదంగా అనుభవిస్తున్నయ్. ఈ జాతులకు అంతర్జాతీయ సౌహార్దత, ప్రేమాదరణాలు జీర్ణించుకు పోయాయి. ప్రపంచములో యేమూలల బానిసత్వం, పరపీడనవున్నా, వారికి తమ సహకారాన్ని అందించడం, యుద్ధాలకు వ్యతిరేకంగా ఐక్యసంఘటనతో పోరాడడం యీనాడు రూపొందిన సోషలిస్టుజాతుల విశిష్టలక్షణాలు.

ఏ పెట్టుబడిదారీ దేశంకన్నా గూడా, సోవియట్ దేశంలోని సోషలిస్టు జాతులు సమైక్యంతో సంఘటితపడ్డాయి. ఈజాతుల్లో వర్గకలహాలనూ, వర్గద్వేషాలనూ కాగడాపెట్టి వెతికినా కన్పించవు. సోషలిస్టు సమాజంలో పరపీడన నిర్మూలించబడ్డది. కనుకనే విభిన్నప్రయోజనాలుగల వర్గాలులేవీనాడు.

పెట్టుబడిదారీ రాజ్యాలమధ్యవుండే సంబంధబాంధవ్యాలు పరస్పర అనుమానాస్పదంగానూ, ద్వేషపూరితంగానూ వుంటాయి. కాని సోషలిస్టుదేశాలమధ్య అన్యోన్య సహకారం, సౌభ్రాతృత్వం, సౌమనస్యం నెలకొంటాయి. సోవియట్‌లోని వివిధ జాతులన్నీ స్నేహ, సౌహార్ద్రభావాలతోగూడిన ఒక కుటుంబంలాంటిది. ఈ స్నేహ సౌహార్ద్రాలే సోవియట్ సమాజానికి యింతటి బలిష్టత చేకూర్చిపెట్టినై. ఈ విషయాన్నే స్టాలిన్ తన గ్రంథాల్లో, ఉపన్యాసాల్లో అనేకసార్లు ఉద్ఘాటించాడు.

సోషలిస్టు జాతులన్నీ సమైక్య కృషితో సోవియట్ రష్యాలో కమ్యూనిస్టు సమాజాన్ని నిర్మిస్తున్నాయి. ఈ ఆశయ

సాధనకై కావలసిన ఆర్థిక, రాజకీయ, వైజ్ఞానిక శాస్త్రీయ సాధన సామగ్రియావత్తూ వారికి పుష్కలంగా వున్నది. ఈ కారణంచేతనే సమస్తజాతులూ శరవేగంతో పురోగమిస్తూ, రాజకీయ, ఆర్థిక, సాంస్కృతిక అభ్యుదయాన్ని సాధిస్తున్నాయి.

---

## 98.— 'సోవియట్‌లో దేశభక్తి' అంటే ఏమిటి ?

దేశంపట్లగల ప్రేమాభిమానాలనే దేశభక్తి అని అంటాం. కష్టించి పనిచేసే ప్రతివ్యక్తికీ, ప్రతిజాతికీ దేశభక్తి సహజంగా వుంటుంది. మానవ చరిత్రనుబట్టి కార్మికులూ, కర్షకులూ, అభ్యుదయకరమైన మేధావులు మాత్రమే నిజమైన దేశభక్తు. లని రుజువౌతుంది. దీనికి కారణమేమంటే, దేశంలోని భౌతిక, వైజ్ఞానిక, సాంస్కృతిక సంపదనంతా శ్రమించి సృష్టించేది వీరేకాబట్టి.

సోవియట్ స్త్రీ పురుషులంతా గాఢమైన దేశ భక్తులు తమ మాతృదేశాన్నెంతో ప్రేమించి సేవచేస్తారు. సోషలిస్టు విప్లవం విజయవంతంగా పురోగమిస్తున్నకొద్దీ, సోవియట్ ప్రజల దేశభక్తి మరింతగా వికసించింది. పీడితవర్గాలు, పర పీడన నిర్మూలంకాగానే సోవియట్ ప్రజలు అత్యుత్సాహంతో, అనుపమాన దేశభక్తితో తమ విధ్యుక్త ధర్మాన్ని నిర్వహించడం మొదలెట్టారు. గత మహాయుద్ధంలో సోవియట్ స్త్రీ పురుషాదులు ప్రకటించిన అఖండ దేశభక్తి అసమానమైనది; తమ మాతృభూమిని ఫాసిస్టులనుండి రక్షించుకోడానికై తుది

రక్తపుబొట్టువరకు పోరాడుతారని ఆ మహాయుద్ధంవల్ల రుజువైంది. యుద్ధరంగంలోనూ, యితర రంగాల్లోగూడా స్త్రీ పురుషులు ప్రదర్శించిన ధైర్యసాహసాలు వాళ్ళ దేశభక్తిని చాటిచెప్తాయి.

సోవియట్ దేశభక్తికి చిహ్నాలు, తమదేశంమీద ప్రేమా దాన్ని బలపరచే సిద్ధాంతకృషీమాత్రమేగావు. ఈ దేశభక్తి అంతకన్న సవ్యమైనదీ వున్నతమైనదికూడా. సోవియట్ ప్రజలు ఒక్క తమదేశాన్ని ప్రేమించే దేశభక్తులేకాదు. వారు విశ్వమానవ ప్రేమగల ప్రజలు. ఇతర దేశాల యితర జాతుల స్వేచ్ఛా స్వాతంత్ర్యాలను గౌరవించి మన్నిస్తారు. అన్ని జాతులను సమానత్వం సౌభ్రాతృత్వాలతో ఆదరించడం సోవియట్ దేశభక్తి విశిష్టలక్షణం. ఇందుకే అంతర్జాతీయ సభల్లో, ప్రతిజాతీ సంపూర్ణ స్వేచ్ఛా, స్వాతంత్ర్యలతో బ్రతకాలని సోవియట్‌రష్యా అనేకసార్లు ఉద్ఘాటించింది. ఇదే అభిప్రాయాన్ని ఐక్యరాజ్యసమితిలో పెక్కుసార్లు పునరుద్ఘాటించింది. దురాక్రమణ విధానం, ఇతరదేశాల స్వాతంత్ర్యాన్ని అణగద్రొక్కడం సోవియట్‌ప్రజలు,ప్రభుత్వం తీవ్రంగా నిరసించి ద్వేషిస్తారు. వివిధజాతులమధ్య స్నేహసౌహార్ద సంబంధాలు నెలకొల్ప సుస్థిరంచేసిన స్టాలిన్ సోవియట్‌దేశభక్తికుండవలసిన ప్రత్యేక విశిష్ట లక్షణాలను వివరిస్తూ ఇలా చెప్పాడు:

" సోవియట్ దేశభక్తియొక్క శక్తిపటుత్వాలు వివిధ తెగల మధ్య, జాతులమధ్య పరస్పర ద్వేషాసూయలమీద గాక, సోవియట్ మాతృభూమి యెడల గాఢమైన భక్తి విశ్వా

సాలమీద, దేశంలో నివశించే అన్ని జాతుల శ్రామిక ప్రజల సౌభ్రాతృత్వం సహకారంమీద ఆధారపడి ఉంటుంది. సోవియట్ శ్రామిక ప్రజల సమిష్టిప్రధాన ప్రయోజనాలయొక్క, ప్రజల జాతీయ సాంప్రదాయాలయొక్క సోవియట్ సరససమ్మేళనమేసోవియట్ దేశభక్తి. సోవియట్ దేశభక్తి మనదేశంలో నివసిస్తున్న వివిధ జాతులు, జాతీయవిభాగాలను అనైక్యపరచక పోగా పైపెచ్చు ఒక సౌహార్ద్రకుటుంబంలోకి సమైక్యపరుస్తుంది. సోవియట్ యూనియన్‌లో వివిధ జాతులమధ్య అవిచ్ఛిన్నంగా దిన దినాభివృద్ధి చెందుతున్న మైత్రికి యిదే పునాదిగా పరిగణించబడుతుంది. ఇదేసమయంలో, యితరదేశాల హక్కులను, స్వేచ్ఛాస్వాతంత్ర్యాలను సోవియట్ ప్రజలు గుర్తించి గౌరవిస్తారు; ఇరుగుపొరుగు దేశాలతో శాంతి సుహృద్భావాలతో కలిసి జీవించడానికి సోవియట్ ప్రజలు తమ సంసిద్ధతను యెల్లప్పుడూ ప్రకటిస్తూ వచ్చారు కూడా.''

ఇదే సోవియట్ దేశభక్తియొక్క సారాంశం.

---

## 99.—కార్మిక నియంతృత్వం అంటే ఏమిటి ?

ఒక దేశంలో పెట్టుబడిదారీ వర్గ అధికారాన్ని కూలద్రోసి, దానిస్థానే కార్మికవర్గ అధికారాన్ని స్థాపించడమే కార్మికవర్గనియంతృత్వం అనిపిలువబడుతుంది. కాపిటలిస్టు వ్యవస్థ

నుండి కమ్యూనిస్టు వ్యవస్థవరకూ పరిణామంచేందే వివిధసామాజిక దశల్లో కార్మికవర్గ నియంతృత్వం కొనసాగుతుంది. ఈపరిణామదశలో, ప్రభుత్వ అధికారనిర్వహణలో వున్న కార్మిక వర్గం యీ క్రింది విధులను నిర్వహిస్తుంది.

1. ఓడించబడి కూలద్రోయబడ్డ దోపిడీవర్గాలు తిరిగి తమ అధికారాన్ని పునస్థాపనచేసుకునే ప్రయత్నాలను అణచి వేస్తుంది. పెట్టుబడిదారీ రాజ్యాలు తమమీద చేసే ఆకస్మిక దాడులనుండి ఆత్మరక్షణ చేసుకునేందుకై దేశరక్షణ నిర్మించుకుంటుంది.

2. పెట్టుబడిదారీ భూస్వామ్యవ్యవస్థలక్రింద పీడించబడే శ్రమజీవులైన రైతులు, తదితరప్రజానీకంతో సన్నిహిత స్నేహ సౌభ్రాతృత్వం సుస్థిరంచేసుకుంటుంది; సోషలిస్టు సమాజనిర్మాణంకొరకు కార్మిక, కర్షక, మధ్యతరగతి మేధావులందరిని సమీకరించి, సమిష్టికృషితో పురోగమనాన్ని సాగిస్తుంది. ఈ వర్గాలన్నిటిమీద కార్మికవర్గ నియంతృత్వ ప్రభుత్వం నాయకత్వం వహించి, దేశపరిపాలనా వ్యవహారాల్లో చురుకుగా పాల్గొనేలా సమీకరించి ప్రజల్లో సోషలిస్టు సిద్ధాంతరీత్యా విజ్ఞాన ప్రబోధం చేస్తుంది.

3. జాతీయ ఆర్థికవిధానంలో దోపిడీవర్గాలనూ పెట్టుబడిదారీచిహ్నాలను పూర్తిగాతుడిచివేస్తుంది. ఆర్థికవిధానాన్ని ప్లాను ప్రకారం నిర్మించి అభివృద్ధికిమార్గం సుగమంచేస్తుంది. ప్రతి జీవితరంగంలోనూ సోషలిస్టు విజయాన్ని సాధించడానికి అవిరళ కృషిచేస్తుంది. ఈవిధంగా పరిణామంచెందే సోషలిస్టు సామాజిక జీవితాన్ని వర్గరహితమైన కమ్యూనిస్టు సమాజానికి చేరేవరకు

కార్మికవర్గ నియంతృత్వమే పైచెప్పిన విధ్యుక్తధర్మాలను విప్లవ దీక్షతో కొనసాగిస్తుంది.

పెట్టుబడిదారీ దేశాలు ప్రపంచంలో ఉండేవరకూ, సోవియట్ కమ్యూనిస్టు సమాజం నిర్మాణమైనా, వాటి సరసనే కార్మికవర్గ నియంతృత్వ ప్రభుత్వం అధికారం చలా యిస్తూనే ఉంటుంది. సోవియటురష్యా చుట్టూ పెట్టుబడిదారీ దేశాలస్థానే సోషలిస్టుదేశాలు అవతరించగానే, కార్మికవర్గ నియంతృత్వం అంతరిస్తుంది.

కార్మికవర్గ నియంతృత్వాధికారం అన్ని దేశాల్లోనూ ఒకేవిధంగా ఉండదు. సోవియట్ రష్యాలో, శ్రామిక ప్రజా ప్రతినిధుల సోవియట్ స్వరూపం ధరించింది. ద్వితీయప్రపంచ యుద్ధానంతరం ఆల్బేనియా, బల్గేరియా, హంగరీ, పోలెండు, రుమేనియా, జెకస్లోవేకియా మొదలైన మధ్య, ఆగ్నేయ యూరప్ దేశాల్లో కార్మిక నియంతృత్వ రాజ్యాలవతరించాయి. ఈ దేశాల్లో యీ నియంతృత్వాధికారం నూతనప్రజాస్వామిక ప్రభుత్వస్వరూపం దాల్చింది. సోవియట్ రష్యాలోను, పైన జెప్పిన నూతన ప్రజాస్వామిక దేశాల్లోను, ప్రభుత్వ నిర్వహ ణాధికారం ప్రధానంగా ఉత్తమరాజకీయ చైతన్యంకల్గిన కార్మిక వర్గం చేతిలోవుంటుంది. కార్మిక, కర్షక వర్గాలమధ్య విప్లవ ఐక్యతను, సోదరత్వాన్ని పెంపొందింపజేసి, తాను నాయకత్వం వహించి నడపడమే కార్మికవర్గ నియతృత్వంయొక్క ఉన్నత సిద్ధాంతం. సోవియట్ యూనియలో శ్రామికవర్గనియంతృత్వ విధానానికి కమ్యూనిస్టుపార్టినాయకత్వంవహించి నడుపుతున్నది. పై పేర్కొన్న నూతన ప్రజాస్వామికదేశాల్లో కమ్యూనిస్టు,

మార్క్సిస్టు వర్కర్స్ పార్టీలు నాయకత్వంవహించి దేశాన్ని నడుపుతాయి.

సోవియట్ యూనియన్, యితర నూతన ప్రజాస్వామిక దేశాల రాజ్యాంగచట్టాలప్రకారం, ఆయా దేశాల కమ్యూనిస్టు, మార్క్సిస్టు వర్కర్సపార్టీలకు ప్రజాభీష్టంతో శాసనాధికార హోదా సంక్రమింపజేయబడ్డది.

---

## 100.—కమ్యూనిజం అంటే ఏమిటి?

సోవియట్ ప్రజలు సోషలిస్టు సమాజాన్ని నిర్మించుకుని కమ్యూనిస్టు వ్యవసాయనిర్మాణదశలో పురోగమిస్తున్నారు. కమ్యూనిజం అంటే ఏమిటో, కమ్యూనిజానికీ సోషలిజానికీగల భేదం ఏమిటో విచారిద్దాం.

శాస్త్రీయమైన కమ్యూనిస్టుతత్వసిద్ధాంతం, మహనీయులైన మార్క్స్, ఎంగెల్సులచేత రూపొందించబడ్డది. ఈసిద్ధాంతాన్ని సర్వసమన్వితంగాను, సర్వతోముఖంగాను లెనిన్, స్టాలిన్ మహానాయకులు అభివృద్ధిపరచారు. ఈ సిద్ధాంతంప్రకారం, సామాజిక పరిణామంలో సోషలిజమూ, కమ్యూనిజమూ కమ్యూనిస్టుసమాజమనే ఒకే సాంఘికవిధానంయొక్క రెండు దశలని నిరూపించబడ్డది.

ఈ పరిణామంలో సోషలిజం మొదటిదశ; కమ్యూనిజం రెండవ ఉన్నతదశ. ఈ రెండుదశలకూ ఎన్నో పోలికలున్నా, భేదంగూడా వుంది. రెండింటికీవున్న పోలికలివ్వి:

సోషలిస్టు, కమ్యూనిస్టు సమాజాలు రెండింటిలోనూ, వుత్పత్తి పరికరాలన్నీ సమాజంయొక్క సమిష్టి ఆస్తిగా పరిగణించబడతాయి. వుత్పత్తి శక్తులకూ, వుత్పత్తి సంబంధాలకూ మధ్య వైరుధ్యాలులేవు. పైపెచ్చు రెంటికీమధ్య పరస్పర అనుకూల్యత వుంటుంది. సోషలిస్టు వ్యవస్థలోగానీ, కమ్యూనిస్టు వ్యవస్థలోగానీ, ప్రజల హక్కులు, అధికారాలు హరించబడవు; నిరంకుశపాలన అంతమవుతుంది. ఇతర జాతులను పీడించడంగానీ, ఒకవ్యక్తి మరొక వ్యక్తిని దోచుకుతినడంగానీ మాయమవుతాయి. రెండుదశల్లోనూ, జాతీయ ఆర్థిక విధానం ప్లాను ప్రకారం అభివృద్ధవుతుంది. ఆర్థిక సంక్షోభం, నిరుద్యోగం, పేదరికం మటుమాయమవుతాయి. రెండు దశల్లోనూ, ప్రతివ్యక్తికీ తన శక్తికొద్దీ పనిచేసే భాధ్యత వుంటుంది.

అయితే సోషలిజానికీ కమ్యూనిజానికీ తేడా ఏమిటని అడగవచ్చు.

సోషలిస్టు విధానంలో వుత్పత్తి శక్తులు ఎంత వుచ్ఛస్థాయిలో అభివృద్ధి కావడానికి వీలవుతుందో అంతవరకూ వృద్ధి చెందుతాయి. ఉత్పత్తి వున్నతస్థాయి అందుకొన్నప్పుడు ''ప్రతి వ్యక్తీ తనశక్తికొద్దీ కృషిచేయాలి, కృషికి తగిన ఫలితం అనుభవించాలి'' అనే సిద్ధాంతం ఆచరణలో వుంటుంది. అంటే వుత్పత్తి పరిమాణాన్నిబట్టి, నైపుణ్యాన్నిబట్టి, ప్రతివ్యక్తీ జాతీయసంపదలో తనవంతు అనుభవిస్తాడన్నమాట.

కాని కమ్యూనిస్టు సమాజంలో వుత్పత్తి శక్తులు అత్యున్నతస్థాయిలో వూహించనంతగా అభివృద్ధవుతాయి. అత్యున్నతమైన సాంకేతిక, శాస్త్రీయ పరిజ్ఞానం అభివృద్ధయినందువల్ల,

…ౌతిక సంపద అపరిమితంగా పెంపొందుతుంది. ప్రతి జాతీయ, ఆర్థిక రంగంలోనూ వుత్పత్తి విధానం శరవేగంతో దానంతట అది సాగిపోతుంది. అవకాశమున్న శక్తినంతా వినియోగించి ప్రతివ్యక్తీ తాను వుత్పత్తి చేయగలిగినంతా చేస్తాడు. ఈ విధంగా వుత్పత్తయిన సంపద ప్రజలకు పుష్కలంగా లభ్యమౌతుంది. ఈ నూతన పరిస్థితినిబట్టి కమ్యూనిస్టు సమాజంలో "ప్రతివ్యక్తీ శక్తికొద్దీ కష్టించాలి, అవసరంకొద్దీ ప్రతిఫలం పొందవచ్చు"ననే కొత్త సూత్రం అమల్లోకి వస్తుంది.

కమ్యూనిజం అంటే గిట్టనివారు ప్రజలందరి అభిరుచులు, అవసరాలు ఒకే మట్టంలో వుంటాయని వాదిస్తారు ఇలా వాదించడం కమ్యూనిజాన్ని అపార్థం చేసుకొని దుష్ప్రచారం చేయడమవుతుంది. ఇది చాలా నీచమైన ప్రవృత్తి. ఎందువల్లనంటే, సోషలిజంలోగానీ, కమ్యూనిజంలోగానీ, ప్రజల అభిరుచులు, అవసరాలు పరిమాణంలోగాని, గుణంలోగాని ఎన్నటికీ ఒకేస్థాయిలో వుండవు. వుండనేరవు.

నాగరికులైన ప్రజలకోర్కెలన్నీ కమ్యూనిస్టు సమాజంలో సంతృప్తిగా అనుభవించడానికి సంపూర్ణావకాశాలుంటాయి. సోషలిష్టుదశలో కార్మికులు, కర్షకులూ, మేధావులు అనే శ్రామికవర్గాలకు చెందిన వివిధ తరగతులుంటాయి. వాళ్ళమధ్య తారతమ్యాలుంటాయి. కమ్యూనిస్టు దశలో యీ వర్గతారతమ్యాలుండవు. ప్రజానీకమంతా సమైక్యమైన వర్గరహిత సమాజంలో శ్రమజీవులుగా వుంటారు. సోషలిస్టు వ్యవస్థలో యింకా పట్టణానికీ, గ్రామానికీ తేడా వుంటుంది. కమ్యూ

నిష్టు వ్యవస్థలో పట్టణానికీ గ్రామసీమకూ, అంటే పరిశ్ర లకూ, వ్యవసాయానికీ చెప్పదగ్గ తేడా యేమీఉండదు.

సోషలిష్టు దశలో మానసిక, శారీరక శ్రమకు మధ్య కొంతభేదం ఉంటుంది. కార్మికులకూ, కర్షకులకూ సాంస్కృతిక, సాంకేతికస్థాయి యింకా తగినంత ఉచ్చదశలో ఉండక పోవడమే దీనికికారణం. కమ్యూనిష్టువ్యవస్తలో ఈ తేడా అంతరిస్తుంది; శ్రామికులందరియొక్క సాంకేతిక సాంస్కృతికస్థాయి ఇంజనీర్ల, టెక్నిషియన్లయొక్క స్థాయి నందుకుంటుంది.

సోషలిష్టు దశలోగూడా కొందరు వ్యక్తుల్లో పెట్టుబడి దారీ విధానంలోగల సహజ లక్షణాలను గలిగిఉండటంచేత, కష్టించి పనిచేయాడానికి ముందుకురారు. తమరు పడేశ్రమ స్వల్పమైనా, అత్యధికంగా ప్రతిఫలం పొందాలనే దుర్లక్షణాలు దురాశ త్వరలో వదులుకోలేరు. కాని కమ్యూనిష్టువ్యవస్థలో పెట్టుబడిదారీ వ్యవస్థ అవశేషాలు అదృశ్యమౌతాయి.

కమ్యూనిష్టు సమాజంలో, శ్రమచేయడం కేవలం పొట్టపోసుకొని జీవించడానికి మాత్రమేకాదు. శ్రమచేయడమనేది మానవుని జీవితంలో ప్రధానకర్తవ్యంగాను, అవసరంగాను గుర్తిస్తారు. సోషలిజానికీ కమ్యూనిజానికీగల తేడాయిదే. ఇవే కమ్యూనిష్టు సమాజంయొక్క ప్రధాన లక్షణాలు.







# మనసు ఫౌండేషన్ పుస్తకాల పరిశీలనాపట్టిక

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | TPLA19.7B152 |
| పుస్తకం పేరు | సోవియట్ రష్యా |
| తారీఖు | 29/10/24 |
| ముందు అట్ట | NO |
| వెనుక అట్ట | NO |
| మొత్తం పేజీలు | 203 |
| పెద్ద సైజు పేజీలు | NO |
| ఖాళీ పేజీలు | 6 |
| లేని పేజీలు | NO. |
| తయారు చేసినది | Aswini |
| పేజీలు విడదీసినది | thasin |
| స్కాన్ చేసినది | Sumitha |
| పరీక్ష చేసినది | pragathi |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| పరిస్థితి | good |